శ్రీరామాయనమః.

# శ్రీకౌసల్యాపరిణయము.



వావిలికొలను సుబ్బరాయ ప్రణీతము.



ఇది,

శ్రీమద్వినగడప, ఉండ్రాజవరము లోనగు తాలూకాల జమీందారులైన
మహారాజశ్రీ

శ్రీరాజా వెల్లంకి వేంకట రామారావు బహద్దరు గారిచే

గౌరవవశంబునఁ దొలుతఁ బ్రకటితమై

చెన్నపురి,

సోల్డన్ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది.

మూడవ కూర్పు.

1929.





వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
౨౯౨, ఎస్ప్లనేడ్ చెన్నపురి.

# మొదటికూర్పు పీఠిక.

శ్రీ కౌసల్యాపరిణయ మను నీకావ్యమును హూణశకాబ్దము ౧౮౯౪-వ సంవత్సరము మార్చినెల ౧౬-వ తేదికి సరియగునట్టి విజయ సంవత్సర ఫాల్గున మాస శుద్ధపక్ష ౧౦ శుక్రవారంబున గడపమండలమందలి రాజంపేటతాలూకా మోబ్ళి గ్రామము గణకవరుండగు బ్రహ్మశ్రీ గౌరవరము చెంచయార్యుచే నిర్దిష్టమైన శుభ ముహూర్తంబున మాతృప్రేరణంబునను మిత్రబోధంబునను బ్రారంభించి, ౧౮౯౪-వ సంవత్సరము నవంబరు నెలకు సరియైన జయసంవత్సర కార్తికమాసంబున సాంతంబుం గావించితి. ఇది యస్మన్మిత్రులకు విదితమే. అప్పుడు కడపమండలమునందలి రాజంపేట తాలూకాలోని పొత్తపి నాటిలోఁ జేరిన టంగుటూరను గ్రామమునందుఁ బ్రథమ మైన విన్యాసపరీక్షకుఁడు (రివిన్యూ ఇన్‌స్పెక్టర్) గ రాజకీయోద్యోగంబున నుంటిని. దీని వ్రాఁతప్రతిని గృతిపతియగు భద్రాచలరఘుపతికి సమక్షంబున సమర్పించి పదంపడి ప్రకటింప నెంచి వెంటనె ముద్రింపఁ బూననైతిని. అనంతరము సంప్రాప్తమైన ప్రభూతప్రత్యూహావశంబునను, క్షయఘుపీడాజనితజీవనవిన్యాసంబులనను, నాకోరిక నెఱవేఱదయ్యె. "అన్యథాచిన్తితం కార్యం, దైవమన్యత్ర చిన్తయే" త్తనట సుప్రసిద్ధమే కదా. ఇట్లుండ భగవదనుగ్రహమువలనను, మ-రా-రా-శ్రీ, సమర్తి రంగయ్య శ్రేష్ఠి బి.ఏ., ఎల్. యన్. యు, గారి సాహాయ్యమువలనను, నీ తిరువల్లిక్కేణియందుండు హిందూపాఠశాల యధ్యక్షుల కరుణను, నేనీ యుపాధ్యాయోపజీవికాను సారినైతినిగాని ప్లవ యంతయు నా కుపప్లవకారియ యయ్యె. పెక్కుమాటలేల. నాజీవుం బెన్నివారంబులో నాకద్వారకవాటనోద్యమపరుం డయ్యెంగాని తద్ద్వారరక్షకులచే విఫలీకృత ప్రయత్నుండయ్యె. ఎక్కటి నిట నిట్టి యిక్కట్ల నుండ "మిత్ర మాపత్సుజానీయా" త్తనునానుడి సరిదాఁక నస్మన్మిత్రులగు బ్ర॥శ్రీ మ-రా-రా-శ్రీ, లంకలపల్లి వేంకట సుబ్బయ్య ఎం. ఏ. గారును బ్ర॥శ్రీ. మ-రా-రా-శ్రీ, కొత్తపల్లి వేంకట పద్మనాభశాస్త్రిగారును నొనర్చిన నిర్నిద్రసాహాయ్యంబునన మొదలఁ బ్రాణంబు లెట్టెట్టో చిక్కంబట్టియుండిటింగాని తుద కది దుస్సాధమనియెంచి యవివాహితకన్యవోలెనున్న యీకావ్యకన్యంగాంచి దైవకృపరాదాయె దీని నుముద్రించి కనులారఁగాంచు భాగ్యంబు లేదాయె, నని చింతించి మీఁదఁ బేర్కొనిన మిత్రులకు దీని మీరు మైత్రికారణంబునన నాయనంతరము ముద్రింపించి ప్రకటింపుఁడని యప్పగించి జీవజీవనంబులపై నాశ చాలించి నాయభిజనం బగుకడపకుఁబోయితి. ఆహా! దైవతంత్రము!!

"యచ్చిన్తితం తదిహ దూరతరం ప్రయాతి
యచ్చేతసా నగణితం తదిహాభ్యుపైతి."

కం. సుభువుగ నగు నని యెయ్యది
దలఁతుమొ యది యేగు మిగుల ♦ దవుదవ్వగుచుం
గలలోనే నెది యగు నని
తలఁపమొ యది యప్పు డగును ♦ దైవవశమునన్ !

అచ్చటఁ దురుష్కోత్తమకులసంభవుండును, శాంత్యౌదార్యాది సుగుణగణ విభవుండును, ప్రతిఫలాపేక్షారహితమనీషావిశేషజప్రదానకళామాననీయభిషగ్వరుండును, నగు నన్నేమియయ్యా నాపాలిజియ్యగ నెయ్యంబున నన్నుఁ గ్రమంబునఁ బున ర్జీవితుం గావించె.

నేనిట్టి యాపన్నదశ నుండ నిట బ్రా॥ శ్రీ. వేంకటపద్మనాభశాస్త్రిలుగా రీకృతి, సాంతంబుగఁ బఠింప నెంచి యెడపాడడపా చదువుచు నా సమయమున నీ పట్టనము నకు విజయము చేసియుండిన వీరిప్రభువురాలును, శ్రీమచ్ఛృంగారకోట వీరవరములోనగు తాలూకాల జమీందారురాలును, నగు మహారాజరాజశ్రీ శ్రీరాజారావు చెల్లయ్యమ్మారావు బహద్దరువారి దర్శనార్థమై వారి సన్నిధానమునకు వెళ్లుచు దీని వెంటం గొని చనిరఁట. అప్పు డచ్చట శ్రీరాజా రావు చెల్లయ్యమ్మారావు బహద్దరువారి సోదరులును, శ్రీమద్గనిగడప ఉంద్రాజవరములోనగు తాలూకాల జమీందారులును నగు మహారాజరాజశ్రీ. రాజా వెల్లంకి వేంకట రామారావు బహద్దరువారును, వారి భాగినేయులును శ్రీమత్పిఠాపురసంస్థానప్రభువులును నగు మహారాజరాజశ్రీ శ్రీరాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరు జమీందారువారును నుం డిరఁట. ఆప్రభుయుగం బది యేమి గ్రంథంబని యడిగెనఁట. శ్రీకౌసల్యాపరిణయం బనుదిఁ గొంత చదువుఁ డనియన వేంకటపద్మనాభ శాస్త్రిలుగారును గొంత చదివి రఁట. పిమ్మట రాజా వెల్లంకి వేంకటరామారావు బహద్దరువారిది యెక్కడఁ గొన నగునని యడిగి యముద్రితంబని తెలిసికొనిరఁట పదపడి యొకనాఁడు వారు నైలా పురిలోనుండు తమవసతికి శాస్త్రిలవారిని బిలిపించి యీగ్రంథము సాంతంబుగఁ జది వించి విని దీనికి ముద్రాభృతి మే మొసఁగెదము దీనిముద్రింపఁ బ్రయత్నింపుఁ డన నిది జీవత్కవికృత మనియు, నాకవిగారి సమ్మతి నొందెద ననియు శాస్త్రిగారు చెప్పిరఁట. ఈవిషయమంతయు ౧౯౦౧-వ సం॥ అక్టోబరు నెల ౧౯-వ తేది గల లేఖామూలక ముగ శాస్త్రిలవారు నాకుఁ దెలియపఱిచిరి. నేనును శుభోదర్కంబున కిది యంకు రార్పణంబుగ నెంచి యట్లు కావింపుఁడని ప్రత్యుత్తర మిడితి. వారును దీనిని బహు ప్రయాసమున కోర్చి ముద్రింపించిరి. మహారాజరాజశ్రీ రాజా వెల్లంకి వేంకట రామారావుబహద్దరు జమీందారువారిని నాపాలివేల్పుగఁ గొల్చెనని నెమ్మది నమ్మెద. కాకున్నచోఁ గడపమండలవాసి నే నెక్కడ ? కృష్ణామండలస్థులగు నీప్రభువుగారె క్కడ? ఎన్నియో యుత్తమగ్రంథములం బఠించిన వీరికి నాకృతి రుచించు టెట్లు? నేఁటికాలపుఁబ్రభువులకు నాంధ్రవిద్యాభిమానముండు టెట్లు ? ఉండెఁబో దానికై

ధనవ్యయము చేయ సాహసికు లగుటెట్లు? అయిరిపో యయాచితంబుగ నన్యులకృతికి ముద్రాభృతికై వందలు వెచ్చించు నుదారు లగు టెట్లు?

ఈ కావ్యకన్య జన్మప్రభృతి శ్రీరామచంద్రునకు మన్మనోదత్తయయ్యు నష్టమ వర్షంబునం గాని వివాహయోగ్య గాదని కాంబోలు నేటివఱకు నావేల్పు బాహిరంబుగ దీని నంగీకరింపక యుండె నని తోఁచెడి.

ఇంతకాలము నన్ను సెలవుపైనుంచి యిప్పుడు నా దేహంబు స్వస్థతం గాంచుట వలన మరల హిందూపాఠశాలాధ్యక్షులు నాయం దుదయగలిగి నన్ను నీకొలువునం బ్రవేశపెట్టిరి.

ఇట్టి మహోపకృతులు నా కొసరంచిన సుకృతుల కొక్కరికేని నే నెట్టి ప్రతికృతియుం జేయంగాల. ఇన్ని దుష్కరంబుల సుకరంబులుగ నొనర్చిన యఘటన ఘటనాచాతుర్యధుర్యుం డగు శ్రీరామచంద్రుండే వారి యోగక్షేమభారంబు వహింపంబోలు నని నాదైవంబుం బ్రార్థించుచున్నవాఁడ.

ఆ. వె. దైవకృతము లిపుడు ♦ భావింప విష మయ్యు
మీఁద నామతమున ♦ మేల యిచ్చు.

అని నే నెన్నఁడో వ్రాసిన దానికి శ్రీకౌసల్యాపరిణయము కరణి శ్రీకౌసల్యాపరిణయంబు లక్ష్యమై పరిణమించెను. రాల నీటం దేలించిన మేటి కసాధ్య మెయ్యది?

శ్రీకుమారాభ్యుదయము వ్రాసి ముగించిన పమ్మట నొక్కనాఁడు రాజంపేఁటలో నేను „శిరస్తాదార్" పదవియందు నుండుతిటి నాజనయిత్రి తాను గోటకి మానకు వచ్చిన క్రొత్తలోఁ జిన్నవయసున నున్న నాపితృవ్యులు మహారాష్ట్రభాష లోని కౌసల్య పెండ్లికథను జదువుచుండఁ దాను వింటిననియుఁ, జిరకాలమున వినికి యగుటం గథయంతయు మఱచితి ననియు, దానిం గృతిగా నొనర్పు మని యందదుకులుగఁ గొంతకథ చెప్పెను. విన్నంతవఱకు నది వింతగ నుండుట సంపూర్ణంబుగ దాని నెఱుంగఁగోరి యప్పుడు నా యెఱింగిన మిత్రులకును, బండితులకును, సంస్కృతాంధ్ర పుస్తకవిక్రేతలకును, వ్రాసితిఁగాని మనోరథము మాత్రము సఫలము గాదయ్యె. ఇట్లుండ ౧౮౯౩-వ సంవత్సరమున శ్రీకుమారాభ్యుదయముం బ్రకటించితి. తదనంతరము వేంకటగిరిలోనున్న బ్ర॥శ్రీ. మ-రా-రా-శ్రీ లంకిలపల్లి వేంకటసుబ్బయ్యగారు లేఖాపరిచితులగుట వారికి నాసంకల్పంబెఱింగింప వారు దామామహారాష్ట్ర గ్రంథంబుఁ బఠించితిమని యాకథాంశంబు లేఖామూలకమున నెఱింగించిరి. ఆ యుత్తరమును మాతృకగాఁ గొని నే నీకృతి రచియించితి.

ఇందలి కొన్ని వర్ణనములం దిప్పుడు కొంచె మప్రస్తుత మగపడుచున్న దని తోఁచెనేని యవిగ్రంథ విరచనకాలమునకు బ్రస్తుతములుగా నుండెనని చదువరులు గ్రహింతురుగాక.

నా వ్రాతప్రతిలోని రమారమి ౧౦౦ పద్యములు క్లిష్టముగ నుండుటచేతను బూర్వాపర్ణానాసామ్యము నొందియుండుటచేతను నీముద్రితప్రతియందుఁ దొలఁగించితిని గాని యాఱవ యాశ్వాసమునఁ గడపటఁ గొన్నిపద్యము లెక్కువగఁ జేర్చితి.

౩-వ యాశ్వాసంబున * గుర్తుగల పద్యముల కన్నింటికి నప్రస్తుతంబున రామాయణార్థము గలదు.

ప్రత్యాశ్వాసాంతపద్య ప్రథమపాదప్రాసాక్షరంబులఁ గ్రమంబుగఁ జూచినచో ,,కౌసల్యావివాహం" ,,రామార్పణమస్తు" అని యేర్పడును.

శ్రీకుమారాభ్యుదయంబునకు మత్కర్తృత్వము నొకానొకఁడు సందేహించిన కారణముననట్టికుశంకల కెడమీయకుండుటకై ౧౨-వ పుట ౧౭౪-వ పద్యంబునను, ౩౦-వ పుటలో ౧౯౭ చక్రబంధపద్యంబునను, ౪౩-వ పుట ౧౧౩-వ పద్యంబునను, ౧౧౩-వ పుట ౪౧-వ పద్యంబునను, నింకఁ గొన్నిపద్యంబులను నాసరిమిడ్చితి. ౪౦-వ పుట ౮౩, ౪౧-వ పుట ౮౭, ౮౯, ౯౨-వ పుట ౭౭, ఇట్టిపద్యముల కర్థము కాదినవేత్యాది సంఖ్యా సూత్రంబులంబట్టి గ్రహింపవలయును.

ఆంధ్రభాషాస్థితి యిప్పుడు కొంచె మభ్యుదయోన్ముఖ మగుచున్నట్లు తోఁచుచున్నది గాని

"కం. వెలయాంధ్రు రెండవైనను
గులకాంతకు నీడుగారు కువలయమందున్
బలువిద్య లెన్నియైనను,
గులవిద్యకు సాటి రావు ♦ కువ్వలచెన్నా"

యన్న యసమానవాక్యము ను మఱవక తమదేశము నభ్యుదయంబునకును, గమనైహికాముష్మిక లాభంబులకును, నిదానమైన మాతృభాషకు, సంపూర్ణగౌరవముఁ జూపుబుద్ధి భగవంతుఁ డెప్పు డాంధ్రుల కొసంగునో.

నే నీకృతి రచియించిన పిమ్మట నాపరిచితు లొకరు, శ్రీపాద వేంకటాచలకవి ప్రణీతమైన శ్రీకౌసల్యాపరిణయంబను ౪-వ ఆశ్వాసముల గ్రంథమొండు డివడిఅకే యున్నదని యొకముద్రితప్రతి నంపిరి. దానింజూడ దానికిని దీనికినిం గృతిపేరునను, నాయికా నాయకనామములను, మాత్రము సామ్యముండెనుగాని కథావిషయంబున నించుకంతయు సంబంధములేదు. మఱియొక కౌసల్యాపరిణయ మనుయక్షగాన ప్రబంధము ప్రకటనమును వార్తాపత్రికలంజూచి దానిం గొని చదివితిని గాని యది కథయందు మాత్రము కొంచెము సామ్యము గలదై యుండెను.

శ్రీకుమారాభ్యుదయమును బ్రకటించినపిమ్మట దానిం జదివిన పరిచితాపరిచితులగు పండితమిత్రులు నది మిక్కిలి కఠినశైలిఁ బండితైకవేద్యంబుగ వ్రాయఁబడినదనియు, నీతూరి వ్రాయంబడు గ్రంథమును గాలానుగుణముగఁ గొంచెము సులభశైలి రచియింపుమనియు, బోధించిరి. వారి హితబోధ ననుసరించి సులభశైలిని నీకృతి నిర్వహించితిని. ఇంతకు సులభశైలి కావ్యములకు గుచింపదని తలంచెదను.

అయినను దీనిపై సజ్జనాభిప్రాయ మెట్లుండునో యారసి వలసినచో నిఁకమీఁద దాని ననుసరించెద.

వర్ణనాంశములయందు సాధ్యమైనంతవఱకుఁ బ్రకృతి ననుసరింపఁ బ్రయత్నించితిఁ గాని యాయుద్యమ మెంతవఱకు సఫలమయ్యెనో చదువరులకే యెఱుక. యువతి ప్రత్యంగవర్ణనాదుల కెందు వలసినంత యవకాశ మున్నను బ్రకృతికాలమునం దవి రుచింపకుండుట యటుండ నవి పాపావహంబనియు నెంచి వానిని మానితి.

ఈకావ్యమునకు మూలగ్రంథం బేపేర నెసఁగుచున్న దని వినుటచేతను, బరిణయమే కథ కంతకును బీజభూతంబగుటను, దీనికి శ్రీకౌసల్యా పరిణయం బను పేరిడినను బరిణయభాగము మాత్రము మిక్కిలి యల్పమైయున్నది. (మృచ్ఛకటికవలెనిది యెంచఁబడుం గాక.) కావునఁ బరిణయనామమాత్రమున శృంగారవర్ణనాభూయిష్ఠ మని తలఁచి యెవ్వరేని గర్హింపకుందురు గాక.

పూర్వకవీశ్వరులు త్రొక్కనిత్రోవలును, నూహింపనివిషయములును, లేవు. అయినను సాధ్యమైనవఱకు నూతనవర్ణనములే వ్రాయఁ బ్రయత్నించితి. నేను గ్రొత్తగ నూహించి వ్రాసినాఁడ ననియనుకొన్న వర్ణనములు కొన్ని పదపడి సంస్కృతాంధ్ర కావ్యములంజూచి యట్టివానినెల్లఁ దొలఁగించితి. ప్రమాదంబున నింకను నట్టివి తప్పి యుండినను నుండవచ్చును. ఈనియమమును పద్యశైలియందును నవలంబింప సాధ్యమైనంతవఱకుఁ బ్రయత్నించితిని గాని గుణపక్షపాతంబును దుర్భేద్య చిరతరపఠనాపరిచయబలకారణంబునను గొన్నియెడల దీనిం బాటింపమి నెఱుంగుదు.

ఈగ్రంథమునందలి గుణాగుణవిమర్శలకు సమచిత్తులగువిపశ్చిత్తులే శరణము. సజ్జనులు స్వభావముగ గుణగ్రహణపరాయణులగుట వా రప్రార్థితు లయ్యు గుణమునే గ్రహింతురు. అట్టివారికి విధేయుఁడనై నమస్కరించుచున్నాఁడను. "ప్రమాదో ధీమతా మపి" యనియుండ నిఁక నాయట్టి కించిజ్జ్ఞునకా ప్రమాదము లేక యుండును.

---

ఈగ్రంథమును బ్రకటింపఁగలుగుటకై ధనసాహాయ్య మొనర్చిన మహారాజరాజశ్రీరాజా వెల్లంకి వేంకటరామారావు బహద్దరుజమీందారుగారికి నాయురారోగ్యైశ్వర్యాద్యభ్యుదయంబు లొసంగ భగవంతునిఁగూర్చి యిట్లు ప్రార్థించుచున్నాఁడ.

## పంచరత్నములు.

సీ. శ్రీకరుణామధు♦శ్రీమీఱుపుష్పవ♦ద్వ్యస్ఫురన్నేత్రాబ్జ♦విలసితుండు
పూతధీనిత్యవి♦భూతిదానవినిద్ర, పద్మానిమేషాక్షి♦ప్రాణవిభుఁడు

మారుతసుతసర♦మావల్లభులకు స,మర్థభృత్యమొసఁగిన♦మానధనుఁడు
గౌతమప్రియవధూ♦ఘనజాడ్యహరుఁడగు, నతిభవామయతాప♦హ్రుతిచణుండు
రాజు వెల్లంకి వేంకట♦రామరాయ, బహదరంకితుఁ బెంపాల♦బహుతిగోత్రు
రేయుఁబవలును బ్రోచుత♦శ్రీచిరాయు, రతులితారోగ్యవిభవసం♦గతునిఁ జేసి. ౧

తే. క్షీరనిధిజాత, యిందిర, ♦ శ్రీవధూటి, భువనమాత, రమాదేవి♦పూర్ణకృపను
రాజకులజాతవేంకట♦రామరాయ, మిందిరావాస యొసఁగుత స ♦ త్సందివంబు. ౨

ఉ. శంకయొకింతలేక యని♦శంబు విరోధివసూధినీహృదా
తంకకరంబు, స్వాశ్రితసు♦దర్శన మైనసుదర్శనంబు వె
ల్లంకి కులాబ్ధిసోము, నన♦లం. కనుజాతనుజాతసంగతుఁడై
వేంకట రామరాయ నృప♦విపతి విశ్రుతకీర్తిఁ బ్రోవుతన్. ౩

సీ. రాజకులాంభోధి♦రాకాసుధాంశు భా, స్వత్కళలగుణజాలు ♦ సుకలుఁ బెంపు
చెలఁగ సంతతబుధా♦శీర్వచనకలితో, ల్లాసమానసు,దయా♦భాసమాను
యదుకులప్రవరపా♦దాంబుజాసక్తను, మ్మానితచరితు దు♦ర్మానరహితు
రాజిత నిర్జరాం♦ఘ్రిక శాఖిమ ఘనసభ, ప్రకసుధాస్వాదన♦పూతచిత్తుఁ
జేమ వెల్లంకి వేంకట♦రామరాయ,మహిపవర్యుని ననమాన♦మహిమఁగాఁగఁ
బ్రోచుఁగావుత నిరతంబు♦బుధవినుతుఁడు, చుట్టుఁగ్గైదువువలమురిఁ♦బట్టుప్రోడ. ౪

---

సీ. విశ్రుతసత్కీర్తి♦పెదరామరాయఁడే, పూతచరిత్రుని♦తాతతాత
ఘనతరసమ్మాన♦ధనుఁడు మల్లారావు, ధాత్రీశుఁడేప్రభు♦తాతతండ్రి
విబుధసంస్తవనీయ♦వేంకటకృష్ణరా,యండేదయాశీలు♦తండ్రితండ్రి
గణనీయగుణుఁడుజ♦గన్నాథరాయఁడే, దానశీలాత్ముని♦తండ్రి యట్టి
రామపదభక్తు వేంకట♦రామరాజ, విభువరేణ్యునిఁబ్రోవుత♦విశ్వధర్త
భక్తశుభకర్త నతలోక♦పంకహర్త, జానకీభర్త కరుణచే♦సంతతంబు.

తిరువళ్లిక్కేణి
1902 సం||
మే నెల 4-తేది.

సుజనవిధేయుఁడు,
వావిలికొలను సుబ్బరావు.

శ్రీరామాయనమః

శ్రీశారదాయైనమః

# శ్రీకౌసల్యాపరిణయము.

## ప్రథమాశ్వాసము.

### ఇష్టదేవతాస్తుతి.



నారాయణనిత్యమూర్తిశుభగో♦ష్ఠీసభ్యతాప్రాప్తికిన్
ధ్యానింతుం జతురాత్ము, సంసరణవి♦స్తారాబ్ధినిస్తారకున్
శ్రీనాదాత్మకు, శ్రీనివాసు, హరి, ని♦శ్చింతాప్తి నాత్మోద్భవా
స్థానాశోద్యమవైరిసంహరణుకౌ♦శల్యాయనున్, రామునిన్. ౧

సీ. ఏసతిశీలంబు ♦ హృదయంగమంబునై, రాము నిస్తులయశో♦ధాముఁ జేసె
నే రమణీమణిఁ ♦ గూరిమి లోఁదాల్చి, పాంసుల రత్నగ♦ర్భగ రహించె
నేకరుణాలయ ♦ హింసించు నెంచిన, పలువ కిప్పించె న♦వ్యయసుఖంబు
నేభక్తసన్నల♦యేపాదుకరుణచేఁ, జెనఁటికాకము చిర♦జీవి యయ్యె

ఆ. నాపిపీలికాజ ♦ మేపురంధ్రీలీల, యేమె శ్రితులఁ బ్రోవ ♦ నెదురుపోవు
నట్టిమాత, త్రిజగ♦దవగీర్ణగుణపూత, సీత నన్ను ధన్యుఁ ♦ జేయుఁగాత. ౨

సీ. మూఁడువేదంబులు♦ముప్పిరి నల్లిన, వేణితోఁ గృతిఁదాల్చు♦పాణితోడ
వెన్నెల ల్గురియించు ♦ వెల్లనివలిపంపు, టొల్లెతోఁజిన్నిజా♦బిల్లితోడఁ
జేదోడువాదోడు♦చెల్వారుముద్దుల, చిలుకతో మురిపెంపుఁ♦బలుకుతోడ
సరిగమపధనిస♦సధపమగరిస యన్వీణతో నిర్జరీ♦శ్రేణితోడ

తే. వ్రాలువిరిచూలునిల్లాలు ♦ పూలనాలు, దాల్పుప్రోయాలి కేరాలు♦ వేల్పుచాలు
నేలు విద్దెలజవరాలు ♦ మేలుగ్రాలఁ, జాల నాపాల నిల్చి న♦న్నేలుఁగాత. ౩

మ. ధవు సర్గాఽప్రతిభాత్ముఁ గాంచి నిజమ♦ధ్య, స్వాదునిశ్వాస, స
చ్ఛవి, లావణ్య, నితంబసామ్య మొనరం ♦ జల్పంగ బోధించినన్
దివి, వాతా, గ్నిపయఃకుచక్రములఁ దా ♦ నిర్మింప శాలీనుఁడై
నవువాణిం గవుఁగింటఁజేర్చు నజు స్వాం♦తంబందు భావించెదన్. ౪

ఉ. నీరసయుక్తిరక్తిను ♦ నీమధుధర్మము నిర్మలత్వముం
బేరువహించుమేనఁ బ్రభ♦వించుటయుం గన సాటి యెవ్వరే

బోరన గౌరినిందలను ♦ బూనఁగ నాపగ నేర్తు నెట్లు మైఁ
జేరుపనంచుఁ దా సవతి♦చేడెల నొక్కట నూఱడించు సం
సారి హరుండు నాబహుళ♦సంకటముల్ హరియించుఁ గావుత౯. ౫

ఉ. వైరిగదా మరుండు మగు♦వా! తగవౌనె తదంకపాళులం
జేరుప నంగపాళి మదిఁ♦జింతిల కింత? యనం గపాలితోఁ
గూరిమిఁ గూర్పఁగా మనలఁ ♦ గుంటెనకాఁ డగు నాయనంగుఁడు౯
వైరియె? యంచు నవ్వెడుభ♦వాని దయ౯ శుభవాణి నిచ్చుత౯. ౬

తే. ఎవని ముదలార సేవింతు ♦ రెల్లవిబుధు, లెవనిముదలారసి చరింతు♦రెల్లనట్టి
మొదటితలయారి శ్రీసేన♦మొదలియారి, మీఱునుద్భవములఁ ద్రుంచు♦మేలు వెంచు.

ఉ. స్వాంతమున౯ భజింతు గుణ♦వంతు, మహాబలవంతు, దైత్యశు
ద్ధాంతతమాలపత్రఘటి♦తాంతుని, దాంతుని, శాంతు, దుష్కృత
ధ్వాంతఖరాంశుమంతు, వసు♦ధాతనయాఘనశోకశాంతు, హే
మంతు, దయానిశాంతు, హను♦మంతు, నతాయవనీవసంతుని౯. ౮

కం. సకలకళాధారు శర, త్సకలకళాధామరుచిని ♦ సైంధవగౌరుని౯
శకలీకృతసైంధవగర్వు, సకలు న్ననుఁ జేయ భక్తి♦న్నుతి యొనర్తు౯. ౯

** సంస్కృతాంధ్రకవీంద్రవినుతి. **

ఉ. భారతి యేమహామహుని ♦ వాక్కనురంగమునందు సద్యశో
భారతినాట్యముం జలిపెఁ ♦ బాత్రమునాఁ దొలుదొల్త హర్షశో
భారతి మీఱ నం దెలర♦వంబులు కర్ణరసాయనంబుగా
నాబుషి నేఁ దలంతుఁ గవి♦తామరశైవలినీత్రివిక్రము౯. ౧౦

కం. ఖేదముఁ దొలఁగింపఁగ స, మ్మోదము ఘటియింప భోగ♦మోక్షశ్రీ లా
పాదింపఁగఁ జాల్పంచమ, వేదము రచియించు నపర♦విధు నేఁ గొలుతు౯. ౧౧

తే. కాళిదాసకవీశ్వరు♦ఘనుని దండి, పండితుని దండి, జయదేవు♦బాణు, మాఘుఁ
జోరుని, మయూరు, భవభూతి♦భారవి, మది, సుకవిలోకేశులనుగొల్తు♦సూక్తులొదవ

ఉ. భీముని, నన్నపార్యు, నెఱ♦ప్రెగ్గడఁ, దిక్కన, నాయధర్వణు౯
సోము, ననంతుఁ, బెద్దనను ♦ సూరన, భాస్కరుఁ, బోతసత్కవి
గ్రామకవీశు, వెండి సిరి♦నాథునిఁ, దిమ్మనఁ, బిన్నవీరన౯
రామనృపాలభూషుఁ, గవి♦రాజుల నెంతుఁ బ్రశస్తసూక్తిక౯. ౧౩

కం. సాధునికరవంద్యుల నే, నాధునికకవీశుల౯ మ♦హాత్ముల మది నా
రాధనకయి తెలుతు౯ గం, గాధునికాభంగభంగ♦గంభీరోక్తి౯. ౧౪

వ. అని దేవతావందనంబును, బురాతనాధునాతనసత్కవీశ్వరానందనంబును గావించి
జన్మసాఫల్యంబుగ నొక్కపుణ్యకార్యంబు రచియింపఁదలంపు చెంగలింపనుద్యమించి.

చం. కవియును నర్తనాంగనయు ♦ గష్టము లెంతలు గల్గియున్న న
య్యవి వెలిఁదోఁపనీక వెల ♦ యన్ వలయున్ వెలినాఁడు నర్తకిన్
భువిపయిఁ జూపఱు ల్గనఁగఁ ♦ బోరు హృదంతరవర్తివేదనన్
నెనమిడి లోపమే దెగడ ♦ నేర్తురు నిష్ఠురవాక్పరంపరన్. ౧౬

సీ. చిత్తమా యూఁదరా ♦ యత్తిను గ్రాలదు, పాత్తి మాయూఁదరా ♦ వృత్తమగుటఁ
గరము విచక్షణా ♦ కరములు గానియుత్కరముల వ్రాయు నా ♦ కరము లెపుడు
పాదము ల్దర్కశ ♦ పాదకంటకశిలాక్షోదముల్ యాతనా ♦ పాదము లగు
దేహంబు రోగసం ♦ దోహంబులిమిడి నుం, దేహంబు బ్రదుకె సం ♦ దేహమగును

తే. ఇట్టి నను బోఁటిమానిసి ♦ కెట్టులొదవు, విబుధహృదయంగమాలాప ♦ వివిధచతుర
నటన ఘటనాపటు స్ఫుట ♦ నటకసరళ, కమ్రమస్వాంచితరఝరఝ ♦ రావ కావ్యకన్య. ౧౭

సీ. సరసుల సద్గోష్ఠిఁ ♦ దిరిగెదు కవిరాజ, హంసలఁ గదరాగ ♦ మరుదు గాదు
విబుధులసంగతి ♦ విహరించు సుచివిధా, శుకవుల నొప్పారు ♦ శుద్ధసూక్తి
బహుళభోగాభోగ ♦ పటిమనున్నన యహీనుఁ, డోపెడి బహుశీతు ♦ లొప్పఁ బలుక
విషయానుభవముక్తి ♦ వెలసినవారికి. భాసజాత్యున్నతుల్ ♦ పలుక సుగావు

తే. కంజనృకుంజలోచనా ♦ కంజరేఖ, మంజుమంజీరశింజాన ♦ పుంజ మింటఁ
బుంగిగొనియున్న భోగిముల్ ♦ పోదలుచున్న, లలితకవితావిలాసిని ♦ యలఁగుటరుదె?

సీ. కలమెత్తి వ్రాయంగఁ ♦ గడఁగితినా గ్రామ్య, వచనభూయిష్ఠంబు ♦ వ్రాయసంబు
వీను లొగ్గి యొకింత ♦ విని యెదనందునా, బాడుబూతులె చెవి ♦ నిండుచుండుఁ
గన్నులు విచ్చి నేఁ ♦ గనుఁగొందునందునా, కంటకతరుదరు ♦ ల్గానఁబడును
స్వచ్ఛందవృత్తిని ♦ జరియింతునందునా, ధర నాథవంతుఁడఁ ♦ దిరుగరాదు

తే. కాన నావాన నసమాన ♦ మానభాస, మానసదరీణవర్ణనా ♦ మాధురీణ
భావనానూననూత్నసం ♦ భావనార్హ, శారదాదేవి యెటులుండు ♦ సంతసమున. ౧౯

వ. కావ్యరచన దైవపూజావిశేషంబుగ మనీషులు భాషించుటఁ గృతికృత్యంబునఁ గృతకృత్యుండ నయ్యెద నని తలంప నయ్యది పూర్వకృతాపూర్వసుకృతాధిక్యంబునం గాని నిరంతరాయంబుగఁ గొనసాగనేరదని సందేహమందేహాండనై డోలాందోళితమానసంబున నెయ్యదియుం దోఁపమి శ్రీరామధ్యానంబు సలుప నెయ్యది హృదయగోచరం బగు నద్దాని గరణీయంబుగ నాచరించెదఁ దత్కరుణానిదర్శనంబు లనేకంబులు హృద్గతంబు లయ్యు జంక నేలయని దృఢచిత్తుండనై శ్రీరామసాన్నిధ్యంబుఁ గల్పించుకొని నర్ధనిమీలితలోచనుండనై ధ్యానించుచున్న సమయంబున. ౨౦

సీ. రాహుగ్రహాస్యని♦ర్గళదబ్జమండలం, బన నొప్పు నెమ్మోము♦హారువృత్తోడ
గ్రీష్మసాయాహ్నసం♦దృశ్యమానం బగు, తనులతఁ దనులత♦దారసింప
నవహిమార్త్యయవేళ ♦ నలివాయుకంజాత, ముల కన్ను కన్నులు♦పుగుడుచూపఁ
గాననకృత్రిమ♦గర్తవినిర్గత, కరిణినా నిజ యాన♦కలన మమరఁ
తే. జెలఁగికుఱుమాపుచీరకు♦చ్చెళ్లు గునిసి, యాడుమీఁగాళ్లఁ, గానగోళ్లి♦ననువుపఱిచి
చెదఱువెంట్రుక; లొయ్యనఁ♦జేరవచ్చి, నిలిచె నొకలేమ మామక♦నికటసీమ.

వ. ఇట్లు మదీయోపకంఠంబుఁ జేరినయక్కలికిం గని నుపలక్షించి. ౨౨

ఉ. ఆవిరి గప్పగా మినుకు♦టద్దమొకో, నునుగుంపు నింగి పోక
వావిరిఁ దాటి తేఱు సిత♦వారిజమొక్కొ, దినాంతవేళలన్
బోవుచునుండ నెండ పరి♦పూర్ణసుధాకరబింబమో, యనం
గా విరిఁబోణినెమ్మొగము ♦ కారణమేమియొ నాడిఁ తేఱెడిన్ ? ౨౩

సీ. దయ నాకు సిరు లీయ♦వయ చేసినట్టి యా, లచ్చియందునొ మేను♦పచ్చగాదు
పద్యముల్ నానోటఁ ♦ బ్రౌఢిమైఁ బలికించు, వాణినాఁ బుస్తక♦పాణి గాదు
జగతి భక్తులఁ బ్రోచు♦నగజాత యందునా, రుదురాకపేరు పే♦రెదను లేదు
మదనమోహిని యని ♦ మదిలోనఁ దలఁతునా, చిత్తవిభ్రమ మొప్పు చేయదు నన
తే. మహిని మహిళ యందిట్టి♦మహిమ యున్నె? వేల్పుఁగన్నియ కెట్టులీ♦ నతలు గలుగు?
ననుచుఁ దలపోసి యిట్టిటి♦నతివతోడ, నైజమునకు గురుభావంబు♦నయము మెఱయ.

ఉ. ఎవ్వతె వమ్మ నీవు? కత ♦ మేమి యొకో యరుదేఁ? నీమదిన్
నెవ్వగ గూరియున్న గతి ♦ నీదుస్వరూపమె చెప్పెడుం గటా
నొవ్వఁగ నేరు పల్కిరి ని♦న్నున్? నను ధన్యునిఁ జేయు తెల్లనా
గువ్వలయెక్కిరింతగల♦కొమ్మవొ? యమ్మవొ తమ్మిచూలికిన్? ౨౪

వ. అని తనయమానుషంబైన తేజోవిశేషంబుకతన భయభక్తి సంభ్రమంబులు ముప్పిరిగొన మోడ్పుఁగేలునమిగులమాటాడనేరని నన్నుఁగనిసాదరంబుగనాయంబ యిట్లనియె. ౨౫

తే. అన్న! కన్నులవిల్తుని♦యన్నయన్న, గాఁగ నన్నెన్నమీనిన్నుఁ♦గానఁ గాను
ముచ్చటైనను వచ్చితి♦ముచ్చటింతుఁ, గలదు నాదీనదశకును♦గారణంబు. ౨౬

ఉ. మానసరచింత లొందు విష♦మవ్యసనావిలచిత్త నౌట సం
తోసము లేమి నెట్లు పరి♦తోషము కల్మిఁ జరింతునో? యనా
శ్వాసితదుఃఖతే మనసి ♦ సర్వ మసహ్య మటన్న పల్కు వి
శ్వాసము గాదె? శోకసమ♦శాత్రవుఁ డుండునె వేఱొకండిలన్. ౨౭

తే. ఆరుమత్సుంకు క్రోధంబు ♦ నణఁచుభంగి, నబ్ధి బడబాగ్నిఁ దనలోన♦నాఁచినట్టు
లాఁపి మదిలోన నామను♦రంతచింత, నవనిపైఁ బుత్రి! యిటు నడ♦యాడుదాన.

ఉ. ధారిణిఁ గృష్ణరాయలు తు♦ద స్థలయాంధ్రరసాధినాథులన్
గారవమార నన్నుఁ గనఁ♦గా ఘనగౌరవవృత్తి నుంటి ము
న్నీరస నిప్పు డన్యగతి ♦ నీరస మొప్పఁగఁ జూడ నాప్రజల్
నీ సరూప మొప్పె ధర♦ణీసురసత్తము! యేమిచెప్పుదున్. ౩౦

తే. ఆంధ్రనాథునిపాలితం♦బైనయట్టి, యంధ్రదేశంబునందలి♦యాంధ్రులెల్ల
నాదుతనయులఁగా నెంతు♦ మోదమొప్ప, నాంధ్రభారతి నే నౌట♦నవనివిబుధ.

కం. రాజన్యులచేఁ బూర్వము, పూజలుగొను వారు నాదు♦పుత్రికు లయ్యో!
రాజుల సేవకు లగుని, ప్రజలఁ గొలిచెదరు నేఁడు ♦ దీనత్వమునన్.

వ. అదియైనను సజ్జనసేవయా యందు వేని ౩౩

కం. అధములు మతిగుణవిద్యలఁ, గ్రుధసాధుల నేఁచ బ్రహ్మ♦కొడుకులు సుమి వా
రధికారులు గావుననో, యధికారులుగాఁ జరింతు♦రను జీవులకున్. ౩౪

చ. కలుకువిలోకనంబుల నె♦గాదిగఁ జూచు, హసించు, నంచునన్
గొలిచినవారిఁ గాంచి కొలు♦వున్ రదముల్, నగుఁబోటుఁ జాటఁగాఁ
జులుకన నాడు, వ్రాయు, మఱి♦చూచును, లేచును దాఁప నిద్ది హా!
యులువగుసన్నిపాతిగుణ♦మో, యధికారపిశాచవేషమో. ౩౫

సీ. ధరణీప రాగంబు♦ధరణీపరాగంబు, నమ్మఁతిరుగఁగరాదు♦సుమ్మి పతులఁ
బతిసహోదరము ల♦ప్రతిసహోదరములు, తబ్బిబ్బులౌ మది♦నుబ్బె నేని
వరచంద్రహాసంబు♦వరచంద్రహాసంబు, మెలఁకువ గలిగియు♦ మెలఁగవలయు
నధికారరుచితి♦యాధికారకచిత్రి, దూరంబునందె తాఁ♦దొలఁగవలయు

ఆ. బలుకరాదు నిజముఁ♦బలుకని పోరాదు, పోవరాదు మించి♦బుద్ధినుంచి
చిక్కనేని మిగులఁ♦జిక్కుల నిడుదురు, క్రూరజనులకొలువు♦చాలబరువు. ౩౬

కం. ఇట్టిడుములఁ బడుటను నా, యిట్టిరు లగుపట్టు లేమి♦యెంతచదివినన్
గుట్టుగ నున్నారకటా, గట్టిగ ననఁ బట్టులేమిఁ ♦ గడుకొని కావన్. ౩౭

కం. ఈవిధి శ్వవృత్తిఁ దిరిగెడి, సేవకులే గాక మఱి య♦శేషజనంబుల్
నావలను చూడ రోసిరి, నే నగచెద దాని కెదను♦నిరతముఁ బుత్రా. ౩౮

కం. అందం బగుకొఅజాబిలి, ముందలఁ గద అయు నాకు♦మును పెప్పుడు, నేఁ
డెందెందుఁ జనిన మొడ్డపై, నొందెందఁ గడ యర్ధచంద్ర♦యోగం బకటా. ౩౯

సీ. నాపుత్రులే నన్ను♦నాదరించుటఁ జేసి, యాహారముల మీఁది♦యాశ లేదు
నాకుఁ గూర్చుసుతాళి♦వీక్షనుండమిఁ గాంచ, నగలు మైసవరింప♦వగపు కలుగు

శరవాదపదు లైన♦హారవాదులను గన్న, నగ్గిలేకయే కడ్పు♦భగ్గు మనును
దామసంబున కేఁగి♦తెమలోనఁ గలహించు, తనయులఁ గన్నను♦ మనము పొగులు

తే. నాయనా! యేమియందును♦నాయవస్థఁ, బొలిచెఁ దలగడ యగుచు నా♦పుస్తకంబు
కౌమరుపీఁరియ చేయూఁత♦గోలయయ్యె, సుతసమూహంబులిటు సేయ♦సుబ్బరాయ!

తే. కురుల నైనను లెక్కింపఁ♦దరముకాని, యలవిగాదయ్య నాపుత్రి♦కుల గణింపఁ
బరఁగఁదల వెంద్రుకలయంతె♦బలఁగముండిఁ, దలకుఁబోసెడిది కేఁది♦తెలఁపఁబుత్ర.

తే. ఆంధ్రులెల్లెడ నన్యక♦శ్లాఘింతిని,
గులముఁ గులవిద్య మఱవఁగఁ♦దలఁచి తలఁచి
వెతలు గుములుచు నే నన్న♦విధము గాంచి,
తెలుఁగురాయఁడు జడమయ్యె ♦ దిగులు చెంది. ౨౧

చ. కరము వసంతకాలికపి♦కస్వరచారుపిక స్వరైక భా
స్వర మగునాగరిస్వరము ♦ సంతసము బస మేళనంబుగాఁ
బరఁగెన్, నేఁడు మందమయి♦భాసిల దయ్యె నుఖేతరస్థితిన్
వరలెడివార లేరఁ? బ్రతి♦భాయుతవాక్కు శలత్వ మేడనో! ౨౨

చ. తెలుఁగుఁగఁ దాలమా వదన♦తాలకు, మూర్ఛన లొంచె మూర్ఛ. నిం
పలరఁగఁ జేయఁజాల్లయ ల♦యంబును బొంచెను, గ్రామ మక్కటా
చెలఁగెను గ్రామపర్యటన♦శీలత, నాదు తనూజావళుల్
వెలచెలి పాడుజావళులు ♦ విశ్రుతిఁగాంచె మహోన్నతస్థితిన్. ౨౩

తే. మదిసి నన్నింత తలఁచెడి♦మానవుండు, గానరాఁడయ్యెఁ గొన్నాళ్లు♦గాన నేను
మూర్ఛలను స్రుక్కి సంచార♦ములను దక్కి, రూపు చెడియుండితి నిజమ్ము♦క్రూరదశను

కం. అటు పిమ్మట నటమటఁ గవు, లటునిటు మహదాశ్రయంబు ♦ లలవడ కున్నన్
వటిబొయించుకుండఁ బిమ్మట, ఘోటియించుచుఁ గావ్యములను♦గాచిర నన్నున్. ౨౪

కం. తక్కినవారికి నే ననఁ, గ్రక్కనకూడైతి నేమి♦కర్మమొ? యిది నీ
కొక్కింత దెలియఁగద నా, కెక్కుడిముద మొదవు, సొగసు♦లేటికి నింకన్.

చ. కనదురుబంధబంధురము♦కావ్యమటన్నను ఋజ్జుబంధమా?
యనుదురు; సద్ధ్వను ఖనము♦లంచు వచింపఁగ గంగజాతరా?
యనుదురు; రలంకృతుల్ బహుళ♦మన్నను ద్రాటనుగూర్చి కట్టినా?
యనుదురు? నేఁటియాంధ్రులహా♦హా బవినాతెఁ దెలుంగుబాసకున్. ౨౫

కం. చదివినమూర్ఖుని కంటెను, జదువనిమూర్ఖుండు మేలు♦ చర్చింపఁగ దు
ష్పదముల నన్నుం ద్రిప్పెను, చదివినమూర్ఖులను నశమె?♦ చక్కం బెట్టన్. ౨౬

కం. మార్గం బెఱిఁగియుఁ గడు దు, ర్మార్గంబునఁ జనుటకన్న ♦ మానమె మేలౌ
దుర్గంధసుమముకన్నను, నిర్గంధసుమంబు మేలు ♦ నిక్కం బరయన్. ౫౦

సీ. పాదముల్ దీర్ఘముల్ ♦ ఛేదింపవలె నండ్రు, నాకు విశ్రమ మేల ♦ నడన? నండ్రు
కొఱసున్నమానుపీడఁ ♦ గోదువ యేమిట? నండ్రు, వర్ణసంకరవృత్తి ♦ వలయు నండ్రు
సద్వృత్తిరీతులఁ ♦ జాలసంకట మండ్రు, సద్ధ్వనుల్ దలయేరు ♦ సలుపు నండ్రు
శృంగార మేటికిఁ ♦ జీఁదఱకా? యండ్రు, ప్రౌఢోక్తు లతిగూఢ ♦ భావ మండ్రు

తే. నవశకుంతల ముద్రిచ్చి ♦ వఱలె ననఁగ, బల! సకుంతల ముద్దిచ్చి ♦ బడలె నండ్రు
నేఁటి నవనాగరికకవుల్ ♦ నూటి దప్పి, పద్యనియమంబు నందు నా ♦ భాసులగుచు.

సీ. గంధము ల్ప్రాస్ప్రీతి ♦ బంధంబు లండ్రు శృం, గారంబు లెల్ల వి ♦ కార మండ్రు
గర్భంబు వేదనా ♦ మర్భావ మని యండ్రు. మధురతామలరుచి ♦ మధ్య మండ్రు
వాక్యచాతుర్యంబు ♦ భావవక్రత యండ్రు, యమకంబు దుష్పథ ♦ గమక మండ్రు
బహువిధాల స్కృతుల్ ♦ భారమాత్రం బండ్రు, ప్రాసయోగంబు బీ ♦ భత్స మండ్రు

తే. వరపదన్యాసకుశలుని ♦ బంగు వండ్రు, చిత్రకవితావినోదంబు ♦ ఛీ యటండ్రు
మత్సపత్న్యుపలాలిత ♦ మత్తనయులు, భవ్యధీదీర్ఘదర్శితాఁ ♦ భావు లగుచు ౫౧

సీ. ప్రత్యక్షరశ్లేష ♦ పటిమచేఁ జెన్నగు, వాసవదత్త కే ♦ వాసి తఱిఁగె?
యమకంబు నిండారఁ ♦ గొమరైన కాళిదా, సునళోదయమున కే ♦ సొబగు దప్పె?
గూఢభావనిరూఢిఁ ♦ గూడికర్కశవాక్య, భరితనైషధ మెట్టి ♦ వన్నె వాసె?
సకలకవిత్వకౌ ♦ శల్యంబుఁ జూపిన, మాఘున కేయవ ♦ మాన మొదవెఁ?

తే. గటకటా! యింతదలఁపక ♦ కుటిలయుక్తిఁ, దేరతేరకు నాదుకు ♦ మారకులను
దూఱుచుందురు బహువిధ ♦ దోషములను, దీని కేనేమివచియించు ♦ దానఁ జెపుమ?

ఉ. నాథులుగాని సత్కృతుల ♦ జల్పితముల్ గొని జాతివాక్యముల్
గా ధరణీసుపర్వ! కృతి ♦ గ నొనరించిన లెస్స యండ్రు; దు
ర్మేధను నట్టిచోఁ గవికి ♦ మేలిధనంబు లొసంగుచుందు రా
రా! ధనికుల్; మదీయగతి ♦ యయ్యయొ యెంతకు వచ్చెఁ జూచితే. ౫౨

తే. నేను దుర్దశఁ జెందిన ♦ దాన ననుచుఁ, బ్రౌఢకవితల నావృద్ధి ♦ దరఁగదనుచు
రచ్చకూఁతలెమిగుల స్వా ♦ రస్యమనుచుఁ, బలుకుచుందురు మితిమీఱి ♦ బవిసిమాలి.

తే. శబ్దశాస్త్ర నిషిద్ధోక్తి ♦ సాధువగును, వినఁగను వినోదమైయుంట ♦ వనెవరేని
రతిసుఖంబునకై యంకు ♦ హితమొసలుప? సిరులకొఱకునుజౌర్యంబు ♦ చెల్లునొక్కొ?

మ. ప్రతిశబ్దంబు మథించి దానఁ గలస్వా ♦ రస్యంబునుం జూచి య
ప్రతిమానూనవిలాసచాతురి రహిం ♦ పన్ సౌష్ఠవస్ఫూర్తిమైఁ

గృతిరత్నంబు ఘటింప భాష నవసు♦శ్రీకాంతి శోభిల్లఁ గా
క తలంపం బొడిజల్లిమాట లన నెం♦క్కాలంబున న్వృద్ధియౌ. ౪౭

ఆ. వాక్యసరణి వేఱు ♦ భావకౌశల్యంబు, సరణివేఱు; రెంట♦సరస మైన
కవిత కవితగాక ♦ కిడను యేదైనను, సుకవు లెంచఁబోరు♦శుద్ధ మనుచు. ౪౮

కం. పామరతతికై వ్రాసిన, సామాన్యపుఁగథలు ప్రకృతి♦శాస్త్రము లుండన్
సామము సుఖునై; నగరే, ధీమహితులు కావ్యములను♦దీర్చిన నట్టుల్? ౪౯

తే. చాలనరులకు లెస్స పాం♦చాలి సుమ్మి, తెలుచుపురుషోత్తములకు వై♦దర్భి లెస్స
యార్యజనులకుఁగౌడిసౌ♦ఖ్యంబుఁగొలుపు, లోకులిలభిన్నరుచులౌట♦ప్రాకటంబు.

చ. తెలఁపకు చిప్రబంధకవి♦తల్ రచియింపఁగ రా దటం చెదన్
సలలిత కావ్యసంఘటన♦సారసనేత్రినమస్క్రియ గాదె? ని
శ్చలసుమనః ప్రకల్పితబి♦సప్రసవాదికరూపపద్యముల్
నలిననివాసినీహృదయ♦నాథున కిప్పనసేయ దోషమే?

ఉ. కావున వీరివారివలెఁ♦గానిపథంబులఁ బోకు మయ్య! నన్
ద్రోవలు దప్పనీడ్చుచును ♦ దొందర పెట్టకు మయ్య! పూర్వ లే
ఖోపను బోయి రా తెలుఁగు♦దోషము లెంచకు మయ్య! నేర్పుమై
భావన సేయ నయ్య! బహు♦భంగుల నీకు యశంబు చేకుఱున్. ౫౨

వ. అంతరాయభయంబునను భిన్నదర్శను లగులోకుల నెల్ల నెట్లు మెచ్చింప వచ్చు ననియు జిచ్చువడి యున్న నిన్ను హెచ్చరింపఁ జనుదెంచితి. లోకంబునంతయు నేకాకృతి మెప్పింప దైవంబు వలనఁ గాదన నీ వన నెంత. కావున నిర్భయుండవై యుత్సాహంబు వాటించి నిరాఘాటంబుగఁ గృతిఁ బ్రారంభింపు మని దయాపోషణ మనస్తోషణ చింతాశోషణ శంకాపేషణ మృదుమధుర భాషణంబుల భాషాయోషారత్నంబు సంభాషించి తిరోహితయైనఁ దెలిసి యది యమ్మహాదేవి యల వోకగాఁ దలంచి. ౫౩

కం. చింతామణిరూపిణివై, చింతామణివేదికపయిఁ♦జెలువల రెడు శ్రీ
కాంతామణి! భక్తోత్కర, చింతామణి యనుచు వినుతి ♦ చేయుదు వాణీ. ౫౪

కం. భళిరే! త్వన్నామాప్తిని, దళమే నిర్వక్రవాగ్వి♦ధానక్షమతాఁ
దలమే త్వత్కరుణాకం,దళ మేనరు సోఁకు నట్టి ♦ ధన్యునిఁ బొగడన్? ౫౫

ఉ. నీరజపీఠవాసరమ♦ణీ! రమణీయమణీమయోద్ధమం
జీరకకింకిణీనికర♦శింజితఝూళఝుళంఝుళార్భటుల్
దోరముగాఁగ నిస్తులిత♦ధోరణి మీఱ నవారణంబుగా
నా రసన న్నటించుచు ఘ♦నంబుగఁ గూర్పఁగదమ్మ శ్రేయముల్. ౫౬

మ. సనయుల్ పూర్వకవీశు లాడని వచ♦శ్చాతుర్యమా లేదు; నే
జననీ! వచ్చియు రాక యాడిన మహి♦ష్ఠప్రీతి యొప్పార నో
య్యనఁ దత్త్వాంతరగర్భకావ్యసుమణీ♦హారంబునం గ్రిందనై
కన నొప్పారపతకంబు చందమున మ♦త్కావ్యంబు లాలింపవే. ౬౯

వ. అని ముకుళితకరుండనై యమ్మహాదేవింగూర్చి నమస్కరించి హర్షపులకితగాత్రుండనై దశకంధరమదసింధురవరసింధురపరమేచకకంధరాంగ సమర్పితంబైన మామకీనప్రబంధంబు గుణబంధురపదధురంధరంబై వసుంధర నమంథరగతిఁ గవియుగంధరహర్షాకరం బగునని తలంచి మదీయాత్మారాముఁడగు శ్రీరాముని శుద్ధాంతరంగశుద్ధాంతరంగసంగతుం జేసి మోక్షఫలాపేక్షఁ దత్కమలాక్షున్మత్కృతికి నధ్యక్షుంగాఁ దలంచుచుఁ దదుచితకథాన్వేషణపరుండనై యున్న సమయంబున.

కం. మాయమ్మ కనికరమ్మున, మాయమ్మయ, యనగుణంబు♦మాయమ్మగుఁ జూ
మ్మాయమ్మయందు, నడవడి నాయమ్మిక, నమ్మిక మ్మ♦యమ్మ గుణమ్ముల్.

కం. కనకమ్మ సద్గుణంబులఁ, గనకమ్మ మదాళులకును♦గనఁ గమ్మ తెఱం
గునఁ గొమ్మలలో వెలయుటఁ, గనకమ్మ యనంగఁ గాంచె♦ఘనవిఖ్యాతిన్. ౭౦

ఉ. అయ్యమ యొక్కనాఁడు భర♦తానుజరామసమేతరామమా
యో యన డాయవచ్చి తన♦యుల్ దనయుల్లముఁ బల్లవింపఁగాఁ
జేయ విధేయులై స్నుషలు♦చేరువఁ జేరి వినోదవైఖరిన్
హాయిగ ముచ్చటించెను స♦ముంచితపుణ్యకథా ప్రసంగముల్. ౭౧

వ. వారెవ రెవ రనిన నేనును నాయనుజుండు. ౭౨

ఉ. రంగనయాంతరంగమొ హ♦రంగని స్నేహితు లెల్ల మోద మా
రంగన, వేంకటేశపద♦రంగనటన్మతియై మనీషిసా
రంగనయప్రసంగముల♦రంగ నయాంగదిజ్ఞుఁడైనమా
రంగన; సాటి వానికి ధ♦రం గన సాధుగుణానుషంగునిన్. ౭౩

ఉ. పూతయశోవిశోభితుఁడు♦భూనుతకంచనపల్లివంశవి
ఖ్యాతుఁడు నాదుమామ ధుత♦కల్మషహృన్నళినీసమర్చిత
శ్రీతరుణీశపద్యుగకు♦శేశయ వేంకటసుబ్బరావు శ్రీ
సీతమ పేరియాత్మభవ♦శిష్టపణాయితశీల రంగయున్. ౭౪

వ. నా మఱఁదలు. ౭౫

ఆ. పాలవాయి వంశ♦భవుఁడు గండీరావు, నరసమాంబయను నెదు♦తరుణియందుఁ
బ్రేమఁ గాంచినట్టి♦రెండవకూఁతురు, రంగమ సుగుణగణ♦రంగమ యన. ౭౬

వ. అట్టిసమయంబున. ౭౭

కం. కనుఁగొనల దయారసము, ల్గునగునలాడఁగ నడిమి♦కొమరున్ ముగురం
దును గనుఁగొని సుబ్బన్నను, నను సుగుణవతీమతల్లి♦నాతల్లి యనెన్. ౨౮

చ. తెలియఁగ వింటిఁ బుత్ర! భవ♦దీయపితృవ్యులు పిన్ననాఁటఁ బా
టిలిన మరాటబాసను బ♦ఠింపఁగఁ గోసలరాజపుత్రిఁ దా
నలరుచు బంతిదేర్లయొడ♦యంచు వివాహము నాడఁబూన వా
రల కుదయించు వెన్నుఁ డని ♦ రావణుఁడున్ వెస వార నేఁచుటల్. ౨౯

కం. వినిన స్నీవాకథల, న్వినిపింపుము నాయనా! స♦విస్తరముగ నా
విని యెఱుఁగ నేను దల్లీ! మును దీని నదెట్లు పలుక ♦ మొనయుదు ననినన్. ౩౦

తే. రాదుగా నాకు నా మహా♦రాష్ట్రభాష
పెద్దకాలంబు నందలి♦వినికి గలదు
దాన దిఙ్మాత్ర మెఱిఁగించు♦దానఁ గొంత
బుధులవలనను దెలియుము♦పూర్ణముగను. ౩౧

వ. అని యించుకించుక వచించుటయు నిట్టి నిస్తులప్రశస్తకథాప్రపంచంబు సమస్తంబు నవిస్తరంబుగ నెఱుంగ బద్ధదీక్షుండనై విచారించుచున్నెడ. ౩౨

సీ. శ్రీరామచంద్రప♦దారవిందార్చనా, నిస్తుల శేముషీ♦నిధి యెవండు
ప్రాకటలంకల♦పల్లెసద్వంశస, న్మహనీయమౌక్తిక♦మణి యెవండు
ద్రావిడహూణాంధ్ర♦దేవభాషాదిష, డ్భాషావిధిజ్ఞమ♦నీషి యెవఁడు
ధీరవీరాసామి♦సూరిప్రమోదవ, ర్ధనశీలశీతల♦ధాముఁ డెవ్వఁ
తే. డట్టివేంకటసుబ్బార్యుఁ♦డార్యహితుఁడు, గోర వాల్మీకునకు మున్ను♦నారదుండు
పోలె నెఱిఁగించి పెరరేచెఁ♦జాలఁగనను, రమణ సీతాకావ్యవిరచనా♦రంభమునను.

వ. ఆయనకు. ౩౩

ఆ. కులము దానితోడు ♦ చెలువారెఁ బాండితి
వన్నె దెచ్చె రెంటి ♦ కెన్నగుణము
పోఁక లాకు లున్నఁ ♦ బొలుపారఁ దాంబూల
మునను వన్నె సున్న♦మునను గాదె. ౩౪

## అయోధ్యాపురీచరిత్రము.

శా. ప్రాజ్ఞగ్రామణీ యాతఁ డిట్టులను సా♦భిప్రేతంబు పెంపార నో
విజ్ఞానప్రియ! పుణ్యతీర్థముల సే♦వింపంగ మున్నే మహా
విజ్ఞుల్ దోడయిరాఁ జరించునెడలం ♦ బ్రీతిం గనుంగొంటి రా
మాజ్ఞం బాలితమై రహించిన యయో♦ధ్యన్ దేవతారాధ్యనున్. ౩౬

తే. ముక్తిదాయకపట్టన♦ములను మొదలఁ
గొలువఁబడు నెద్ది యపరవై♦కుంఠ మెద్ది
చూడఁజూడంగ మఱియింత ♦ చూడఁజూడ
వలయుననని యాస నెయ్యది ♦ గొలుపుచుండు. ౮౭

వ. అట్టి యయోధ్యాపురి చరిత్రం బించుక వచించెద విను మని యిట్లనియె. ౮౮

కం. శ్రీరాములు వైకుంఠముఁ, జేరం జనుటయును బిదపఁ ♦ జిత్రము! సరయూ
నీరము లయోధ్య ముంచిన, వారావృత మగుట విన్న♦వాఁడవుగావే. ౮౯

కం. ఆఁగిదిని బహువర్షము, లాపగనీట న్మునింగి ♦ యవిదిత మయి యి
ట్లాపురి చెలంగ నుజ్జయు, నీపురవల్లభుఁడు సర్వ♦నీతిపరుండై. ౯౦

ఉ. ఖండితశాత్రవోత్కరుఁ డ♦ఖండపరాక్రమశాలి క్షోణిపా
ఖండలమూర్తి సర్వసన♦ఖండయుతావనిమండలప్రజా
మండలరక్షణాత్తశుభ♦మండనకీర్తివిహారి విక్రమా
ర్కాంకసుధారిణీశుఁ డొక♦మంచు రహించెఁ గదా యతం డెదన్. ౯౧

మ. సకలోర్వీస్థిత్తదవతీర్థసం♦సందర్శనోత్సాహియై
యకలంకప్రతిభావిశేషమున ని♦వ్యక్షేత్రతీర్థాపగా
సకలాలోకనలోలుఁడై చన మ స♦న్వేషించె నిద్ధాంశుకై
యనఘా! కీర్తిశ్రమంబె గాని కనలేఁ♦డయ్యెం బురీరత్నమున్. ౯౨

తే. శాస్త్రచోదిత మైనట్టి♦స్థల మదెల్ల, జలమయంబయి యుండుటఁ♦జాలవగచి
తెలిసి పెద్దలవలనను♦గల తెఱంగు, ధైర్యని ర్జితకాంచనా♦హార్యుఁ డపుడు. ౯౩

కం ఏతాదృశ మగుక్షేత్రము, భూతలమునఁగానకుంట♦పోలునె? జనతా
పాతకనిపాతినార్థము, ఖ్యాతి యొసంగినను మృత్యు♦వైనను మేలౌ. ౯౪

కం. అని నిశ్చయించి నారా, యణుఁగూర్చి తపస్సమాధి ♦ నతినిష్ఠఁ జరిం
చినఁ బెక్కుహాయనంబులు, జనపాలునిఁ జూచి శౌరి ♦ సదయుం డగుచున్. ౯౫

వ. భవదీప్సితంబెయ్యది? వేఁడుమనుటయు దేవా! భవదీయరామావతారంబున నయో
ధ్య యెట్టులుండె నట్టివిధంబున లోకంబునకు న్గోచరింపవరంబొసంగ వేయనవుడు.

కం. శ్రీకాంతుఁడిట్టు లను నో, భూకాంత! త్వదీప్సితంబు♦పొసఁగ దొసంగన్
ఈకాంక్ష విడువు మనఁగ ర,మాకాంతునితోడఁ బల్కు♦మానవవిభుఁడున్. ౯౬

కం. అనువుల నైనను నీ కడె, గొనఁగెదనే కాని విడున♦నోర్తు నె కోర్కెన్
వ్యసనం బైనను రానీ, యస మైనను గాని విడున♦నాశయ మనినన్.

మత్తకోకిల. అంత సాహస మేల యయ్య ధ♦రాధిపా! విను మొండు నీ
స్వాంతవీథిని జూడ నెయ్యది ♦ యాశచేసెదొ యట్టిచో

ల్లింతయుం గన నిచ్చు నించుక ♦ యిచ్చగించిన నీధునీ
కాంత నా జనపాలవర్యుఁడు ♦ కాంక్షచేసెను గొన్నిటిన్. ౯౯

వ. అవి యెయ్యవి యనినఁ గైకయీకోపభవనంబును, శ్రీరామజననస్థలంబును, గాంచన సీతయు, గోప్రతారం బను రామనిర్యాణఘట్టంబును, హనుమాన్గడియు, నాగేశ్వరాలయంబు ననుకొన్ని ప్రదేశంబులు నేఁటికిని దృశ్యమానంబులై విక్రమార్కయశస్స్తంభంబులుం బోలె నొప్పుచున్న యవి. వానిపెంపుసొంపు వర్ణింపవలంతినే యని మఱియు. ౧౦౦

కం. అచ్చోట్లు విడిచి సరయువు, విచ్చేయుటకతన నేఁడు ♦ వీక్షింపఁగనౌ
నచ్చపుఁజందురు రేకన, మెచ్చులుగొలుపుచుఁ బురీస ♦ మీపమునందున్. ౧౦౧

తే. స్వామినిర్యాణఘట్టవీ♦క్షణముచేతఁ, గనుల నీరూర కుండినఁ♦గాఁడు నరుఁడు
కైకయీకోపభవనవీ♦క్షణముసల్పి, యామెఁ దిట్టనిమానవుఁ♦డవని లేఁడు. ౧౦౨

ఉ. క్రాలెడినెట్లు కాశి మణి♦కర్ణిక, యుజ్జయినీపురిన్ మహా
కాళనికేతనం బెటులు ♦ ఖ్యాతివహించెనొ, నైమిశాటవిన్
వాలెడుఁ జక్రవాపి యెటు ♦ భాగ్యవతీకీర్తిని, నట్లయోధ్యఁ దీ
ర్థాళుల నుత్తమోత్తమము♦నై శుభదం బగు గోప్రతారమున్. ౧౦౩

ఉ. వేలుపుటేలపాలనగ♦వెల్లియొ? కాదు; ద్రవించిపాలు తా
రాలలనామనోహరుని♦రశ్ములరాశియొ? కాదు; సత్సుధా
జాలమొ? కాదిఁకేమనినఁ ♦ జాహ్నుతరం బగు క్రొత్తముత్తెపు
న్నీలలతేట గావున ధు♦నీజలముల్ సికతాళి తారచూ
ర్ణాళి గతిన్ గనంగ నగు ♦ నందు నమేయపు లోఁతు గల్గియున్. ౧౦౪

కం కాంచనజనకాత్మజ రేఁ, గాంచఁగ నగుఁగాని పగలఁ ♦ గనరా దెటులే
నెంచఁగఁ దామా సీతా, చంచలనయనామరీచి♦సంపత్తతులన్. ౧౦౫

కం. రంగగుహారతి సీతా, మంగళదేవత కొసంగ ♦ మణిగణదీప్తిన్
బంగారొడలయినం దమ,యంగంబుల మఱచుచుందు♦రయ్యా దిదృక్షుల్. ౧౦౬

మత్తకోకిల. వేయిగన్నులు గోరితిం బృథ♦వీసుతం గనువేళల
న్వేయిజిహ్వలఁ గోరితిం ధర♦ణీసుతన్ వినుతింపఁగా
వేయిశిర్షము లాసచేసితి ♦ వెండి ధ్యానము చేయఁగా
వేయు నేటికి జన్మమేటికి ♦ వేదిజం గనకుండినన్. ౧౦౭

కం. హనుమాన్గడిని విచిత్రము, వినమా వివరింతు వినఁగ ♦ వీనులవిందౌఁ
గన మానస మలరదొకో, ఘనమానమువానరాళి♦గల దచ్చోటన్. ౧౦౮

కం! అటవీచరాళికొఱకై, విటపులదట్టంబునైన ♦ విపినము గల ద
చ్చట నుండు మొండితోఁకలఁ, జటులతరాకారములను♦శాఖామృగముల్. ౧౦౯

చం. అసమానప్రతిపత్తి నైన, విపులా♦హ్లాదంబుచే నైనఁ, బా
యసమర్థ లోకులు సంఘటించికొని రా ♦ హండాలతో వానరుల్
విసుమానంబుగ బారుతీరి నియమా♦విచ్ఛిత్తిమైఁ బోరకే
లసమానం బగుకీర్తిఁ గైకొనెడులీ♦లల్ నిత్యదగ్ధోదన
గ్రసనాభ్యాసులు వైష్ణవుల్ గుడిని నే♦రం జాల రో మిత్రమా! ౧౧౦

చం. అనఁగననంగ మాటలు త♦మంతటనే విరమించు; బాష్పముల్
గనఁగఁగనంగ మోదమునఁ ♦ గాల్వలువాఱును గంటఁ; దత్కథల్
వినఁగవినఁగ వీనులకు ♦ విం దయి పొందుగ విస్తరిల్లు; నే
మనఁగ! వనంగనేల నగ♦రాద్భుతలీలలు చూడకుండినన్? ౧౧౧

కం. రామప్రసూతిగృహముం, గామించి యెటైనఁ జూడఁ♦గా నోపినచో
భూమిఁ బ్రసూతిగృహంబును, గామించియ యైనఁ జూడఁ♦గా నోపఁ డయా.

మ. తతశృంగారకళానిధాననగరీ♦ఖాతాబ్జదృగ్గేహినీ
ధృతరత్నాయితమంగళాయతనసు♦శ్రేణుల్ దగు న్వేటలై;
పతకంబో యన సూర్యవంశభవభూ♦పాలావళీసంతతా
ర్చితనాగేశ్వర దేవతాయతన ము♦చ్ఛ్రి మించు మధ్యంబునన్. ౧౧౩

వ. అవి వచియించె నిట్లు మదీయజనయిత్రీప్రేరణంబున సుహృదీరితంబగు శ్రీకౌసల్యాపరిణయకథను ప్రబంధంబుగ రచియింపఁ గౌతుకాధీనమానసుండనై. ౧౧౪

కం. కారయిత రాముఁ డఁట స, త్సారమతిన్ శ్రోత రామ♦చంద్రుం డఁట నా
నేరమి నేరం బగునే? కారాకూరంబులేల♦కడఁగెదఁ గృతికిన్. ౧౧౫

చం. అరయఁగ మత్పురాకృతమ♦హాసుకృతంబు లనెట్టివో యహో?
ధరణిని లభ్య యయ్యె విబు♦ధప్రకరస్తుతమంజువాణి నా
కరుదుగ, దాని నే జనకుఁ♦డై హననేల్లుట ధారవోసెదన్
వరహితధర్మదానగుణ♦భాసితకీర్తికి రామమూర్తికిన్. ౧౧౬

వ. అని తత్ప్రసాదపరిలబ్ధకైయతనిసన్నిధానంబుఁ గల్పించుకొని నుతించెద. ౧౧౭

## కృతిపతినుతి.

తే. ధరణి దోఁగాడుచును బోవఁ ♦ దల్లిఁ జేరఁ
గాలుసేతులు డస్సిన ♦ నేల బొజ్జ
సోఁకఁగఁ బరుండి తలయెత్తి ♦ చూచుచిన్ని
చూపులను నేఁడు న న్నిటు ♦ చూడవయ్య. ౧౧౮

చం గునగునఁ దప్పతప్పటడు♦గుల్ చెలఁగం బరువెత్తుచుం దటా
లున మెడఁ గౌఁగిలింప నొడి♦లో నెగఁబ్రాఁకఁగ ముద్దువెట్టుచు

జ్జననియిదేమి నాయన! య♦నన్ మురిపెంబున "నమ్మ! పాయి" యం
చనియెడు ముద్దునెమ్మొగము♦నందముఁ జూపఁగదయ్య రాఘవా! ౧౧౯

చం మురిపెపుఁజుక్కబొట్టు, నును♦ముంగురులల్లినపింపిణీజడల్
పరఁగఁగ ముద్దుగార్చు జన♦పాలును, సొంపగుపాలబుగ్గలు
స్దరహసితంబు, వక్షమున ♦ నాగొపుజంటెము నొప్ప మానితో
సరసతఁ దోడఁగూడిచను♦చారుతరాకృతిఁ జూపు రాఘవా! ౧౨౦

చం. బుగిలెడు నూర్ధ్వపుండ్రమును ♦ బుగ్గను జుక్కయుఁ, గమ్మవాసనల్
నిగనిగలాడు హారములు ♦ నీ టగుపోఁగులు, వల్లెవాటు, మే
ల్వగగల పచ్చదోవతులు ♦ పాదములం బసుపంటు లత్తుక
ల్నగుమొగ మొప్ప పెండ్లిపొఁయ♦లు గనిపింపు జానకీశ్వరా! ౧౨౧

సీ. తలఁబ్రాలు దోయిటఁ♦దాల్చియొండొరులను, మిగుల నుత్సాహంబు♦మీఱ మీఱ
శిరమునఁ బోయుచోఁ♦గరమునాఁకెఁ జెమర్చు, మేనుల సర్ధసి♦మిళితంపుఁ
గనులఁ బరస్పరం♦బును జూచి చూడక, యరివాణ మది రత్న♦దగుటయైనఁ
దెలియక కేల్సాఁచి♦తెలిసి లోఁ గొదుకుచు, నాస్యబింబంబుల♦నావరింపఁ

తే. బసుపుపొడి హారిద్రమూను♦పాత్రములన, ననుపమానవిలాసవి♦హారులైన
శ్రీవధూవరులార! మీ♦చెలువుచూప, నాకునాశ్చర్యకంపుఁడే♦ననుపమెఱయ.

మ. తలఁబ్రాల్ దోయిట దోయిలించి తలమీఁ♦దం బోయుభూపుత్రికో
జ్జ్వలశోభాయుతబాహుమూలములపైఁ ♦ బార్శ్వస్థభామాళిపైఁ
జెలియూరుస్థలిపై సభాసదులపై ♦ సీతాస్యపద్మంబుపైఁ
దెలెపైఁ బొలరలాడుచూపులఁ బ్రసా♦దింపం గదే రాఘవా! ౧౨౩

తే. చెలఁగి యుద్వాహపీఠి వ♦సించువేళ, నూతనాభ్యస్తచౌర్య్యకే♦నోదములను
నెదురుకోలాడు మీసిగ్గు ♦ కుదురుబెదరు, కలికిచూపుల నామ్రోలఁ♦గులుకరాదె

మ. దరహాసాంకుర మొప్ప మోవిపయిఁ బ్రో♦ద్యత్కోకిలథవహ్ని చ్ఛటా
శ్యరుణీభూతము లైన నేత్రములతో♦జ్యాకృష్టిబద్ధాంగుళీ
వరవిన్యాసముతోడ, భార్గవుని ని♦ర్భర్త్సింప నీక్షాను ని
ష్ఠురబాణాగ్ని మదీయదుర్గతికిఁ గూ♦ర్చున్ భస్మసాత్కారమున్. ౧౨౪

చం అడవికిఁ బోర కాల్నడ, ర♦యంబునఁ గట్టర నారచీర లి
ప్పుడ యని కైక వల్కనను♦బోణిమి వాసెనె? యశ్రు లూరెనే?
తడఁబడెనే పదాళి? ధృతి♦దప్పెనె? యేమియు మోము వాడెనే?
చెడెన కడంక? యట్టి యతి♦చిత్రపుఁదాలిమి నా కొసంగరా. ౧౨౫

శా. రామా! రామయ! రామచంద్ర! రఘువీ♦రా! యంచు వాపోవుచు
న్నామాపూరుషశాలకానఘులు కాం♦తారప్రవేశోన్మతిన్

రా, మీ వెంట గృహంబు నూరు విడి యా♦రా వారి వంచించితో
స్వామీ! మీ వెనువెంటఁ బర్వ లిడుమ♦త్స్వాంతంబు నూరార్పవే! ౧౨౭

ఉ. ప్రాణము వోలె నిన్ను నెడఁ♦బాయని సత్ప్రకృతీద్ధభార్య, య
గ్లానిని గొల్వ శేషగుణ♦లక్ష్మణుఁ డుండఁగ, వన మున్కిపట్టుగా
జానగుటం గదా వనిక♦సాగితి వర్మిలి; నేవిభూతియుం
దేనియు నీకు వేఱు గల♦దే విభవంబు వచింపు తత్త్వముల్? ౧౨౮

ఉ. దాసరితప్పు లన్నియును ♦ దండముతోఁ సరినాథ! వీఁడు మీ
దాసతఁ గాంచె నిష్ఠభయ♦దాన మొసంగఁగ నర్హమంచుఁ గా
కాసురు సాపరాధుఁ గృపఁ♦గావఁగఁ బల్కితి వట్లు వీఁడు మీ
దాసులదాసుఁ డిష్ఠభయ♦దాన మొసంగెదొ తల్లి! జానకీ! ౧౨౯

చం. కలుగునటయ్య రామ! ధరఁ♦గాంచనసన్మృగిం? బదేమి ధ
కలిలమొ; యాస దోసమెఱుఁ♦గం గలదా? విను నీదుమాయయే
యలమెనె నిన్ను? ముప్పునిడె♦నయ్యలజన్నిద మయ్యవారి కన్
బలుకు యథార్థ మయ్యె నెటు♦పాలన సేసెదొ నన్ను మోహితున్, ౧౩౦

చం. తెలివి దొఱంగి నీవు పెగి♦తిట్టితి వందురు నీమఱందినిన్
దెలియనివారు, రాక్షసు తె♦తిన్ వధియింపఁగఁ బ్రాణనాథుఁడుం
బలికినబాస దీర్ప నటు♦పన్నితు పాయముఁ గాక నీకునుం
గలుగునటమ్మ సీత! యొక♦కాలమునన్ భ్రమ మానసంబునన్. ౧౩౧

తే. దంష్ట్రలే లేరు నా కని ♦ ధరణితనయ
తన్ను భర్త్సించు దైత్యకాం♦తలను మనిచె
శరణటన్నను బ్రోతు నన్ ♦ శపథ మూని
గ్రుడ్డుఁ బెకలించితివి కాకి♦గోడుకుడువ
సెవ్వతరు లేరొ మీలోనఁ ♦ జెప్పవయ్య? ౧౩౨

శా. లీలాలోకనమాత్ర లోకములఁ గ♦ల్పింపన్ హరింపంగనౌ
లీలామూర్తివింపామను, బలెనె జా♦లిం బొంది తేలా కడున్?
ఏలా క్రోఁతుల నాశ్రయించితివి తం♦డ్రీ! కట్టి తావార్ధి? స
చ్ఛీలా! ధాత్రిని గర్మయోగమ యను♦ష్ఠేయంబుగాఁ దెల్పనో. ౧౩౩

ఉ. కర్మము భుక్తమైన మఱి♦గాని లభింపదు ముక్తి యన్న యా
కర్మఠవాక్యపద్ధతులఁ ♦ గాఱియఁ జెందితిఁ గాని రామ! నీ
వర్మిలిఁ బక్షిరాజునకు ♦ నక్షయసౌఖ్యము లీయఁ జూచి నే
శర్మద మైనమీఁదయ క♦సాధ్యము లే దని నిశ్చయించితిన్. ౧౩౪

ఉ. గాటపుభక్తిఁ జిత్తమున♦క్ష్మాతనయాప్రమదైక హేతువున్
నాటుచు సేతువున్ దనుజ♦నాయకపట్టనధూమకేతువున్
జీటికిమాటికిన్ హృదయ♦సీమ ధరించి భజింతు నాధను
ష్కోటిని బాపశైలశత♦కోటిని ముక్తిపథాటివీటినిన్. ౧౩౫

ఉ. పక్కికి మోక్షమున్ దనుజ♦వానరనాథులకుం బ్రభుత్వము
ల్గ్రక్కున నీవి నీదయకు♦లక్ష్యము లందురు, తేర కిచ్చితే?
యొక్కటిపోరఁ బ్రాణములు♦నీయఁగఁ గడంగరె? యేమిలేని యీ
బక్కగు వాగుఁ బోతునకు♦భద్రముఁ గూర్పనఁగాదె సాక్ష్యమా. ౧౩౬

ఉ. తమ్ములు బిడ్డలున్ సఖులు♦దానవవైరిగ రాముఁ డన్నఁ గో
పమ్మున రజ్జులాడి దశ♦వక్త్రుఁడు నాటఁగ మేను నింపె నీ
యమ్ములు విశ్వతోముఖము♦లై మఱి విశ్వమయుండు నామముం జి
త్తమ్మునఁ జూచె నంత్యదశ♦ధన్యత నట్టిది నా కొసంగుమీ. ౧౩౭

సీ. వసుధఁ గల్గిన మేలి♦వన్నెపుత్తడిబొమ్మ, దానగుణాకల్ప♦ధరణిజాత
రత్నగర్భాగర్భ♦రాజితసురమణి, రామశీలఖచిత♦హేమభూష
దనుజారిరామశ♦త్రఘ్నికి జానకి, నతపంక్తి ప్రత్యాశ♦వచణసీత
నాథవక్షస్స్థలీ♦నవ్యయోజనగంధ, భక్తసంఘాతంబు♦పట్టుఁగొమ్మ
తే. దైత్యకులవల్లికాకోటి♦దళనకమల, జనకధరణీతలేశ్వర♦సవనఫలము
మైథిలీదేవి మోక్షసం♦పదలదీవి, నాకు సాక్షాత్కరించుత♦నాథుఁగూడి. ౧౩౮

సీ. వాసవమణినీల♦భాసురగాత్రుండు, చారువీరాసన♦సంస్థితుండు
వామజానుస్థిత♦వామకరాబ్జుండు, జ్ఞానముద్రాంకాప♦సవ్యకరుఁడు
మణిమయకోటీర♦మండితశీర్షుండు, శ్రీవత్సకౌస్తుభ♦చిహ్నితుండు
రాణిమై జానకి♦రాణింప డాపల, శస్త్రనీరేజాతి♦హస్త యగుచు
తే. వెలసి, తమ్ములుఁ బావని♦కెలనఁ గొల్వ, లోకములనేలు నతజన♦శ్రీకరుండు
రమ్యగుణకీర్తి పట్టాభి♦రామమూర్తి, పాయక వసించు నామనః♦పద్మపీఠి. ౧౩౯

ఉ. అన్న యటంచు నమ్మి పర♦మాపదఁ బాపని తమ్ముఁగుఱ్ఱ స
నన్న పొకాలువంటి, పతి♦వంచును సత్వరతుండ వంచు లో
నున్నకఠోరగర్భవిపి♦నోర్విని ద్రోసితి వంచనన్ సతిం,
గన్నసుతాళి పేఘులను♦గాథలఁ జెప్ప వినంగ సైచితే
మున్న దొయింక నాదుగతి♦యుల్లమునన్ నిను నమ్మియుండుటన్. ౧౪౦

ఉ. క్రోఁతిగఁ బుట్టినైన నినుఁ♦గొల్వకపోయితి; గ్రద్దనొచు సం
ప్రీతిని బ్రాణ మియ్యఁగను♦మేకొనకైతిని; భూజమూషికం

బై తగుసాయమునుం జలుప♦నైతిని; బోయత నౌచు సాపడన్
జాతిఫలంబు లీయ; నెటు♦సార్థకమౌనొ మదీయజన్మమున్. ౧౪౧

చం. అడవిని రాయినైన, గహ♦నాంతరమందలి గ్రద్దనైనఁ, గా
ఱడవిని దుష్టకాకమయి ♦ యాఱడివెట్ట, నయోధ్య వీథిలో
మిడికెడుకుక్కనైనఁ, దమి♦మీఱఁగ దండక వృక్షమైన, దం
దడి నిల జన్మమెత్తినగ♦దా భవదాస్య విలోకనాప్తిచేన్. ౧౪౨

సీ. దొరకునే నాబోంటి♦విరసమానసునకుఁ, దావకీనపదాబ్జ♦సేవనంబు
వెలయునే నావంటి♦విషసమేధునకును, దావకభక్తిసు♦ధారసంబు
చలుపునే నాయట్టి♦జాత్యేకమానియుఁ, ద్విజన్మవేళ న♦భ్యర్చనంబుఁ
గలుగునే నను(బోలు♦ఘనతమోంధునకును, దావకీనము♦ఖేందు♦దర్శనంబు

తే. ఏది గతి నాకు రక్షకుం♦డెవ్వఁ డయ్య, నీ వనాదృతిచేసిన ♦ నీరజాక్ష!
యన్యమేదియుఁ గోర నౌ♦నట్లుగాని, చాలు నీపాదభక్తి నొ♦సంగితేని. ౧౪౩

మ. అవతారంబులు లేవె యవ్వి ఖలసం♦హారంబునుం జేయవే
యవి నీనామసదా♦వ్యయాఖ్యరుచి నే♦లా పొందవం చాత్మలోఁ
దప్పలం జింతిన సేసిచేసి కలత♦త్త్వంబెల్ల నేఁ గంటి రా
ఘవ! దివ్యామృతలబ్ధజన్మ మొనరం♦గా లేమినిం గాదొకో. ౧౪౪

సీ. క్షోణీసురాత్మజా♦సుప్రదామోదక, యని యన్న భవభయం ♦ బణఁగిపోవు
నీ నబ్బసుఖము ని♦న్నిద్రతఁ జేసెద, వనిన నిత్యశ్రీల ♦ నమరు సుఖము
ధీరామలగుణవి♦హారా యటన్నను, బాపసంఘవిభంగ♦పటిమ బ్రాఁతె
యమితనయాన్వితా♦శ్రమనర్థనా యన్న, నిత్యవిభూతిని ♦ నెగడఁగల్గు

తే. శరణు శరణంటి రామ! నీ♦బిరుదములను, మాఁకాఖ్యార్ణసంఖ్యాక♦ధామసంస్థ
వర్ణములఁ బ్రోసి చదివిన♦నిర్ణయమగు, నఱయొనర్చిననన్ను నీ♦యపయశంబు ౧౪౫

సీ. అవతారములు లేవె ♦ యాబాలగోపాల, మును ముక్తిఁ జేర్పంగ♦గనవు గాక
మంత్రము ల్మహి లేవె ♦ మననీయమహనీయ, తారకఖ్యాతిఁ ♦ దగవుగాక
సత్యవాదులు లేరె ♦ సాతత్యవైయాత్య, రామవాక్యాభిఖ్య ♦ రాదుగాక
కరుణాపరు ల్లేరె ♦ శర ణన్న సుర లెన్న, వైరిసోదరుఁ బ్రోవ♦ లేరుగాక

తే. వ్రతులుధరలేరె యేకభా♦ర్యావ్రతస్థు, లెచటఁ గనరారుగాక ని ♦ న్నెన్నఁదరమె
భక్తరక్షణని స్తంద్ర♦పార్థివేంద్ర! రమ్యగుణసాంద్రదపట్టాభి♦రామచంద్ర! ౧౪౬

సీ. బాజాటిజనములు♦నీజాఱ గోఁజాడ, బేజాఱుపడినట్టి♦వితముతోడ
తహశీలుదారుల♦తహతహపాటులఁ, గలఁత చెందినబుద్ధి♦యులఁతతోడ
గ్రామైకరాత్రంబు♦గా దివసైకభు, క్తంబుగాఁ బడుప్రయా♦సంబుతోడ
క్షయము కారణముగ ♦ స్వర్ద్వారపర్యంత, గమనాగమనభవ♦శ్రమముతోడఁ

తే. బలుకఁ గడఁగితి నీమాతృ♦పరిణయంబుఁ
జెడుగునుడుగుల నుడిపి నా♦నుడులఁ గృతిని
గడఁగనంగను జేయుమా ♦ కరుణమీఱ
రక్షితామరలోకేంద్ర♦రామచంద్ర! ౧౪౮

సీ. పట్టనిగోడుగులు♦పవలింటిమబ్బులు, కరదీపికలు తటి♦ద్గణము లిరులఁ
గైవారములు మేటి♦ఘంటాపథంబులు, పటకుటీరంబులు ♦ పాదపములు
పాకశాలలు వృక్ష♦వారమూలంబులు, పచ్చడిమెతుకులే ♦ పాయసములు
తోటితలారులు♦స్రోవతోడులు నెడ,తీయనిచర్చ మా♦దిగలరచ్చ
తే. గాఁగ నోరంతప్రొద్దదో♦కారణముగఁ, బొట్టకొఱకునుదిరుగు నా♦బోటులు లేడ?
నిన్నుఁ గావ్యముఖంబున♦నెన్ను టేడఁ, దావకీనకృపాదృష్టి♦దవుల కున్న? ౧౪౯

సీ. సత్త్వభక్తిక్షీర♦సంక్లిన్నమై నిర, తామలశ్రద్ధాసు♦హల్య మగుచు
నమరుకౌసల్యాహృ♦దాలవాలంబున, విష్ణుపదధ్యాన♦బీజ మొసఁగ
నా జిదోహదకారుఁ♦డను వేలర్క్తి సు,ధాభిషేకంబున♦ననువుపఱుప
నంకురమై గాధి♦జావితమై యోచి, మృదులసీతాలతా♦వృతము నగుచు
తే. నలువముకొంటిపట్టుఁగొ♦మ్మలకుఁ బ్రాఁకి,కపులజాతాంసకర్పర♦కాయమాన
మొరసియవ్యయఫలదమై♦యొప్పురామ,కల్పమిదుఁగాక నా మనః♦కాంక్షితములు.

ఉ. ఆసురశిక్ష భూమితన♦యాగ్నిప్రవేశము కాకరక్షణం
బాసరమాధవాభయము♦నంబుధిబంధన మాంజనేయసే
వాసుకృతంబు పుష్పకని♦వాసము కార్ముకభంజనంబు మే
ధాసుభగత్వ మోక్షదక♦థల్ దిగధీశవిధిస్మరేశు లా
వాసపటాళి వ్రాసి యతి♦భక్తి భజించెడి రాముఁ గొల్చెదన్. ౧౫౦

చం. క్షితిపయిఁ బుత్రభిక్ష శచి♦కిం, బతిభిక్ష సురప్రవంతికా
సతికిని, జీవభిక్ష దివ♦సప్రభుసూతికి, గౌతమర్షికిన్
హితగతిఁ బత్నిభిక్షఁ, ద్రిది♦వేశుల కస్థలితాన్నభిక్ష, నా
యతమతి నిచ్చు వేల్పు పర♦మాత్ముఁడు నా కిడు మోక్షభిక్షమున్. ౧౫౧

తే. రామచంద్ర! సుతుండు మున్♦రాగమునను
బాడ నీజన్మకథనంబు ♦ నాఁడు వినితి
రామచంద్రసుతుం డను♦రాగమునను
బలుకునీమాతృకథ మది ♦ యలర వినుము. ౧౫౨

---

# కథా ప్రారంభము.

కం. శుకుని న్వర్జితకల్యం, శుకునిన్ ముఖకాంతిహసిత♦శోణమణిచ్ఛాయం
శుకుని న్వ్యాసమునీశశి, శుకునిం గని యనియెం బార్థ♦సూనునిసుతుఁడున్. ౧

చం. అడిగెడువారి కేమి యన♦యంబును జెప్పెడివారు గల్గఁ దా
రుడుగక ప్రశ్న సేయ నగు ♦ నూఁకొను టంతియు కాదె? వేసటన్
బడలక చెప్పఁగా వలదె ♦ వారని ప్రేమ; ధనైకకాంక్షచే
నడిగెడియాచకుండు దెలి♦యంగ సమర్థుఁడె దాతృకష్టమున్? ౨

కం. అట్టుల కావున నిన్నా, ఘట్టిట్టును గదలనీక ♦ యడుగఁగ మీారుం
బట్టుగఁ బ్రేమం జెప్పటఁ, బుట్టెను మఱిమఱియు నడుగ ♦ బుద్ధియు నాకున్. ౩

చం. హరి జనియించి తా దశర♦థావనినాథతనూజుఁడై తనుం
బోఁగొను నంచు రావణుఁడు ♦ పూర్వమె విన్కియుఁ గల్గి కంసునై
ఖరి మహితాంగరాయములఁ ♦ గల్పన సేయక యున్నె? చెప్పుమా
ధరణిపుజన్మకర్మచరి♦తల్ హరి యాతనియందుఁ బుట్టుటల్. ౪

కం. నా చెవులు హరికథ ల్విన, వాఁచినయవి యానతీవె♦వాచవు లొలుకన్
వాచంయమివర్యా! నీ, వాచరితము రవికులోద్భ♦వాచరితంబున్. ౫

ఆ. అనుచుఁ దన్ను వేఁడు♦నభిమన్యుసుతుఁ జూచి, చిలుకజోగి కరుణ♦చిలుకఁ బలికె
నీదుప్రశ్న చూడ♦నిఖిలోత్తరం బయ్యె, రాకుమార! యుత్త♦రాకుమార! ౬

కం. చిత్రము దశరథుసచ్చా, రిత్రము వినుమా యశేష♦రీతి న్వినుతున్
గాత్రము గగ్గురుపొడువఁ బ,విత్రము భవపంకహ్రాతిప♦విత్రం బగుటన్. ౭

కం. సాధువిరోధులు జనధన, మేధాబలముల నదెంత ♦ మీఱుచు నున్నన్
సాధింపలేరు సుజనుల, సాధువుల న్మాధవుండు♦సంరక్షించున్. ౮

ఉ. అందని మానిపండు కడు♦హ్రస్వునకున్, భృశనీచలోభి కిం
పొందుయశంబు, మందునకు♦నుత్తమసాహితి, పాపజాతికిన్
డెందమునందు బల్దయ, క♦డిందిపనుల్ నిఱుపేద, కెట్లు టం
చుందురు వైర్యసాధ్యను న♦యోధ్యను లోకులు శత్రుకోటికిన్. ౯

తే. నేల గలయంతవట్టును ♦ నేలఁ గలిగి
కోఁచలై నృపు లరగట్టఁ ♦ గోసలపురి

భూజనములకు నైలింప♦భూజ మనఁగ
రమణ విహరించు రఘుధరా♦రమణుఁ డధిప. ౧౦

వ. నిరఘుం డైన యీరఘు వొక్కఁడు సర్వతంత్రస్వతంత్రు లగుమంత్రులును, బర మపరుక్షీ రౌతువులగు రౌతులును నుచితానుచితవివేకులగు ప్రాడ్వివాకులును, నాగా మికశుభాశుభవిజ్ఞు లగు దైవజ్ఞులును, సకలకళాధారు లగుధీరులును, నిజప్రతాపహా సితసూరు లగుశూరులును, వినయరసామంతు లగుసామంతులును గొల్వఁ బేరోల గంబున నున్నయెడ దౌవారికుం డరుదెంచి. ౧౧

కం. ఊరు విదర్భాపుర మఁట, వారు పురోహితులఁట జన♦వరుఁ డనుపంగం
గూరిమిని వచ్చినారఁట, వారికి మీదర్శనంబు♦వలెనఁట దేవా. ౧౨

కం. దేవర! వచ్చితిఁ దెలుప ని, దే వరమతి యొప్పు నిలిపి ♦ దేహలికడ నే
దౌ వారికి సెల వెయ్యది, దౌవారికునకును ముదల♦దయ సేయుఁ డనన్. ౧౩

వ. తరణికులాభరణం బాదరణంబున వారల రాని మ్మనుటయు వారలు చనుదెంచి యాశీర్వచనపూర్వకంబుగ ౧౪

స్వాగతము. తారసిల్లి యరు♦దారనభంబుల్, గారవించునడి ♦ గ్రావముల స్నీ
చారుకీర్తి; సుఖ♦సంపద యే? యం, చారయంగ నృపు♦స్వాగత మిట్టుల్. ౧౫

వ. రఘుమహారాజును వారల నుచితసత్కారవిధుల మన్నించి యర్హాసనాసీనులం జేయఁబనిచి తదాగమననిదానం బడుగుటయు వారలు ౧౬

కం. భోజుఁడు యాచకనిర్జర, భూజుఁడు మాదాంధవైరి♦పుష్కరజాతాం
భోజుఁడు జననుతసద్గుణ, భాజుఁడు మీసేమ మడుగఁ ♦ బంపె న్మమ్మున్. ౧౭

వ. అతండు తనయనుజాత యగునిందుమతి స్వయంవరమహోత్సవంబునకు ౧౮

కం. ధీమంతులు సౌందర్యర, మావంతులు విక్రమమహా♦మామంతులు స
న్మావంతులు కులగుణసుష, మావంతులు రంహు శౌర్య♦మావంతులరేన్. ౧౯

వ. అని యందఱునృపాలురకుం దెలియఁ బఱిచి మమ్ము మీకడ కీకమ్మనిచ్చి పుచ్చిన వచ్చితి మనుటయుఁ దమకమ్ముగ్రమ్మ నక్కమ్మఁ గరమ్మునఁ గరమ్మునికరమ్మగు కనికరమ్మునఁ గొని కని తదాహ్వానమ్మునకు మనమ్మున సమ్మతించి వారలఁ బోవంబంచి తనయంచున రమాకుమారు మాకుమారుఁ గుమారు మాఱుపఱుచు వేషమనీషాబలవిశేషంబుల మీఱుచు ౨౦

కం. తన యాకారము దోఁపఁగఁ, దనయాకారంబుతోడు♦త నయాకృతి శ్రీ
తనయాకృతివిలసిల్లెడు, ఘను నజునిం జూచి పలికె♦ గారవ మారన్. ౨౧

ఉ. వీరలవాక్యముల్ విని తె♦వీరుల కియ్యది యాత్మపౌరుషో
దారవిహారభంగి నరు♦దారఁ బొగడ్తకు నెక్కు వేళ; దో

స్సారము పేర్మి నీవు నవ♦సారసలోచనఁ గాంచురమ్ముకు
త్రా! రహిమీఱుసీబల ము♦దాత్తయశంబు జగం బెఱుంగఁగన్, ౨౨

ఉ. సారముదంబు పేర్మి నవ♦శారమనోజ్ఞ గ్రహింప విప్రతీ
సారము మీఱఁ దారు భుజ♦సారమున న్నృపవర్యకోట్లహం
కారము తోడు మన్మథవి♦కారముఁ గూడఁగ దుష్టమాక్రియా
కారము లుగ్గడించి ప్రతి♦కారము సేయఁగఁ జూతు రాత్మజా. ౨౩

ఉ. ఘోరచమూసమూహములు♦ఘోటులవారణవారణంబు లే
పార నపారమైన భట♦వర్గ మనర్గళరీతిఁ గ్రాలఁగాఁ
జేరి విదర్భరాజపురిఁ♦జెన్నుగఁ గన్నియఁ గాంచు నిర్భర
శ్రీ రహిమీఱ రమ్ము జయ♦శీలుఁడవై తనయా! రయమ్మునన్. ౨౪

కం. విను తనయా! వినుతనయా, వనిత నయము మీఱఁ దెమ్ము♦భద్రం బనుచున్
సనయముగా దీవించుచుఁ,బనివిను మని పనిచెఁ దోడు♦పడ సైన్యంబుల్. ౨౫

వ. ఇట్లు పంచిన నజుండును ౨౬

— అజమహారాజిందుమతీస్వయంవరమునకుం బోవుట. —

కం. ఇందుమతి లేని సౌఖ్యము,పొం దొకపొందే తలంపఁ♦బూరుషమణికిన్
ఇందు మతి లేని సౌఖ్యము,పొందొకపొందే తలంపఁ♦బూరుషమణికిన్ ౨౭

వ. అని సముత్సాహంబున ౨౮

మ. చని కాంచెన్ వసుధేశనందనుఁడు భా♦స్వచ్చారువీచీశిఖా
యనశీతాంచితవాతఝోలితసుఝో♦లాబ్జాబ్జఝోలాంతఝో
లవలీలాప్రవిఘూర్ణమానవరఁగా♦లాస్యన్మిళిందాంగనా
కనదక్షీణజనేక్షణక్షణదదీ♦ప్తాశర్మదన్ నర్మదన్. ౨౯

ఉ. నర్మదఁ గాంచి తే యనుఁగు♦నర్మద! నిర్మదలోక పాళికిన్
శర్మద, దృష్టిమాత్రకువి♦చారజనాఘవిదారణక్రియా
ధర్మద, స్నానలోలజన♦తాశమనేష్వపహాసిహ్రాదినీ
వర్మద, శీతవాతతట ♦ వర్తిసునర్తనజాతఘర్మదన్. ౩౦

వ. అని చెలికానికిం జూపుచు డాయం బోయి ౩౧

కం. నీవారము గ్రసియించుచు, నీవారిని గానినవాని♦నిర్జరయువతుల్
నీవార మనుచు నందురు, నీవారము గావు మమ్ము♦నిండాగుదయన్. ౩౨

శా. ఆమందాకినిసంగమంబు మదిలో♦నాసించునే? యెంచునే
శ్యామాంగ న్యమునాస్రవంతిని? సర♦స్వత్యాపగం దేపకు

న్గామంబొప్ప రమాప్రవర్తనల నా♦నందించునే యబ్ధియున్ ?
నీమందానిల మింత సోఁకుతటి మే♦నిం బూర్వభాగీరథీ! ౩౩

కం. తనమనుమరాలి వగు నీ
దనమనము విరాళిఁ దూలఁ ♦ దహతహఁ గను నీ
తనుమహిమయొ యటుగాక య
తనుమహిమయొ రేవ! నిజము ♦ దలఁప జలధియున్. ౩౪

అజుని సేనపై వనగజంబు గవియుట.

వ. అని యజ్జవాలుపడగదొరయొజ్జ బొజ్జ బుజ్జగించు నజ్జలధిపతికజ్జలవతి వినుతించుచు ముజ్జగంబులకర్మరజ్జువులు నజ్జనజ్జగ నుజ్జగింపంజాలు నజ్జలంబుల సజ్జకంపు సజ్జన సజ్జనపతి పరిమజ్జనంబులతో మజ్జనాదికంబు లొనర్చి యాయజ్జన నాపజ్జ నొక సజ్జహజ్జలంబుల సెజ్జ నున్న నట్టియెడ నట్టియగుట్టు నుట్టుపడ నెట్టన మిన్నుముట్టి నదిట్టరూపంబునఁ గుట్టారంబులు పదఘట్టనంబుల నట్టిట్టు బిట్టుకొట్టుకొనియాడ దట్టించిన రట్టునఁ జెట్టులెల్ల నొక్కపెట్ట మొదలుముట్టఁ బట్టుచెడి నేలమట్టంబుగ ప్రాలఁ, గావలంబునకుఁ దానలం బైనయొక మదావిలమదావళంబు హేరాళం బుగ రొదాళంబంతరాళంబు వగుల సరాళంబుగఁ గవిసి పాళెంబు వేళాకోళం బుగా విచ్చలవిడిఁ బెచ్చు పెరిఁగి పొచ్చెంబులేక హెచ్చిన నచ్చుపుమచ్చరంబున సేనఁజొచ్చి క్రిచ్చఱవచ్చి కిచ్చునఁ బైవచ్చిన రిచ్చారులు పిచ్చలింపఁ గ్రుచ్చి యు గాటంబుగ వాటంబుగ నాటిన కూటంబులఁ గట్టుటఁ గొట్టుచుఘోటంబుల కూటంబులఁ గూటంబులతోడఁ గరహాటంబులఁబోలె నిరాఘాటంబుగఁ బీఁకి సపా టంబుగఁ బాటనంబుసేసియు నఖండ కాండోద్దండ వేదండ ప్రకాండదండంబుల తుండంబుల శుండాదండంబునఁ బ్రచండంబుగఁ బట్టి చండరవపిచండిలదిఙ్మండలంబు ఖండఖండంబులుగ నేలఁ జమరుచుఁ జూపఱు సంచలింప సంచరింపఁ బంచబంగా ళమైనపంచమంగళంబులును బచ్చముపాడైన నిగిడారుగుడారులును గలిగి వాఁడి దఱిఁగి వాడఁబాఱిన సేనం జూచి ౩౫

కం. తామరకొలని బెఱంగునఁ, బామరజనములను గజము ♦ పటుగతిఁ గలఁచెన్
ఏమఱఁ దగునే సేనల, కీమఱుకువఁ బాపవలదె ♦ హితమతి నగుచున్. ౩౬

కం. ఏనిక మదసహితం బగు, నేని కడిమిఁ గలనఁదక్క ♦ నితరతలములన్
తేనికినిఁ జంపరా దన, నే నిఁక సైన్యమును దంతి ♦ యేపడఁగించున్. ౩౭

వ. అని ౩౮

కం. వాలెము నాతఁడు వైచిన, వాలెముకలఁ దూఱ నేల ♦ ప్రాలుచు జముప్రోల్
పాళెముఁగొనెఁ గరి; నరపతి, పాళెము సంతోషమునను ♦ బరివర్తింపన్. ౩౯

వ. ఇట్లు జడిపింప బెడిదంబుగ నడిదంబున నడిచిన గజంబు పుడమిం బడుటయు నక్క
డిందిమగండు డెందంబునం గుందుచు ౮౦

కం. వెఱఁగొన నడిగము వైచిన, మొఱయిడుచుం జచ్చె గజము ♦ ముఱకంబఱఁగాఁ
బిఱుసుచెడి పిడుగుతాఁకున, నొఱగిలఁబడినట్టి గట్టొ♦కో యని తోఁపన్. ౮౧

ఉ. కారణమేది వారణని♦కారణకారణ మైనయీయసం
స్కారభవాఘుమిట్టులు ని♦కారవిధంబున వచ్చెఁ గా; ప్రతీ
కారము సేయు టెట్లు? నుడి♦కారముచే నఘమాఱునే? నిజా
గారముఁ జొచ్చుటెట్లు? ననుఁ ♦ గన్నఘనుం గను టెట్లు పాపినై? ౮౨

మ. అనుచుం గూఱిన వంత వందురుచు ను♦న్నంతం గడున్ వింతయై
వనకుంభీంద్రతనూవినిర్గతమహా♦భాస్వత్ప్రభాజాలముల్
ఘనమై దిక్కులఁ బిక్కటిల్లె, జనసం♦ఘం బొప్ప నిశ్చేష్టమై
కనరాఁగ న్నడుమంత్రమందు నొకయా♦కారంబు తోరంబుగన్. ౮౩

కం. భగ్గున వెలుంగుదోఁచిన, ధిగ్గని చూపఱకు మనము ♦ దిటచెడఁ గాంతిన్
దిగ్గన మ్రాఁగన్ను వడ, న్నిగ్గునఁ దరతరముచూడ ♦ నిపుణాలి నందున్. ౮౪

సీ. నగుమోముగలవాఁడు ♦ నగధామహిమధామ,వరధామమైయొప్పు♦వపువువాఁడు
తళుకుఁజూపులవాఁడు♦తతహీరమణిహార,పదహారికంధరా♦పదమువాఁడు
సొగియురూపమువాఁడు ♦ సురరాజరవిరాజ,దీప్తిరాజితమైన♦తేజువాఁడు
హైమచాపమువాఁడు♦హరిహేతిరుచిభూతిఁ, బరిభూతియొనరించు♦వాలువాఁడు

తే. ఇంబుమీఱినమణికిరీ♦టంబువాఁడు
కంబుజిగిబిగినవ్వుకం♦ఠంబువాఁడు
డంబువెలసినవిపులవ♦క్షంబువాఁడు
చూడఁజూడఁగఁ దోఁచె నా♦చూపఱులకు. ౮౫

వ. ఇట్లొక దివ్యపురుషుండు దోఁచి యజునిం జూచి ౮౬

కం. ఏను బ్రియంవదుఁ డనియెడి, గానకళానిపుణుఁడైన ♦ గంధర్వుండం
గాన కెద మీఁదుమిక్కిలి, మానీంద్రు మతంగుఁ జెనక ♦ మానసనికిమకన్. ౮౭

కం. ఆయన చుఱచుఱ నను నొ,రా యనుచును జూచి మదిని ♦ రాఁజఁగఁ గోపం
బోయన మత్తుఁడవై యిటు, సేయుట నేనుంగురూపుఁ ♦ జేకొను మనియెన్. ౮౮

ఉ. తిట్టిన బిట్టుకోపమునఁ ♦ దెల్వి వహించి స్మయాంధకారముం
దొట్టినయట్టికన్నులకుఁ ♦ దోరపుబీతు వెలుంగుఁ జూపె నా
కట్టిఁడిసేఁత నిట్టు లొడి♦గట్టితిఁ జెట్ట నటంచు నన్ను లోఁ
బట్టుగఁ దిట్టుకొంచు ముని♦వర్యునిపాదయుగంబు వట్టుచున్. ౮౯

కం. కొడుకులు దొడిఁబడి చేసిన, దుడుకులకుం దండ్రు లిట్లు ♦ దుటుకునఁ జంపం
గడఁగుట కటకట కాదే, కడగంటను నెనరు చిలుకఁ ♦ గనుమా! తండ్రీ. ౫౦

తే. ఆచరించితి నీకు మ♦హాపరాధ
మైన దయఁజూడుమా నన్ను ♦ మౌనివర్య!
తండ్రి తనవక్షమును గాలఁ ♦ దన్ను శిశువు
ముద్దులాడునో నేలపై ♦ మోఁది చనునో? ౫౧

కం. దరమున వేఁడఁగ నిటు లా, దరమునఁ గని యనియెఁ గొన్ని ♦ తెరముల మీఁదం
దరము సనరానియజుఁ డీ, దరిఁ దఱియ స్వచ్ఛ నట్టి ♦ తతి నీవు వెసన్. ౫౨

కం. అరవాయి గొనక నీ వా, తరవాయిని దాఁకుమా! బె♦దర వాయిని నిన్
దరవారిఁ ద్రుంచు నాతఁడు, సరివాయును నంత ఘోర♦శాపం బనుటన్. ౫౩

వ. నిన్న యోధ్యాధీశ్వరుం డగురఘువుతనూజు నజుంగా నెఱుఁగుదు, నాదు చిన్న
విన్నపం బొండు కలదు వినుతు వినుము ౫౪

కం. ఉపకారికి నుపకార మ, చపలమతిం జేయవలయు ♦ శక్తుఁడు గాఁడే
నుపకృతినిఁ దగదు మఱవఁగ, శ్వపచుఁడుగద మేలుమఱచు♦జడమతి యధిపా.

ఉ. రక్తిమెయి న్వచించెద ధ♦రాధవనందన! విన్ము నాయథా
శక్తి, భవత్కృతంబునకు ♦ సాటిగ నే నొనరింప నేర, నా
సక్తిని నస్త్రరాజ మిది ♦ సంగరరంగమునన్ జయంబు సు
వ్యక్తముగా నొసంగునది ♦ యాదృతి నిచ్చెద వే గ్రహింపుమీ. ౫౬

కం. సమ్మోహన మనఁబడు నిది, సుమ్మీ మోహనంబుసేయు ♦ నూడులతుటుముల్
గ్రమ్మిన నాహవమునఁ; గై, కొమ్మా కొమ్మను గొనంగఁ ♦ గొమ రగు నీకున్.

వ. అని సమ్మోహనాస్త్రంబుఁ బ్రయోగోపసంహారక్రమంబులతోడ సకీలకసమంత్రి
కంబుగ నొసంగి చనుటయు ౫౮

కం. అటు విక్రమంబు వెలుఁగం, బటుతరసంరంభ మొనర ♦ మార్తాండకులుం
డట వడిఁ జనిచని కనె నా, దటఁ గ్రథకైశికపురంబు ♦ దర్పోజ్జ్వలుఁడై. ౫౯

కం. దుర్భరశాత్రవభీప్రద, నిర్భరలక్ష్మీనివాస♦నిస్తులితమణీ
గర్భామణికుండలసం, దర్భరుచిం జెలఁగు నావి♦దర్భం జొచ్చెన్. ౬౦

వ. అప్పు డప్పురంబున ౬౧

## ఇందుమతీస్వయంవరమహోత్సవము.

సీ. ఘోటకవరనిరా♦ఘాటకర్కశఖుర, స్ఫోటితపాంసులా♦స్తోకరజము
సారసామజసువి♦స్తారసాగరమదా, సారసారస్యవి♦శాలపథము

స్యందనవేగసు♦స్పందితభూస్థలీ,స్రంసితతారకా♦సంచయంబు
భటకదంబకసము♦ద్భటకహాకహామహో,ర్భటబధిరితదిశా♦భద్రగజము

తే. లోకనేహాసమాగతా♦స్తోకలోక,లోకసురభీకృతానిలా♦టీకనంబు
మారుధాటీకనల్లక్ష్య♦మహిమఁజూపెఁ, బరమహర్షదమై స్వయం♦వరమహంబు

కం. ఇందుమతి స్వయంవరమునఁ, బొందుమతి నూర్మిఁగియున్న♦భూపుల డాక
న్నందును స్పందనమును మది,యందు నిరాశతయుఁ గలిగె ♦ నజునిం జూడన్ ౬౩

సీ. ఏయూరు వీని దీ♦యెడ కేల యేతెంచె, నంచుఁ బలికె నొక్క♦యవనిధవుఁడు
ఈక్రందునను నిల్వ ♦ నెవ్వరివశము నేఁ, జనియెద ననె నొక్క♦జనవిభుండు
నాదుసీమాటి కీ♦నాతి సాటియె చూడ, వచ్చితిఁ గాకంచుఁ ♦ బలికె నొకఁడు
నా దేశ మామంత్రి♦యాదేశమున నున్న, దేగఁగావలె నంచు ♦ సాగె నొకఁడు

తే. భోజుఁ డీమూాల నాబోఁటి♦రాజమణికిఁ, జూపెననికింక వేంచేసె♦భూపుఁ డొక్కఁ
డజునిఁజూచినమాత్రభూ♦భుజులలోన,నిందుమతిఁబొందునడియాస♦డిందుపడుట.

సీ. ఓరమీాసంబు నో♦య్యారంబు మీాఱంగ,నులివెట్టి నులివెట్టి ♦ నులిచె నొకఁడు
కలుగనియావలిం♦తలఁ దెచ్చికొంచును, వక్షంబు విఱిచె భూ♦పతి యొకండు
సరిగచేలలు మణి♦సరిగలు మెఱయించి, తనభాగ్యమును జూపె ♦ ధని యొకండు
వంకరుమాలు ప♦ల్వొంకంబుగాఁ జుట్టి, చుంగులు దిద్దె రా♦చూలి యొకఁడు

ఆ. వాతర ట్టటంద్రు ♦ పలికినఁ జెలిఁగొని, వారఁబట్టి శత్రు♦బలపయోధి
వీఁడ చూడ నేఁడ ♦ వీడు చేరుదు నంచు, బిరుదు లాడు నొక్క♦బిరుదులాఁడు.

వ. ఇట్లు హాటకమయంబులై వాటంబు లగు తెఱనోటి మొకంబులపీఁటలనీటు మెఱయఁ బోటుమగ లగునృపాలురకోటులు బిరుదుమాటల గాటంబుగా వాలుమగంటిమిఁ జాటుచుఁ బలుపోకలఁ బోవుచున్న సమయంబునఁ దొయ్యాలుల గుసగుసలు,కొండికల నసనసలు, నధికారి విసవిసలు, జవ్వనుల పకపకలు, గోచెలుల వికవికలు, భూపతుల చకచకలు, నర్తకుల తైతకలు, దుర్బలుల తికమికలు, దివ్వటుల మకమకలు, క్రొన్నగల నిగనిగలు, కస్తూరి ఘుగఘుగలు, మగరాల ధగధగలు, భారకుల సొటసొటలు, కృశులయెదఁ దటతటలు, తప్పెటల పటపటలు, పెందుడుము పెటపెటలు,తామసుల మటమటలు, సందడిని గిటకిటలు,తాలుముల గిటగిటలు, శకటముల దడదడలు, తలయార్ల గడబడలు, తరవార్ల తళతళలు, నందియల ఝుళఝుళలు, వాసనల ఘుమఘుమలు, మద్దియల ధిముధిములు, డామికల ఢమఢమలు, జ్వాలతల ఠమఠమలు, డిండిమము ధణధణలు, ఘంటికల ఘణఘణలు, ఝల్లరుల ఝణఝణలు, తాళముల ఖణఖణలు, రోదోంతరాళంబు నిండుటయు భోజుండు తగినపరివారంబు నయ్యెప్రదేశంబుల నిలువఁబనిచి కలకలంబు వారింపఁ జేసె నయ్యవసరంబున. ౬౬

సీ. భూకాంతహృదయాత్మ♦భూకాంతముఁ గరంచు, నిండైనశశికాంత♦బింబ మనఁగ
రాజరాజులమనో♦రాజి రాఁజఁగఁ జేయు, నోజరాజిలు నూరు♦తేజ మనఁగ
శారకభూపకు♦మారకమానస,దారణస్మరతర♦వారి యనఁగ
నతనుగ్రహావిష్ట♦సుతనురాట్సుతులకు, మారుస్వస్థావేశ♦మంత్ర మనఁగఁ
తే. జూపఱుల కనిమిషసిద్ధి ♦ చూఱవెట్టి, ధ్యాతలు ప్రకామమున నుబ్బ♦నప్సరోయు
తేందిరాసుందరి యనంగ♦మందగతుల,నిందుమతివచ్చెఁ బ్రియసఖీ♦బృందయుక్తి. ౧౮

సీ. శింజినీరావంబు♦చెలువార సుకుమార, తను సుకోదండచ♦లనము మీఱఁ
గువవిశిఖాపాత♦జవము రస్యంబుగా, వలమానపైఠ పై♦ధ్వజము గాఁగ
విలసితపరివార♦ములహాళాహాళియేపు, సంభోజపతితోడు ♦ జృంభ మొనరఁ
గరకంకణంబులు ♦ ఘలుఘల్లుమనఁగను, శ్రవణావతంసక♦రవణరవము
తే. దశదిశాక్రాంతముగ మోహ♦తమము నిండ, మానవాధిపమానవి♦లూనపరత
మీఱ శృంగారరసములు♦వెల్లిగొలుపు, మదన మోహినియైతోఁచె♦క్ష్మాపతులకు ౧౯

వ. ఇట్లు చనుదెంచి యా యన్నులమిన్న చెన్నుమీఱఁ దనయన్నకుఁ దిన్నగ మ్రొక్కి యొద్దనున్న నాకన్నియకు నచ్చోమూఁగిన రాజలోకంబున ధరాపతుల వేర్వేఱ నిరూపించి వచింప భోజుండు సునంద యనుచెలికత్తెను నియోగించిన నచ్చెలియు నెచ్చెలియున్న శిబికపజ్జ నడతెంచుచు నాయాభూపతులం జూపుచు ని ట్లనియె.

—ఇందుమతికి సునంద రాజనందనుల నిరూపించి చెప్పుట.—

ఉ. సంగరరంగసంగతవి♦శంకటవైరితురంగతుంగసా
రంగశతాంగముఖ్యచతు♦రంగబలంబులఁ జూపుఁదూపులన్
భంగము నొందఁజేసి నయ♦నప్రవిషంగియశంబుఁ గన్న కా
ళింగుఁ గనుంగొనంగదె లలిం గమనీయమృగేంద్రమధ్యమా. ౨౦

ఉ. మానిని! వీనిశౌర్య మస♦మానము చూ విసుమాన మౌను! క
య్యానను మాఱుకొన్న గజ♦యాన! యనంత మహాపదాస్పదస్థా
నాన దొలంగి వేడఁ గని♦నన్ సదనంతమహాపదాస్పదస్థాఁ
గానివిభుండు; వీని సరి ♦ గాన జగాన జగానయంబునన్. ౨౧

వ. అనినఁ బరిహాసగర్భితదరహాసకలిత యగునవ్వనితం గని ౨౨

చం. అతివ! పరాఙ్ముఖంబున సహాయులతోడుతి ముచ్చటించుచున్
మితిరహితానురక్తి నును♦మీసము దువ్వుచు మాటిమాటికిన్
జతనముమీఱ నిన్నుఁ గను♦సన్నలఁ జూచుచు నున్నవాఁడు సు
వ్రతరతు వీనిఁ జూచితివె ♦ భావభవాభునిఁ జోళభూవిభున్. ౨౩

చం. మదకలగామినీ! యితని ♦ మార్తురమారుతురంగసంఘముల్
మదకలకంఠరావమున ♦ మానుషభాషణముల్ మహాటవీ
పదమున నాత్మజాతికిని ♦ బాఠముఁ జెప్పుచుఁ బాలుచక్కెరల్
పదములు దోఁప బాష్పములఁ ♦ బట్టుగ తెప్పల నప్పళించెడున్. ౨౪
వ. అని యాయమయనవధానం బనంగీకారంబుగఁ గొని యావలఁ జని ౨౫
చం. కవఱలు కేలఁబూని తమ♦కమ్మొ సగమ్మునఁ గ్రమ్మ నీదెసం
గవియు విలోకనంబులను ♦ గ్రమ్మఱుపంగ వలంతిగాక తాఁ
దివురుచుఁ గేలు మూసి ♦ వెనుదీయుచుఁ జూచుచు విచ్చుగొండరా
జవరుఁ గనంగదే వికచ♦సారసపత్రవిశాలలోచనా! ౨౬
ఉ. ఓయమ! పాయసంబె యని ♦ యొయ్యన బాలకుఁ డేడ్వ నంబలిం
బోయస మంచు నిచ్చి పిద♦పం బులకిండముఁ గోర దానిలోఁ
ద్రోయును సైంధవంబు; మఱి ♦ రోదన మూరక చేయ నేతికై
వేయును వేఁడినీరముల ♦ వీనివిరోధినృపాలుకాంతయున్. ౨౭
వ. అని యగ్రాపై దలియనాదరాలోకనం బుపలక్షించి చని ౨౮
చం నిరుపమదివ్యవాసరమ♦ణీమణిసన్మకుటీతలంబుపై
నిరవధిరూపభాసరమ♦ణీ! రమణీయశయద్వయంబు సా
దరముగ నిల్పి దిద్దుచును ♦ దత్పరతన్నినుఁ దేలఁజూచు భూ
వరుఁ గనవమ్మ వైరినర♦పాలవిభాలునిఁ జేదిపాలునిన్. ౨౯
వ. ఈతనిశత్రువులచరిత్రంబు చిత్రంబు ౩౦
కం రణమున నీ శరణం బనఁ ♦ క్షణమునఁ దమకాన భద్ర♦గరిమ వహింతుర్
రణమున నీశరణం బన, క్షణమునఁ దమకాన భద్ర♦గరిమ వహింతున్. ౩౧
వ. అనిన వారెఱు విఱుచుటయు. ౩౨
చం నవలవలీదళాంకురము♦నం దనగోపలగీఱ లోలి నా
ప్ప వనజలోచనుండు ఫణి♦పత్రవిభంగము చేసి నీపయిం
దవులఁగ దృష్టినిల్పి ముగు♦దా! యిడికిం జరగెం సురాష్ట్రభూ
ధవలను చూడవమ్మ పరి♦పూర్ణకువాలయబాంధవాననా! ౩౩
సీ. కోటబోర్తలుపుల ♦ నూటిబ్రద్దలుగొట్టి, గొల్లలగర్వంబుఁ ♦ గొల్లవెట్టి
చేటికావితతుల♦సిగ్గులు చెడఁదిట్టి, నందనవనవాటి♦పొందు మెట్టి
మేటివధూటికా♦కోటిఁ బైపడి పట్టి, ఘోటఘోటీదంతి♦కోటిఁ గట్టి
యంబరయానముల్ ♦ డంబుమీఱఁగ మెట్టి, సురనాథువీటిని ♦ జుట్టుముట్టి

తే. వీనిధాటికి నెదిరిన♦వీరవైరి, కూటములు మాటిమాటికి ♦ దీటుమీఱి
స్వర్గమును జూఱఁగొందు ర♦నర్గళముగ, వీనివీడంచుఁ దలఁతురో♦వెఱ్ఱు లగుచు.

వ. అనిన నున్న రనుకాంతం గని ౮౫

చం. పలువలువ ప్రదాగ్రములఁ ♦ బల్మఱునొక్కుచుఁ గేల లీలగా
నలిన మమర్చి దాని జతి♦నంబునఁ ద్రిప్పుచు సత్యసక్తిపైఁ
దలఁగక వామహస్తమునఁ ♦ దాలము వైచుచు నిన్నుఁ జూచుచుం
గులికెడువీనిఁ గంటె యళి♦కుంతల! కుంతలదేశకాంతుని౯. ౮౬

వ. అనిన మందగమనా యేమివిప్రలాపించెద వనుడు ౮౭

ఉ. మానవలోకపాలు రస♦మానయశస్వులు సద్వయస్కులు౯
దానజనావనావని♦ధానపరాక్రమసంవిధాను ల
బ్జానన! లాటభోటకర♦హాటవరాటవిరాటభూపతుల్
వానిని వాని వాని మఱి ♦ వానిని వానిని గంటె మానినీ! ౮౮

వ. అని యిట్లు క్రమక్రమంబున నందఱఁ జూపుచుఁ దన్ముఖనయనవికారభ్రూచలనా
ధరవిధంబుల నింగితం బెఱింగి చనిచని సునంద యానందకందళితాంతరంగయై
యజునిం జూపి. ౮౯

శా. భూమిం బూజ్యత నొందఁ గోరి యజుఁడే ♦ పుట్టెం దదాభిఖ్యచే
నీమాడ్కిం; జతురాననత్వమును లో♦కేశత్వము౯ దివ్యమా
హైమాంగంబుఁ బ్రజాపతిత్వమును స♦త్యాసక్తియు౯ స్వీకృతి
శ్రీమాహాత్మ్యము రాజసంబును సతీ ♦ చేకూరు నే కాని చో౯ ౯౦

మ. ప్రకటస్ఫూర్తినిమూర్తిగొన్న సుమనా♦రాముండు కంజాక్షి! యీ
యకలంకస్ఫుటనీరజాంబకుఁడు భా♦మా! కాదనం గల్గునే
యొకట౯ సద్ద్విజవల్లభత్వమును బ్ర♦ద్యుమ్నప్రభావంబు నీ
సుకుమారాప్తి మనోహరాకృతియు నె♦చ్చో లోకజిద్భావము౯. ౯౧

సీ. నందనవనమున ♦ మందారముల మోక, చలివెల్గుముత్యాల♦సరులజోక
శారదాకాంతకు ♦ జాబిల్లినును రేక, ముత్త్రోవద్రిమ్మరిఁ ♦ బుండరీక
మలకఱకంపుని ♦ తలమీఁదిమినుకువాఁక, శారదాగమమున ♦ సరసరాక
కామునిజయధాటి♦కావ్యంబునకుఁ డీక, మహిఁ జలిమలను హై♦మానిపీఁక
తే. యాఁక గనరాక నతిరేక♦మైనజోక, డాక నతిలోకమగుదాఁక ♦ వీఁక నిలక
ప్రాకటంబగునితనిసు♦శ్లోక మితఁడు, నీకరుణకును బాత్రుఁ డౌ♦నే కదమ్మ. ౯౨

తే. మేనికొమరునఁ బోలు నా♦మేనుకొమరు
నంబకంబులు మరుప్రథ♦మాంబకములు

నేల రారేరు సరిదూఁగ ♦ నేలరాదె
భోజసహజాత ! జితనవాం♦భోజవదన. ౯౩

వ. అని యావలఁ జనుదాననే యనవుడు. ౯౪

### ఇందుమతి యజుని వరించుట.

క. విని సకిఁ జూచుచుఁ జూచుచు, మనమునఁ దమియూర నిందు♦మతి యతికాంక్షం
గనులారఁ గనుఁగొనియెను, నినవంశాభరణు రాజ♦హీరాభరణున్. ౯౫

క. శ్రీకువలాప్తవదనఁ గనఁ, గోకనదవిశాలనయన♦కుముదము లలరెన్
వీఁక చెడి పరనృపాలక, లోకనసత్కోకనదము♦లు మ్ముకుళించెన్. ౯౬

క. హీరాసుతునిం బోలెడి, యారాసుతునిం గనంగ ♦ ననిమిషనయనన్
సారాంగన యని తలఁతురు, సూరెలఁ గనుఁగొనుచునున్న ♦ సూరుల్ శూరుల్.

చం. ఇరుగడఁ జేరి చామరల ♦ హెగ్గడిగత్తెలు వీచుచుండియుం
గరివరగామనీకుచయు♦గంబులఁ గుంకుమపత్రభంగముల్
కరఁగి ప్రభిన్నచోళబిల♦కాపథవర్తన నిర్గమించె నాం
తరకరుణారసంబు జత♦నంబునఁ దా నెలిఁబొంగెనో యనన్. ౯౮

క. ఇందుమతి క్షితిని నిక్కపు,టిందుశిలాప్రతిమయేమొ ♦ యిటులొటఁ గదా
పొందుగఁ గరఁగెడిని దనూ,స్యందిజలమిషమున రాజ♦చంద్రునిఁ జూడన్. ౯౯

క. హరిణీలోచన యనుగత,తరుణీమణి యగుచు మత్త♦దంతివిధమునన్
వరణీయతరణికులమణి,ధరణీభరణోపకంఠ♦ధరణీసరణిన్. ౧౦౦

వ. ఇట్లు లోకుందరదన ముకుందకరారవింద గ్రహణానందంబునఁ బాలసంద్రంబు వెడలి నడతెంచు బృందారకబృందవంద్యమా నేందిరాసుందరి చందంబునఁ జతురంతయానంబు వెలువడి మందమందయానంబున సూడిగంబులు దక్కఁగలవాఁడిమగలనూడిగంబులకుం బిలుచు తెఱఁగున మొరయఁ, గ్రొక్కారు మెఱుంగు తెఱంగునఁ దుఱంగలించు నొడలిడాలు నృపాలురకనులచాలు డీలుపడ నిరులఁ గప్ప, నంబరంబుడంబున విడంబించునడుమంతరంబు సురాకర ధరాధరత్రిపాకర పయోధర భారంబున జవజవలాడఁ, జూపఱులచూపు నెలమేపరులకు మేపొసంగు రంగుచెంగలించుచీరచెఱంగు బంగారుసింగారంబు పొంగారుబ్బునవకంపుటంగంబు సోఁకున సాలిత్రావాలులీలఁదూలాడ, రాకాశశాంక కళంకాంకురశంక సంకల్పింపం జాలు తిలకంబలికంబునఁ బుండరీక నిష్యందమకరందబిందుసందోహ గ్రసనదోహలతుందిల మత్తహింటోళంబు చందంబుననందంబుమీఱ మరుచికటారిబటారింబుఁ దటారించు బటారంపుమిటారింపుగల మిటారికొప్పుఁజూపులు తూపులువోలె

భూపులయేపులు రూపులుమాప, మవ్వంపుఁ బెంపుసొంపున నింపగు మొగంబు జిలిబి లివంపున నెయ్యంబు దలంపక కికురించెననితలంచి తపించుసంచున జంపాడు జిలిబి లిజల్లి యెల్లవారి యుల్లంబులఁ బల్లవింపఁ జేయ ముంగై మురారిరంగైనతాల ముంగై మురారులు బరాబరులువచించుపోలికరవళింప, నీలవేణికాజీవనరాజీవంబుల పై మిట్టిపడు రాజీవంబులరీవి నానీల వేణీ వేణికాభారఖచిత కుసుమవిసరంబులపై మగతాలసూసకంబులడాలు జాలువాఱ, వర్షాగమావసానంబున నింకంబాఱునే ఱులఁ బరిదృశ్యమానంబు లగు పులినతలంబులపై నందందలంఘించు జలవిహంగ మంబులయంగున నితంబబింబంబులపై జడకుచ్చులు కుప్పిగంతు లిడ నిజవివాహం బుద్ఘోషించువడువున నందెలు ఘలుఘల్లు రనఁ జనుదెంచి కరారవిందంబునఁజెలు వొందుదామం బుద్దామహర్షంబున నతనికంఠలగ్నంబుఁ జేసి వరించుటయు. ౧౦౧

కం. నింగియు నేలయు నిండఁగ, మంగళవాద్యంబులెల్ల ♦ మఱిమఱి మ్రోసెన్
బొంగెడుజలనిధి యన ను, ప్పొంగఁగఁ దనలోన మిగుల ♦ భోజనృపతియున్. ౧౦౨

కం. మనసారసనయనయు నైఁ, మనసార వరించి మించె ♦ మాఱుటమరు నం
గనలార వధూవరులం, గనులారఁ గనుం డటంచుఁ ♦ గాంతలు దమలోన్. ౧౦౩

వ. హర్షోత్కర్షంబున వెలయ వేల్పులు పూలవానఁ గురియించి రంత. ౧౦౪

తే. అజునిఁ జూచిన వెనుక న♦య్యమరసతుల
కాత్మపతులను గనఁగ బ♦య్యంక లోద వె
రాజుఁ జూచినకంటను ♦ రమణుఁ జూడ
మొట్ట మతియయ్యె నానుడి ♦ దిట్ట పడఁగ. ౧౦౫

కం. తనకేడ్పి యొక్కకన్నును, ఘనఁపెగుపరునకుఁగ నొక్క♦కన్నెగ నన్
జననాథులు తిమపరిభవ,ము నజుని పెం పిబ్బడించు♦పొక్కసఁగంగన్. ౧౦౬

కం. ఇచ్చోఁ గచ్చుకుఁ జొచ్చిన, వచ్చును భోజుండు తోడు ♦ బావకుఁ గానన్
గ్రచ్చుఱఁ బురికి స్న చ్చిక, విచ్చేసెడిచోటఁ దాఁక ♦ వెర నగు ననుచున్. ౧౦౭

చం. కుటిలమనస్కులై నృపతి♦కుంజరు లొక్కట నొక్కమాటగాఁ
జటులపరూఢినీపటు♦సంగతి భంగ మ దంతరంగమున్
బెటులఁగ వేఁప నిల్చిరి ద♦విష్ఠపనాంతరసంప్రతిష్ఠులై;
స్ఫుటము భవిష్యదర్థముల ♦ సూచనలున్ మునుమున్న కల్గెడిన్. ౧౦౮

కం. ఆవాలుమగం డచ్చో, వైవాహికవిధులు జరుగఁ♦బదపడి పురికిం
దా వెడలెఁ బడఁతిఁగూడుచు, బావయుఁ దనకచ్చుహారణ♦వారముఁగొనుచున్.

**అజుఁడు శత్రుసేనలఁ బాఱఁ దోలుట.**

ఉ. అంగనఁ గూడి భూరిచతు♦రంగబలంబులతో నయోధ్యకున్
రంగుగఁ బోవఁ జేవ యడ♦రంగ శతాంగతురంగతుంగసా
రంగపదాతిసంగ మొల♦యంగఁ గలంబకదంబహస్తులై
పొంగి కళింగవంగనృప♦పుంగవు లాత్మబలానుషంగులై. ౧౧౦

కం. తాఁకినఁ దోఁకంద్రొక్కిన, వే కినుకను రేఁగుత్రాఁచు♦విధమున నజుఁడున్
వీఁకను బలువీఁకన వెఱ, తాఁకునను వితాకు గొనఁగఁ♦దలఁచఁగ వైచెన్. ౧౧౧

కం. అమ్ములఁ గాయమ్ములు గా,యమ్ములుగా వీరభటచ♦యమ్ములు వెసనా
యమ్ములు విఱిగిన నాతి,ధ్యమ్ములు గొన యమునియాల♦యమ్మున కరిగెన్.

క. ఇనవంశ్యుఁడు రణమండలి, నినమండలమెల్లఁ గప్ప ♦ నేయ శరము లా
యినమండలమున గండియు, ఘనమయి యంతంతకమరెఁ ♦ గనఁజోద్యంబై.

సీ. అరిచమూబహుసమూ♦హధవాసువాయువుల్, గ్రోలు నా జిహ్మగ♦జాలకంబు
మదనాగములు వేగ♦మహిఁ బటాపంచలు, గా నాగగంగములు ♦ కదిసిపఱచు
నభియాతివిభువాజి♦సభయాతిరేకమై, కనఁ గండలు పగల్చు ♦ ఖగచయంబు
నుతగంధపరిపంథి ♦ ధృతికందమూలముల్, పెకలించు విశిఖాళి ♦ భీకరముగ

తే. నారసంబులు నీరసం♦బౌగ సంబ
రమునఁ దాముగఁ బైవచ్చు ♦ క్రమము దోఁచెఁ
గాండసంధానసంప్రయో♦గక్రమంబు
లేర్పడకయుండ వైచునా♦నేర్పుమహిమ. ౧౧౪

మ. తతసారంబుప్రవాలముంగను ధను♦ర్దండంబు, జ్యావల్లి స
న్నుతతంత్రీవిధమై, పృషత్కములు చెన్నొంగాంచఁ గోణంబులై,
ధుతమౌర్వీనినదంబు ప్రక్వణనమై♦దోఁపంగ భూపాలుఁ డా
శ్రుతి యానారదువీణతోఁ గలుపఁజూ♦చున్ మాని యాడన్ దివిన్. ౧౧౫

మ. కను లాబాలిక మోమున న్నిలిపి పల్కన్ సాగె భూమీశుఁడున్
గొనమున్ బాణముఁ గూర్చు టేసెడు తెఱంగుల్ గానఁగా రావుగా
దొనలు న్వ్రాల్తియుఁ గావు తత్తగములే♦తున్మాడఁ బ్రాణాప్తిమైఁ
జనుదేనోపు నటంచు నెంచెను ద్విష♦త్సైన్యంబు దైన్యంబునన్. ౧౧౬

చం. తలఁచినయంతమాత్రమునఁ ♦ దద్దయు నామొగమాను, ముల్కులుఁ
జ్వలదసమాస్త్రము ల్విపుల♦సారములున్ మఱి సార్ద్రమంబులుం
గల వారో వీనివింటికినిఁ ♦ గన్ను లటంచుఁ దలంచె లేమయుం
గల వారో వీనివింటికినిఁ ♦ గన్ను లటంచుఁ దలంచె వైరియున్. ౧౧౭

కం. క్రందనము వీడి భటు లా,క్రందనమును జేయసాగ ♦ క్ష్మాభృత్తులు సం
క్రందనవిక్రమఁ దాఁకిరి, క్రందుగ నహహాహుహూకావి♦రావము వెలయన్. ౧౧౯

కం. మూఁతలు వడఁ గన్నులు జీ,మూతముపై నిట్టంముగ ♦ ముసరెడి బలుజీ
మూతములనఁగను బౌరుష, మూఁతలుగాఁ గొనుచుఁ గురుసి ♦ రుగ్రశరంబుల్.

కం వారించుచు వానిని దెగ. సారించుచు శరచయముఁ బ్ర♦సారించుచు వే
కారించుచుఁ బరనృపతులఁ బూరించుచు సంకు దెసలు ♦ పూరటిలంగన్. ౧౨౦

కం. తలపడు వైరిని వ్రేయును, దల పడ ధారిణిని; నేయఁ ♦ దలఁపఁడు కొం
దలపడు నంబేదల; బా,ధలుపడువారికిని వగచు ♦ దయదైవాఱన్. ౧౨౧

తే. గుణముఁ గూర్చిన సురులును♦గుణముఁ గూర్చ
నడుమఁగై పూనఁ గై పూని♦నడుమునందు
సరముఁ బూనినఁ దారును ♦ సరముఁ బూని
విభుఁడు వైచినవానినే ♦ వ్రేసి రపుడు. ౧౨౨

కం. దిటచెడక వైరిఖగములఁ, బటుశరములఁ ద్రుంచివైచి ♦ ప్రబలుం డనిలం
పట యేల తేరకనుచును, దటుకున సమ్మోహనంబుఁ ♦ దగి సంధించెన్. ౧౨౩

కం. తెగ నిండఁ దీసి వైచినఁ, బగతురు మానంబుతోడఁ ♦ బ్రజ్ఞయుఁ దూలం
దెగఁగోసి చేల వైచినఁ, దగుచొప్పవిధానఁ బడిరి♦ధాత్రీస్థలిపై. ౧౨౪

వ. ఇట్లు దైన్యంబు నొంది కొంతవడికిఁ దెలిసి యరిసైన్యంబు పలాయమానప్రము
ఖంబగుటయు నజుండు ౧౨౫

కం. తనసీమఁ జేరఁ జనియెఁ గ, దనసీమను గెల్పుగొనుచుఁ ♦ దడయక నొడివెం
దన సేమ మరయుతండ్రికిఁ, దనసామజవధము మొదలు ♦ తక్కు-చరితముల్ ౧౨౬

వ. పదంపడి యజుండు పితృదత్తంబైన రాజ్యభారంబు వహించి యిందుమతీద్వితీయుం
డై ద్వితీయపురుషార్థంబునార్థంబు సేయుచు నతులగతులఁ గాలోచితంబుగాఁ బ్రొ
ద్దులు పుచ్చుచుండ నిందుమతియునాపన్నసత్త్వయైదశరథుండనుకుమారుంగనియె
నతండును దినదినప్రవర్ధమానుండై యేకాదశవర్షంబునం దుపనీతుండై యౌవన
పదంబునం బదంబిడుచు నుండె నంత నొక్కనాఁ డజుం డిందుమతిం గూడి యా
రామసీమ నిచ్ఛావిహారంబు సలిపి శ్రమం బపనయింప. ౧౨౭

కం. సారప్రసేవకల్పిత, సారసకహ్లారరక్త ♦ సంధ్యకగంధో
దారాస్తరణంబునఁ బా,టీరతుషారితలతాకు♦టీరము బయలన్. ౧౨౮

కం. చదరంగ మాడె నవలా, చదు రంగము పొంగఁ జేయ ♦ సరసోక్తులఁ దోఁ
పదు రంగమున నడుప నొ,జఁ దురంగము నంటు బంటు♦జర పెడిచోటన్. ౧౨౯

కం. బోటీ! తొలిమూఁడడుగుల, గోట ఘటించితి నటన్న ♦ గోఁచల కగునా
కేటికిఁగోట యటంచును, గోట బిగిం జెఱుచు మంత్రి♦గుఱ్ఱంబులతోన్. ౧౩౦

కం. అష్టాపదమయ మగునా, యష్టాపదమందుఁ జొచ్చి♦నవి చొరక చతు
షష్టిగృహంబుల వాజియు, థేష్టముగాఁ గ్రుమ్మరు నవి♦సృష్టగృహంబై. ౧౩౦

చం. సురదురుకీర్తిశోభితుఁడు ♦ సుందరపల్లవకోమలాంగుళీ
వరనఖరాంకురారుణిత♦వారణదంతకృతాంగనాగ్రహీ
తరుచిరవారణంబుఁ గని ♦ తన్విరో! జేగుఱుఁగాయ నా దటం
చరయఁగలేక మోహపడి ♦ యాడి ముదంబున నాడుచుండఁగన్. ౧౩౨

కం. తెఱగంటి తెఱవ లిచ్చిన, తెఱకొనుమందారమాల♦తేజున మహతిం
గొఱలఁగ వేగము వఱలఁగఁ, దెఱగన్నులతపసి మింటి♦తెరువునఁ బోవన్. ౧౩౩

కం. పవిపోలిక సుమమాలిక, జనరాలికుచాద్రిసీమ ♦ జనమునఁ బడియెన్
సవు రాఱఁగ మితిదీఱఁగ,ను విరాలిఁ గనంగ జేఁ డ♦నూనప్రేమన్. ౧౩౪

ప్రహరణకలితావృత్తము.

పరిమళదళినీ ♦ భ్రమరచయమనో,హరసురసుమనః♦ప్రహరణకలితన్
దరుణిని ధరణీ♦తలగతఁ గనియెన్, ధరణిపుఁ డిలపైఁ ♦ దటుకునఁ బడియెన్. ౧౩౫

వ. ఇట్లు మూర్ఛిల్లి కొంతవడికి లేచి కాలధర్మంబునొందిన నిజసహధర్మచారిణిం గని పట్టరానిశోకంబున. ౧౩౬

ఇందుమతీ మృతికై యజుఁడు పలవించుట

ఉ. తీయనిమాన మేల సుద♦తీ? యని, తీయనివిల్లుమత్తదం
తీ! యని, నన్ను నేల వలఁ♦తీ! యని, సొంపులునింపుజాబిబం
తీ! యని, సద్గుణాళివస♦తీ! యని, సుందరతావిభూతిదాం
తీ! యని, నన్నుఁ జూడు సుమ♦తీ! యని, హా యని పల్లటిల్లుచున్. ౧౩౭

ఉ. హా! రమణీయనిష్కుటవి♦హారమునాసను వచ్చి నేను నీ
హారమయూఖవక్త్రియు న♦హా రసుమాళులమై రహింప నీ
హారము గర్కశం బగు ప్ర♦హారమునన్ సతి నిచ్చె మిత్తి కా
హారముగాఁ గ్రియాసముభి♦హారముగాఁ బలవింప నే నిటన్. ౧౩౮

చం. అల విరు లంట బాణము, ల♦నంగుఁడు జో దఁట, పాంథకోటులం
బొలియఁగఁ జేయు నంట, మదిఁ ♦ బుట్టుఁ దలంచిన నంట, యీమతం
బిలపయి మోహహేతు వని ♦ యిచ్చఁ దలంచితి నాస్తికుండనై
చెలి! నినుఁ గూడి దాని కిటు ♦ చేసెనొ మారుఁడు నేఁడు శాస్తిగన్. ౧౩౯

తే. నాస్తికుల నెల్ల నిటుపట్టి♦శాస్తి సేయు, విదితశక్తియుఁ గలిగిన ♦ వేల్పు లందు
దైవభక్తియుజనములఁ♦దలఁగఁగలదె, కాన మారుండె దైవంబు♦గాఁ దలంతు.

చం మరుశరవార మంచు నను♦మాత్రము గౌరవ ముంచి మారసం
గరసమయంబునం దలఁపఁ♦గానక పైపడి గూఁపు మాపుటన్
సరసిజగంధి! మృత్యు వయి ♦ చాలె వధింపఁగ; రిత్తవోవునే
వరరణశూరశస్త్ర మను♦వాక్కు; విషోద్భవముల్ ప్రసూనముల్. ౧౪౧

మ. భసలీనీలశిరోజపాశ! కమల♦వ్యాహార మాతమ్మికిఁ
ట్లసికి న్నామము గానఁ దత్కలితశ♦య్యాసౌఖ్యముల్ సౌఖ్యమే?
యిసుమంతేఁ దరుణీ సహాయతయు లే♦దే మర్మనిర్ధ్వంసియౌ
నసిధారావ్రతచర్యఁ గండభవుఁ డే♦లా చూపె సంసారికిన్. ౧౪౨

ఉ. ఏటికిఁ బూజ్యరాజ్యము లిఁ ♦ కేటికి వారణవాజిరాజి యిం
కేటికి సుందరీమణు లీఁ ♦ కేటికిఁ జందనపుష్పహారముల్
ఏటికి మంజులోపవన ♦ మేటికి నిస్తులభోగతృష్ణ యిం
కేటికి జీవితం బిల న♦దృష్ట విహీనుఁడ నైననాకునన్. ౧౪౩

వ. అని పలవించుచున్న సమయంబున నారదుం డాకాశంబున నుండి యవతరించి తత్ప్రకారం బెఱింగించి దుఃఖోపశమనవాక్యంబులు వచించుటయు నతండు నిజదారమరణకారణభూతుండు నమ్మునిపుఙ్గవుండకా నెఱింగి యతనిం గూర్చి రోషంబున ని ట్లనియె. ౧౪౪

*అజుఁడు నారదునిఁ దూలనాడుట.*

తే. పేరు మాత్రంబె ధర నిరా♦బారి వనుచు, హారినిస్తులగంధసం♦భారకుసుమ
హారములఁ గామినీజన♦మారకుఁ డగు, మారుఁడా నీవు దలపో♦య నారదుండ.

చం. పలపల తెల్ల వాఱ ముకు♦బంటిజలంబులలో మునుంగుటో
మలయక ముక్కుఁ బట్టుకొని ♦ మ్రాఁగను గాఁ బెదవు ల్గదల్చుటో
వలకయి మాలఁ ద్రిప్పుటో ధ్రు♦వంబుగఁ గానల నుండుటో హరీ!
చెలువలఁ జంపు టేఘనత ♦ చెప్పవె మౌనికి మౌనిసత్తమా ౧౪౬

తే. పూజఁ గాంచరొ గుసులు వ♦పువులఁ బువులఁ
బరఁగఁ దాల్పరొ మౌని కే♦సరులు సరులఁ
దలఁగఁ ద్రోయరొ యిల గిరి♦దరులఁ దరులఁ
జంపఁ దలఁతురె సుగుణవ♦సతుల సతుల? ౧౪౭

శా. లేరో మౌనులు మీఱరో సురవనీ♦లీలావిహారక్రియం
గారో హారసమర్పితాంగులుగ నా♦కౌకోంగనాపాళిచే
నీరో యాశ్రితకోటి కయ్యువిము మౌ♦నీ! నిర్దయస్వాంతులై
యేరీ నీవలెఁ గామినీవధము నెం♦దేఁ జేయువాచంయముల్. ౧౪౮

కం. వాచంయములను మేటివ, తోఁచెన్ యముఁడవయి సతిని ♦ ద్రుంచుట సర మే
నీ చేపాశముగా; నసుఁ, దాఁచుమయా దండమునను ♦ దల వగులంగన్. ౧౪౯

కం. బాఁపనయ్యవు గావునఁ♦బాపనయ్యో, సతిఁబతిని నింకనైన నా♦హితముగోరి
కోమలినిఁగూడ నన్వేగ♦కూర్పవయ్య, పరమదయమీఱు కడఁకనో♦బ్రహ్మకొడుక.

శా. స్నానంబో, జపమో, తపంబో, మఱి సం♦ధ్యావందనంబో, కడున్
మౌనంబో, నిజదేవతార్చనమొ, స♦మ్యగ్విష్ణుపూజాదులో
ధ్యానంబో, హితసత్యభాషణమొ, స్వా♦ధ్యాయంబొ హా! చెల్లఁబో
స్త్రీనిర్వాపణ మేమహామహుఁడు శా♦స్త్రీయంబుఁ జేసె న్మునీ. ౧౫౧

కం. పుట్టితివి ధాతకడుపున, నెట్టితివి విరోధితతుల ♦ నిట్టలముగఁ జే
పట్టితి హరిభక్తిని నొడి, గట్టితి వెట్లో సతీజి♦ఘాంస న్నిపుడున్. ౧౫౨

తే. తతరవవ్యాప్తి దెసల వి♦దితముగాఁగఁ, గలితవీణాప్రసంగతిఁ♦గానఁబడుట
నారదాభిఖ్యఁ గనుటవి♦హారకేళిఁ బ్రాఁశిరణక్రియాయుక్తిఁ ♦ బగఁగితొ కద. ౧౫౩

కం. అని శోకావేశంబున, మునివర్యునిఁ బాలనాఁడె ♦ మోమోడక యో
ఘనవిషయబద్ధచిత్తుల, కును దాఁకుంగప్పు దెలిసి♦కొనుమతి యున్నే. ౧౫౪

కం. తను దూఱుచు మఱిమఱిధా, తను దూఱుచు వానికిదియుఁ ♦ దగునా యనుచున్
దను దూఱుచు నిలఁ బగిదశ, తను గూరుచుఁ బల్లటిల్లు♦ధరణీశునితోన్. ౧౫౫

—నారదుఁడజునకు దుఃఖోపశమనంబు సేయుట.—

మ. తగునయ్యా! నినుబోఁటిధీరుఁ డిటు మి♦థ్యారూపకంబైనయీ
తగులంబే దృఢమంచు దుఃఖవివశ♦తస్వాంతుఁడై కుందఁగా
మిగులన్ స్వాప్నికదుగ్ధపాన మగుఁ జు♦మ్మీ దీనికై యింతగన్
వగనం బుణ్యమొ పూరుషార్థమొ మదిన్ ♦ భావజ్ఞ భావింపుమా. ౧౫౬

కం. సంతానాంతముగాదే, కాంతాసంగమము? పిదపఁ ♦ గామించుట దు
ష్కాంతవ మరంతచింతా, క్రాంతస్వాంతులకుఁ దగును ♦ గా దితరులకున్. ౧౫౭

చం. కలుగరొ భూమిపై సతులు♦కాంతులు? కాంతవకేళిఁ గూడరో?
పొలియరొ? బూదిలోఁ గలసి♦పోవరొ భూపతు? లెందఱేనిభో
గులు వ్యసనంబుపట్ల ధృతి♦గూడరొ? కూడరొ యోగచర్య? నీ
వలె నిటు తీవ్రదుఃఖముల♦పాలయి దూఱరు గాక యన్యులన్. ౧౫౮

ఉ. అంతమునొందనట్టిది ప♦దార్థమొకండు పిపీలికాది ధా
త్రంతచరాచరంబుల ధ♦రాధిప గల్గునె? పుట్ట గిట్టుటల్
వింతలె? దేహ మెందుఁ బ్రభ♦వించెనొ యచ్చటికేగ కుండు నే?
యింతదలంప వేని వృథ♦యేకద తావకశాస్త్రపాండితుల్. ౧౫౯

చం. ప్రకటభుజాబలాఢ్య సమ♦రక్రమసత్యపరాక్రమప్రభా
శకలకళాధురీణగుణ♦సాహసవిన్ననవద్యయాంతకీ
పకలితరాజ్యయుక్తులుఁ భ♦వత్పితలెల్లరుఁ బోయి రింక నీ
వొకఁడవె నిత్యజీవి వయి♦యొప్పెడుభంగులు దోఁచె నీయెడన్. ౧౬౦

కం. ఏలవె భూముల నెల్లను, దోలవె యరివరుల సతుల♦తో భోగాబ్ధిన్
దేలవె బేలవె ధృతిగోనఁ, జాలవె నీ వింక నయిన♦సంతుష్టిమెయిన్. ౧౬౧

కం. ఈనాతికి వగచెదవో, నేనాఁటికి నైన వలదె♦యేఁగఁగ మఱి మే
లేనాఁటికో సంసారికి, నేనాఁటికొ తెఱుపాటు ♦ లేర్పడఁజెపుమా. ౧౬౨

కం. కావున దుఃఖవివర్జిత, పావనమేధా విశుద్ధ♦పథవర్తనమున్
భావన సేయుము ధృతి సం, భావన సేయుము తొలంగు ♦ భవదుఃఖంబుల్. ౧౬౩

కం. తనయుని దుఃఖము నిరతము, జననీదుఃఖంబు నొక్క♦సమ, యార్నెలా
జనకునిదుఃఖము, సంస్థిత,వనితావ్యథ వేఱుభార్య♦వచ్చినఁ దీఱున్. ౧౬౪

కం. ధృతి దఱుఁగఁగ దుఃఖావిల, మతిచేఁ బలవించుచున్న♦మానుషపశువుల్
మతిమంతులు గని నగరే, సతికేడ్చెదు నీదు బ్రదుకు♦శాశ్వత మొకో. ౧౬౫

ఉ. కాన లతాంగిఁ గూర్చి తపః♦కానలతాంతశరార్తి నింట గో
గాన లయంబు నొందకుము♦కానల నీవు సమాధినిష్ఠ యో
గానలదగ్ధుఁడై విధుఖ♦గానలద్యృగ్విధు లొందనట్టిభో
గాన లలిం జరింపుము జ♦గాన లభించును శాశ్వతప్రథల్. ౧౬౬

## నారదుఁ డిందుమతి మృతికిఁ గారణముఁ జెప్పుట.

ఉ. అంతియ గాక వే ఱొక ర♦హస్యముఁ జెప్పెద విన్ము దేవతా
కాంతయ కాని ప్రాకృతపుఁ♦గన్నియ కా దిది, భూమిఁ బుట్టె హే
త్వంతర మొప్ప, నీకు నిటు ♦ లాలయి కాలము దీఱఁ దీఱె, నా
వంతయుఁ జింతనొందఁ దగ♦వా? మగవాఁడవు కావె? యిస్సిరో! ౧౬౭

వ. ఇక్కాంతానికారణకారణంబు విను మని యినునినుమనుమనితో మునిమన్నీఁ
డిట్లనియె ౧౬౮

కం. తృణబిందుం డనురుసి యొకఁ, డణుమాత్రం బైనఁ జలన♦మందనిమతి దా
రుణతపము సలుప హరిహయుఁ, డణఁగని వెఱ దానిఁ జెఱచు♦నాలోచనకై.

వ. హరిణి యనునచ్చరమచ్చెకంటిం జేరి ౧౭౦

కం. వనజదళనేత్ర! నీతోఁ, బనియొక్కటి కలిగి యిటకు ♦ వచ్చితి నమృతా
శనహితముగ నేఁ జెప్పెదు, పని వినియెదో వెతగ నన్నుఁ♦బనివిను మనెదో. ౧౭౧

కం. తృణబిందుఁడు శుష్కం బగు, తృణబృందము లట్ల జగములెల్లఁ ♦ దపోగ్నిన్
క్షణమునఁ గాల్చెడు నీమా, రణకర్మము నాఁపి జగము ♦ రక్షింపఁ గదే. ౧౨౩

వ. అని పంచుటయు వల్లె యని

ఉ. దండిగ శింజినీరవము ♦ తామరసాంబకము ల్మనోజ్ఞకో
దండవిలాసముం జెలఁగఁ ♦ దాల్చి యనాహతవారవాణముల్
మండలభిభ్రమంబుల స♦మావృతసత్కటకాంతికాళియై
యుండగ మొప్ప నేగె మును♦ధూర్జటిపైఁ జనుమన్మథుం డనన్. ౧౨౪

కం. తృణబిందుమునిపరిసరా, వని నటనకళావినోద♦పరతం బరఁగన్
జనితాంభటిం; గన్నులు, ముని విచ్చి సరోషహృదయ♦ముస ని ట్లనియెన్. ౧౨౫

కం. కంఠలగ్రీవోచ్చనఁ దిరిగెదు, విండలకిడ మిటుకులాఁడి ♦ మేలిమి గా కో
యాఁడజగమనా! తపసులు, నంటను నీగుంటగములు♦దగునే చలుపన్. ౧౨౬

ఆ. అమరతావిభూతి♦నెంగాము లెంచక, యాటవెలఁది! విస్మ♦యస్మయముస
యముల ఘనతపోని♦యములను జెనకుదే? భూమిమీఁద మర్త్య♦భామ వగుము.

వ. అని శపించుటయు. ౧౨౭

కం. ఈకరణిసత్యవచన ము, హాకరణిఁ బ్రతప్తచిత్త♦యాగుచుం దద్వా
క్యాకరణియుముఁ గానక, యాకరణియాన దుఃఖ♦హాతిచేష్టిత గాన్. ౧౨౮

కం. మొదలను గవితనయాస్మృతిఁ, బదపడి యయి సరస్వతీప్ర♦వాహముగాఁగన్
దుదఁ ద్రిపథగ నయ్యెను నా, త్రిదశాంగనకనులనీక ♦త్రిదశత్వమునన్. ౧౩౦

చం. జలజలరాలుబాష్పముల ♦ జాలునఁ జన్నులఁ ప్రేలుచేలకాం
చలము తద్దైక్యభావితద♦శంగన గుట్టు బట్టబయల్గ హా!
చలమున మద్విలాసకృతి♦శాఠ్యమటం చవనింద వెట్టె ధృ
చలితుఁడు తిట్టునో యనెడి♦సాధ్వసయుక్తిని మాటుచేసె నా
నలచెలి చస్గవ న్నిజక♦రాంజలిఁ జేర్చి నతాననాబ్జయై. ౧౩౧

ఉ. మారుతఘాతనూతనసు♦మవ్రతతిప్రతిమానదేహయై
బోరునబాష్పవారి జడి ♦ బోరను గాఱుచునుండ మేచకాం
భోరుహనేత్ర యోరగను ♦ మో మొకయించుక వ్రాల్చి గద్గద
స్ఫారరవంబునం దడిపి ♦ వాతెఱఁ దా ధవళాక్షి నాల్కతోన్. ౧౩౨

కం. ఏలా యిటు మేలా సుర, బాలారత్నముఁలఁ బట్టి♦పాలార్పఁగఁ? గో
పాలా? సంయమిపశ్య, త్ఫాలా! యబలలను దిట్ల♦పాలా సేయన్? ౧౩౩

కం. అని వేఁడిన దయగూడిన, మనమున హరిణాక్షితోడ ♦ మౌని ధరిత్రిం
గనియెద వెప్పుడు నందన, వనసుమముల శాప మపుడ♦పాయు నటంచున్. ౧౩౪

కం. ఈవిధిఁ గోపావధి శా,పావధి వచియింపఁగా మ♦హావధి విధికై
యావిధి దూఱుచు జనిఁ గని, యీవిధి విధిమాఁడవల సె♦నీయుఁగనకుఁ. ౧౮౫
వ. అని తెలుపుటయు ౧౮౬
కం. భావభవహరసమమహా,భావుఁడవు మహానుభావ ♦ భావభవజయా
భావ మభావ్యమ యైన స్వ,భావము దురతిక్రమంబు ♦ వలవనఁ జను నే. ౧౮౭
కం. అడ లను కడలిఁ గరళ్లన, వెడలెడినిట్టూర్పుగముల♦ వెతఁగుందెడి న
న్నుడుపమయి ప్రోచితివి ము,న్యుడుపా! వ్యసనంబు నుడుప♦నూనుటఁ గరుణన్.
కం. శోకాతిరేకమున మిముఁ, దాఁకఁగఁ బలుకాఱు లఱచి ♦ దాన మహాపా
పాకలితాత్ముఁడ నైతి ద,యాకల్ప! క్షమింపవయ్య♦యాశ్రితవరదా. ౧౮౯
చం. అని తెలివొంది పల్కిన మ♦హాత్ముఁడు నారదమౌని యిట్లనుం
జనఁగఁ గొఱంత నీమదిని ♦ జామనుగూర్చి సమాధినిష్ఠఁ గా
ననమున నుండఁగాఁ జనుము ♦ నందను నందిడి రాజ్యభారమున్
ఘన మగుచిత్తశాంతిఁ బొడ♦గాంచినఁ గాంచెదు నిత్యసౌఖ్యముల్. ౧౯౦
కం ఈగతిఁ బలికిన నజుఁడు వి,యోగము సహియింపలేక ♦ యొయ్యనఁ బ్రాణ
త్యాగము సలిపెను సరయువు,భాగీరథిసంగమమునఁ ♦ బౌరులు గుందన్. ౧౯౧
వ ఎచ్చోఁ గ్రుంక మృతి నొందిన నాత్మహత్యాఘంబు లే దని పలుకంబడు నట్టి గంగాసరయూసంగమంబున దేహంబు విడిచి గంధర్వలోకంబునకుం జని హరిణింగూడి యతండు నిత్యక్రీడల వినోదించుచుండె నిట సాకేతంబున యువరాజగు దశరథు రాజుఁగాఁ బట్టాభిషేకంబుఁ గావించి సర్వజనంబులు హర్షోత్కర్షంబున నెలుఁగుచుండె నని శుకయోగీంద్రుండు వచించెఁ బదంపడి. ౧౯౨
కం. యోజనగంధాకుచయుగ, యోజనగంధాంకితా ! ప♦యోజాతాక్షా !
యోజనగంధాతనయా, యోజితవాఙ్ముదిత! శుభజ♦యోన్నతిచరితా. ౧౯౩

**చక్రబంధము.**

శా. సత్యాస్తుప్రియ ! రామ ! రాజితయశ♦స్సాంద్రా ! హరీ ! సాద్రిజా
స్తుత్యా ! బ్బాలదమప్రవీణ ! తతకా♦స్తాకారిలోకక్షయా !
నిత్యా ! రావణచంద్రరాహు ! తలఁతున్♦దేవు న్నినున్ విధ్వజా !
జాత్యా ! వాసవసంస్తుతా ! మునిసుతా♦జానీ ! దయాబ్ధీ ! యజా ! ౧౯౪

**అష్టమూర్తివృత్తము.**

నా(కో)కోఽహితసపత్నా ! నయగుణా ! లోకనాథా . నతజనావనదీక్షా
శ్రీకంఠాప్తవర ! వారాశినిలయా ! రాఘవేంద్రా ! సితకరోపమవక్త్రా !

వైకుంఠా! జనకపుత్రీవర! దయాపూర్ణచిత్తా! భసలమేచకగాత్రా!
శ్రీకాంతాహృదయవర్తీ! శివసతీసోదరా! దారితభవాంధసునామా! ౧౯౫

-:సరసిజవృత్తము.:-

శ్రీ(రా)మాహృన్మోదనిధానా! శితిగళనుత! రవిసితకిరణనయనా!
ధీరాధారా! పంకజనేత్రా! దితిసుతకులయమ! దివిజసుశరణా!
శ్రీరామా! భక్తావనదీక్షా! జితదశగళ! సరసిజమృదుచరణా!
మారాకారా! పాపవిదూరా! మనుజపకులమణి! మధుహితవచనా. ౧౯౬

గద్యము.

ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిందాయమానమానసత్వమహో
వైభవ వాపలికొలను రామచంద్రరాయతనూభవ సుజన
విధేయ సుబ్బరాయనామధేయప్రణీతంబైన
శ్రీ కౌసల్యాపరిణయంబునఁ
బ్రథమాశ్వాసము.
శ్రీరామచంద్రార్పణమస్తు.

---

శ్రీరామచంద్రాయనమః.

# శ్రీకౌసల్యాపరిణయము.



## ద్వితీయాశ్వాసము.

రాజిత! త్రైలోక్యస
మారాధితచరణ! దుర్మ♦దాసురహరణా!
ఘోరభవాంబుధితరణా!
నారాయణ! దివ్యభద్ర♦నగవరశరణా! ౧

తే. అవధరింపుము దేవ! మ♦హానుభావ, భావనాతీతవైభవ♦పరమయోగ
భావపుంభావకరుణాస్వ♦భావుఁ డైన, బాదరాయణి యిట్లను♦సాదరముగ. ౨

మ. జయ పూషాన్వయభూష! సాధుజనపో♦షా! సత్యసంభాష! స
స్మయవిద్వేషికులాంబుజాంబుజహరా♦ క్ష్మానాథచూడామణీ
జయ బృందారకబృందవంద్యఘనతే♦జా! యంచు నిచ్ఛాగతిన్
జయపెట్టంగను వందిమాగధులు కే♦సర్యాసనాసీనుఁడై. ౩

కం. దశరథుఁడు రూపసంపద, దశరథుఁడు ద్విపంచదిగ్వి♦తానతలచర
ద్దశరథుఁడు ప్రతాపమున ద్వా,దశరథుఁడు ప్రపూరితత్రి♦దశరథుఁ డలరెన్. ౪

తే. అంకురితయౌవనుం డైన♦యధిపుఁ డపుడు
చూచియును జూడకుండు ని♦స్తులవిలాస
బంధురలు బంధురలు నాఁ♦బాడ సమితి
నున్నవా రేమి తన్నెంతు♦రో యటంచు. ౫

కం. వినయాభినయాసమహా, స్తనయనకుచయుగముఖాంగ♦సంచలనము రా
త్తనయాత్మనయానంగద, హానహేత్యభివృద్ధి కపుడు♦వ్యజనం బయ్యెన్. ౬

వ. ఇట్లసమాన రూపలావణ్యతారుణ్యవిశేషంబుల డంబుమీఱి మదవతీనూతనమద
నుండై విహరించుచు వివాహార్థంబు విచారించుచుండె నయ్యవసరంబున. ౭

### —గ్రీష్మర్తువర్ణనము.—

శా. ఆ కల్లాడ దదేమొకో పవనుఁడు♦ ద్యద్గ్రావదావానలా
స్తోకాభ్యున్నతికై సహాయుఁడుగ నే♦చో గట్లపా లాయెనో .

జోకం గంతునిచే విడంబడఁడొకో ♦ సూయాణమం దిచ్చ; మో
హాక్రాంతుం డయి వారుణీరతి సదా♦యానంబుఁ దా మానెనో. ౮

చం. అతులరుజాయమాననిబి♦డాతపతాపసుజాయమానత్రి
డతజనకాయమానసభృ♦శార్తిని బాహ్య నవశీరపుంజక
ల్పితనవకాయమానపద♦విస్థలసల్లతికాయమానహృ
ద్యతమవిలాసభాసవని♦తాకరతామరసార్తినీరముల్. ౯

ఆ. ఇష్టకాపథంబు ♦ లిష్టంబులై సుది, నంబులయ్యె దుర్ది♦నంబు లపుడు
లోకబాంధవుండు ♦ లోకాహితుం డయ్యె, భీష్ము మైనయట్టి♦గ్రీష్మమునను. ౧౦

ఆ. అభయ మొసఁగె జనుల ♦ కభయంబు భూజన, సేవ్యమయ్యెఁ గ్లిన్న♦సేవ్య మంత
లయము తాపభయము ♦ లయ మొందఁ జేసెను, వట్టివేరు గాదు ♦ వట్టివేరు. ౧౧

కం. పలుచన చేసినఁ బెలుచను, గలఁచుచు దండాహతంబు ♦ గావించినఁ దా
నెలమిని దక్రము దాహము, దలఁగించెఁ బరోపకార♦ధర్ములు సరసుల్. ౧౨

తే. కార్యభరవశమున రిత్త♦కాళ్లఁ దిరుగ, జాలు ముండ్లను నాటినఁ♦గాలు కాలి
నొప్పి పోఁ గాఁచె ధాత్రి నే♦ర్పొప్ప మీఱ, రవిఘనాతపతప్త♦రాగములను. ౧౩

చం. చెలమను నూరునీరు బలెఁ ♦ జెమ్మటధారలు గాఱ మోమునం
దిలపయి మోపి హస్తముల ♦ నిందుక పృష్ఠము లెత్తి శీర్షముల్
పొలుపుగ వ్రాల్చి, నవ్వానుచుఁ ♦ బ్రొయ్యిని నూఁదుచు నీసుగ్రమ్మక
న్నులఁ బచనంబు సేసిరి జ♦నుల్ పయనంబులు వోయి యొంటిచె
ట్టులకు నీడలన్ వెతఁ గ♦డుం బడుచు న్వనహీనభూములన్. ౧౪

చం. బగబగమండఁ బాదములు ♦ వాతెర లెండఁగ, నెండమావులుం
దగ నిల నిండఁ, బెన్దగను ♦ నాలుకలం దడి లేకయుండ, వె
చ్చగఁ గడుఁజారవాయువులు ♦ సారెకుఁ జిమ్ముచు నుండ వేఁడిము
ల్రగులుచు మండఁ గొండలు, స♦రస్సులఁ బంకము లెండి పిండిగాన్. ౧౫

మ. జనధర్మావహమై, మహార్యజనతా♦సమ్మానపాత్రంబునై
ఘనముక్తావళిసంగతిద్య మగుచున్ ♦ గ్రామవ్యథావేళ భూ
జనవిశ్రాణనశీలమై వెలయునా♦సద్వంశమందున్ జని
స్తనుట స్వీవన త్రిప్పు లెంతో పడుచు ♦ న్మాన్చున్ వపుస్తాపముల్. ౧౬

ఉ. మంటలఁ జిమ్మునెండఁ దల♦మండ రసాతల మంటు బావినీ
ర్మింటికిఁ జేఁదిచేఁది కడు ♦ మే నలయం దడి పాఱ కుండినం
గంటితడిన్ ఘటింతు రల♦కాఁపులు డస్సినదుక్కి టెడ్లతోఁ
బంటతడిన్ శిరంబు లఱ ♦ వ్రాలఁగ వాడినపైట్లపైర్లకున్. ౧౭

వ. ఇట్లు పురహరఫాలాంబకోష్మం బైనగ్రీష్మంబైన మావు లుడివోవఁ డక్కులాడు
టక్కులాఁడులు టక్కు టెక్కరంపుమక్కువలనిక్క నిక్కంబని దక్కి యిక్కలు
జాఱి హితుల దూఱి బయలు దేఱి యతనుబారి రతులఁగోరి సతులఁజేరి మతు
లుదాఱి కులముమీఱి వెతలుగూరి గాలంబుల వ్రేలుపలలంబునకై పాఱు మీలన
వెలవెలందుకల వెంట నంటునరమృగంబుల యంగున నంగిలి నెంగిలి మ్రింగఁ
బోసంగక నెసంగునీరువట్టున నీరువట్టని పట్టనివట్టియూస నెండమావుల వెంటఁ
బరువువెట్టు మృగంబులవలనను, మిడిమిడియెండ మిడిమలు మండ నిలువకుండఁ
జెమట గాఱుచుండ వడివడి నీడకై పరువిడునెడ నెడనెడఁ బుడమిపుట్టువుల పట్టులు
లేకయున్నఁ బైనున్నవల్లెఁ బాదంబులకుం జుట్టియు బొడ్డునం దోఁపినయంచు
నించుకసడలింప నెఱిగల నెఱికలు విరివిగొఱల నేలఁ బఱచి పరువలేక మే నెల్లఁ
దడియ నొడియుబిందువుల నివతాళించుపయ్యెంటలపైఁ జండంబుగ వేఁడివీవలివీవ
వేఁడినీరు స్నానంబుచేసిన వడువుననై మెండుగమండుదండియెండల నోరెండ సొట
సొటలాడుచుం బోవఁ ద్రోవఁ జేవడిన చెట్లనీడల నిలిచి తత్స్థాపకుల నాశీర్వదిం
చువారివలనను, విమలధు నీరసంబగునీరసంబు నీరసంబు లేక త్రావ నీరసంబులైన
మీయాస్యంబులసార స్యంబు లొప్పునని మెప్పు లాడునొప్పు లాఁడులకరంబుల
సోఁకున ద్విగుణీకృతశీతంబై పేయంబైన పాయంబుఁగొని యుపాదేయంబైనపా
థేయంబు విదేయత నొసంగఁ బొంగి చనుబాటసారులవలనను, ఖరకరఖరతరకర
నికరంబులు కరంబునికరంబు కనికరంబు లేక జగంబుల నాతపంబునఁ బగల సో
లించి రేలఁ బాపంబునాక కోపంబుపేఁకఁ దాపంబు సోఁకఁ గారుణ్యంబులేక నీలీ
లఁ జాల జాలిఁ దూలింపఁ బాలామె నన మిగుల సెగలపొగలదగల వగలుదగు
లబుగులుకొన రగులుకొని మిన్నుమన్ను నొక్కటిగఁ గవియు పెనుమంట లద
రంట వెంటనంటఁ జిటపటరటనంబులఁ బెటులు జీవపటలంబులతో దూరపుంజూ
పునకు మినులచ్చికి శబరీకబరీమతు లిచ్చుచాలుదీపికారాత్రి కలుగాఁగ వెలుంగు
మలచిచ్చులవలనను, మహాతపతాపంబున కోపక బక్కచిక్కి తెల్లవాఱి యెడనె
డమడుఁగుల నడుగిడి యెడమడుగుగా నడు గాపడగాఁ బోవుచుఁ బ్రాయేచుచేర
నేరక వేఁకివేఁకరంబునఁ గృశత కాకరంబయ్యెనో నా నొడలిగుట్టు బయలువెట్టు
దువ్వాలునగట్టు జట్టివెలందుకపయ్యెంటకు నెయ్యంబైన పలుచనినీటిచింకల కెలం
కుల బెస్తలు బడిశహస్తులై నిలువ జడిసి నిలుకడలేనివారి నమ్మిన నుమ్మలికంబు
గాకున్నెయన్నట్టు లూలమాలగుడిచి లూలామాలంబుగ మూలమూలగడచిన
రోసిరోసి యిసుముచాటున నాఁచుమాటున దాఁచికొను చేఁపపిల్లలఁబట్టఁ గాలు
వల నరికట్టి వలలఁ బుట్టలఁ బెట్టి సూదిముక్కుకట్టెలఁ బైతట్టుబొడిచి పొడిచి
తఱుము ఝషగ్రహణధీపరు లగుధీవరులవలనను, దిక్కుదిక్కులనుండి నీ రిగిరిన
చెఱువులఁ ద్రొక్కుమక్కువ నెక్కువరభసంబునఁ గాఁదారిమాఁదారి లేచి మిక్కు
టంబుగ సాధనంబులు పూని కిలారింపుల నించుచు నింపు పెంపారఁ బెండిలికిం

బోవు నిబ్బడియుబ్బిన మబ్బునాక తెప్పదెరలఁగఁ గట్టఁజేరి తొప్పలుదొరలుగ బారులుదీరి ప్రౌద్దేల పొడువ దని బద్ధులాడుచు భండనంబున కెదురుచూచు గుంపెలుదీసిన దండిమగలన నేను మున్న నేను మున్న యని పద్దులాడి గ్రుద్దులాడ నీ వింతపోకలఁ జూడఁ దమ్మిఱేఁడు పుట్టుగట్టు మెట్టెనో యనఁ గనరానో యని యెక్కపెట్ట నింగి ముట్టఁజెవుడు పట్టి నీటదూఁకి చేఁపల బుట్టలఁ బెట్టి కట్టలవైచి పలుతెఱంగుల దాఁచువారివలనను, మఱికొంద ఱేల యీ వెత లని తూముదాపున కాపుండి తప్పించుకొను వెరవున గడువడినీటియురవడిఁ బరువిడి మిట్టిపడు బేడిసలం గొట్టి పట్టుకొని దండపాశికులకు భాగంబు లిడుచుండ నిండినపుస్తునకుఁ దాళలేక చనుమినుకెంపుతోడఁ గొంపలు చేరుగుంపులజంపులవలనను, బేరెండల యుద్దండత్వమునకు మంచెలనుండఁ దరంబుగాక దిగి యంచునీడలపట్టుల గుట్టుగ నుండ నిదియ పట్టని పిట్టలు రా నేటిరట్టని తిట్టుచు నడిసెలరాలఁ జేపట్టి జివ్వజివ్వనగువ్వలఱువ్వ కాఁపుఁ బువ్వుఁబోఁడులవలనను, బరకష్టసుఖంబు లెఱుంగని దుష్టాధికారుల యిష్టంబు కొలఁది దవ్వులనుండి నెండరా సెగసోఁకునఁగ మరినమొగంబునఁ దిగుచెమటలుగాఱ బిఱబిఱవచ్చి పైవల్లియ ముగంబు నద్దుకొని నీరొడియఁ దడిసినపట్టి వేళ్లతెడికల కూటాగారంబులవీవనలవీవలివలి పెంపవిసరంబడియుఁ దమకన్న మున్ను గమఱిమున్న గ నాపసోపంబుల సొటసొటలాడుచుఁ దాపం బభినయించి జాడీలకొలఁది చలినీరంబుల నీరుమజ్జిగలఁ బానకంబులఁ గడుపుబ్బఁ ద్రావి ఫలాహారంబులఁ గుడుచుచుఁ దాపం బార్పుకొని యెదిరి తాపం 'బాత్మవత్సర్వభూతాని' యనియో భుక్తాయాసంబుగఁ దలంచి తడ వేలచేసితిరని తమ్ము గద్దింప నిజోదరదరంబున వెలిబడు లాడక గంటలకొలంది గ్రుక్కుమిక్కుడక మ్రోల నిలువఁ బడు ననుజీవ్యులవలనను, నిర్దయచిత్తు లగునరులచేఁ గల్పింపఁబడిన నీటిపట్టని యెఱుంగక బిట్టునీరువట్టలమటపెట్ట విసవిసఁ జనుదెంచి పొంచున్నకించులచేఁ గొట్టఁబడి నేలం బడి కానలో నిట్టిదురవస్థలఁ బడుటకన్న మన్నిగొన్న మిన్నయని యెన్నురీతి నఱచి చచ్చుపసృగంబులవలనను, వేగుఁబోక దాఁకఁ దాపంబున వేఁగుచు సలజడిఁ బొంది విసివిచెంది కూరుకుచెందిన మంది చేవిడువఁ జేపట్టువారు విడువ ది క్కేది యనినట్టు నేలంబడి యుండు తాళవృంతంబులవలనను, గొడవండ్లరొండ్లఁ జేర్చి చనుదెంచుకూలివాండ్రఁ గని ధాత్రీ ! శాలిపాలికాబాలికాపాలికలు క్షీరంబుఁ గూర్చి పెంచి పెద్దసేసి రేపుమాపు కాపుండి తుద కెంతకు బ్రాలుమాలి రని మూర్ఛవోయినవడువున దండిపండి వ్రాలినవానిం గని మనము ఖండితంబులమయ్యెఁ బరజీవరక్షణదక్షత్వంబునఁ గ్రాలుదుము గాన వగవనేల యని యూరార్పుమాట లాడుపగిదిఁ దలయూఁచు మందసమీర కంపితపాకవినమ్రములైన కలమంబులవలనను, బొలముకాఁపుల నోదె గింజల వేఁడుకొన నొనగూడిన దేశదేశసమాగతభిక్షుకులవివిధగానారవంబులవలనను, బ్రాణావనశీలి శాలి ఖండితంబయ్యె ది క్కెయ్యది యని భయంబునఁ బొలంబున మూలమూల కేగు

కర్కాటకాదుల హరింప మింటఁ గావా దిరుగు ఖగంబులవలనను, గాచికాచి ధనం బుఁ బరుల పాల్సేయు పిశాచములఁ బోలిన బచ్చులవలెఁ గిరవారంబులనైనఁ జేర నీక యెలుంగెత్తి దెస లదర వాపోవుపురసాలపాలనలోలు రైనజనులచేతను, నవ మల్లికామతల్లికాకుసుమ పరిమళ భరితదిశాంతదినాంతంబులవలనను, నిదాఘంబు చెల్వారె నట్టియెడ. ౧౭

ఆ. కోళ్లు కారుకోళ్లు♦కుఁదేళ్లు పులిగోళ్లు, నోళ్లు కన్నెలేళ్లు♦లేళ్లు పలునె
మిళ్లు పావురాళ్లు♦గూళ్లతోఁబూరేళ్లు, పులులతోళ్లు తేని♦కులువ యిచ్చి. ౧౮

వ. ఎఱుకులు గొందఱు తమతమయునికిపట్టులు లోనగుతమచరితంబు వినిపించి. ౨౦

తే. తెఱ మెకంబుల గుంపులఁ♦జిఱుతపులుల, వాలుమెకముల నేదుల♦వాలములను
దుంతబంతులఁ గానలోఁ♦ద్రాక్కి కాని,పాద మానంగ రాదు మీ♦పాద మాన.

కం కోనల నిలువక పగలే, కోనలఁ గొనిపోవ సాగెఁ ♦ గోవుర మైనం
బూనక రైతులు గుందఁగఁ, గానఁగదా మిమ్ము నిపుడు ♦ కానఁగ రాకల్. ౨౨

కం. మా కేలిక నీ వగుటను, మా కేలిఁ గనుఁగొనంగ♦మది గలిగినచో
మా కే లిఁకఁ గనుఁగొందువు, మైకో లనితేనిఁ జాలు♦మఱి వేఁట చనన్. ౨౩

వ. అని ప్రబోధించుటయు దశరథుం డాత్మగతంబునఁ ౨౪

## —దశరథుఁడు వేఁటకుఁ బోవుట.—

చం. జలములు లేక కస్తివడు♦జానపదాళినిఁ జల్వపందిరుల్
నిలుపఁగ యోగ్యభూములను ♦ నీటికొఱంతను గోడుతాఱుపై
రుల, శిథిలోదకాశయముఁ ♦ గ్రొత్తతటాకము లుద్ధరించుటల్
దెలియును వేఁటసాకునను ♦ దేశము గ్రుమ్మర వేసవి న్నృపుల్. ౨౫

వ. అని తలంచి యయ్యైకో లాసంగి సముచితపరివారుండై దేశంబులం జూచుచు వారలకష్టసుఖంబు లెఱుంగుచు వలయుచోఁ బ్రతీకారంబులు గావించుచుఁ జని వేఁటగిరులతో నరణ్యంబుఁ బ్రవేశించి మృగయావినోదపరుం డయ్యె నయ్యెడ.

కం. వెనుకంజూపులఁ జూచెదు, నను వను వైతోఁచె నొక్కఁ♦డడిదముఁ గేలం
గొని తెఱుమ బొబ్బమెకములు, వెనుకఁగనుచుఁ బొఱవలను♦వెలయుటకతనన్.

కం. గామిడికాఁ డెదవడి పోఁ,గా మిడికాడంగ ముట్టి♦కడఁకను ముట్టెన్
గామిడిచెంచులు పట్టం,గా మిడిచెడి మిడుకుకొఱకు♦గా మిడు కొందున్. ౨౭

కం. ఎలుఁగుల దెసలం బరువిడు,నెలుఁగులఁ దిత్తులనునొల్చి ♦ రెసక మెసంగన్
సలిగలయు నఱువ నెక్కటి, సలుగుల సలుగులుగ నిడిరి♦శతమృగములకున్. ౨౮

సీ. చలపట్టి యొకజెట్టి♦సెలకట్టెఁ జేపట్టి, యలజట్టి వేఁటలు♦సలుపుచుండె
యమధాటిఁబోలు వి♦క్రమధాటి పరిపాటి, యమధాటి నఱికె వ్యా♦ఘ్రముల నొకఁడు
దండంబులను మహో♦ద్దండత్వమున నువే, దండంబు దండంబుఁ♦జెండె నొకఁడు
శైలాటవీస్థిత♦శైలాటు లెద మెచ్చ, శైలాటములఁ బట్టె♦ లీల నొకఁడు
ఆ. ఘోరదర్శనాళి ♦ ఘోరదర్శనులయి, గండములకుఁ బ్రాణ♦గండ మగుచు
హరిసమూహగర్వ♦హరులయి తిరిగిరి, వేఁటగిరులు కిరుల♦వేఁట గిరుల. 30
కం. క్రొవ్వున నత్తెమున నునిచి, దువ్వుచు నెఱకలను గేలఁ ♦ దోఃపారంబుం
ద్రెవ్వఁగ గువ్వలఁ జూపిన, జివ్వనఁ జని బైరి వడి నె♦ఱిం గుఱిఁ జంపున్. 31
కం. ఓహరి సాహరి నులివ్రుల, గోహరి వెలయంగ నద్ది♦గో! హరియంచున్
లాహిరి తెక్కలుగల కా, లాహరకిం బోలయ నొక్కఁ ♦ డఱచేఁ గొట్టెన్. 32
కం. వీక్షించి తన్నుఁ బైని ద, రక్షువు కుప్పించి యెగసి♦రా నొకకోలన్
దక్షుండై పదములు నా, ల్గా క్షణమున నఱికె నదియు♦నవనిం ద్రెళ్లెన్. 33
కం. గవయమృగం బొక్కఁడు పైఁ, గవియఁగ మే నవియఁగా ర♦కం బగుములుకుల్
జవమునఁ గైకొని తునుకలు, గ వియత్తలమంద నఱికె♦గర్వం బమరన్. 34
శా. సాహంకారగభీరనాదదళితా♦శాకుడ్యమై వెండి దు
ర్మోహాంధం బయి సాహసంబు వెలయం♦గ్రోధించి దంష్ట్రారుచి
వ్యూహంబు ల్మిఱుమిట్లుగొల్ప వడి ని♦ప్పుల్ రాలఁ గన్దోయి స
న్నాహం బొప్పఁగ రా వధించె నవనీ♦నాథుండు శార్దూలమున్. 35

## వరాహవృత్తము.

కాన నవ్విక్రమరసయుత♦గతిఁ బెలుచను♦గనుచు రయమున వరాహం బా
క్ష్మానాథుం గుఱిచి సరిగఁ♦గదల మహి ద♦గఁ జటులగతి నొఱుగు న్మోరన్
జానై గండశిల శిఖరి♦జరగి సరభ♦సగతి దొరలినగతిం బైరాన్
స్థానంబుం గదలి నిశిత♦శరహతిని ర♦సను బడ నిముసమునం జేసెన్. 36
కం. శరమువలె వచ్చు నొకకణ, సరముం గని భీతి ముడిచి ♦ ఛదయుగముం బ్ర
స్తరమునఁ బడు పావురముం, గరుణామతి నేయఁ డతఁడు♦గడుదాపయ్యున్. 37
వ. ఇట్లాఖేటకేళీలోలుండై యనేక కాంతారాంతరములు గడచి చనిచని వాహ్యాంబులు డస్సిన సుమంత్రుం డొక్క మహావటవిటపిచ్ఛాయ రథంబు నిలిపి యిట్లనియె. 38
కం. మన మీగతి మృగయారతి, వనములబడి నేగుదేర ♦ వాజులు డస్సెన్
జనుదమ వల్లభ! మెల్లన, మునివరుఁ డగు నత్రిఘనత♦పోవని కనఘా. 39
ఆ. ఇంతదవ్వు మీర ♦ లేతెంచినారఁట, తపసిదర్శనంబు ♦ తగవు కాదె?
సేద దీర్చుకొనుట ♦ చేకుఱు ననిన నౌఁ, గాక యనినఁ దేరు♦కడఁకఁ దోల. 40

కం. అత్రిని భవ్యవ్రతత్యాసి,పుత్రినిఁ గలుషౌఘకుంద♦పోత్రిఁ దితిక్షా
ధాత్రిని నిస్తులసద్గుణ,పాత్రినిఁ గని వినుతి సేసి ♦ వాగ్వైచిత్రిన్. ౪౧

వ. తన్నిర్దిష్టాసనోపవిష్టుం డై యున్నంత నత్రియుఁ గుశలప్రశ్నవ్యాజంబున ధర్మోపదేశంబు సేయుచు ని ట్లనియె. ౪౨

**అత్రి దశరథునకు ధర్మోపదేశంబు సేయుట.**

ఆ. ప్రజల నీవుగన్న♦ప్రజ లట్ల భావింతె? సేవకులకుఁ బేర్మి ♦ సేయు దయ్య?
యాశ్రితులకు ధనము ♦ లర్పింపుదువు కదా? సత్యవచననిష్ఠ♦సలుపు దయ్య? ౪౩

ఉ. సాకులు చెప్పి పన్నులను ♦ జాలఁగఁ దీయవుగా? తదర్థ మ
స్తోకము దుర్వ్యయంబులను ♦ జూఱలు వెట్టవుగా? జనాళిసౌ
ఖ్యాకర మైనకార్యము న♦యంబునఁ జేయుదె? లోభవృత్తి ను
దేకితఁ గోశపూర్తికయి ♦ తీయవుగా కపటంపుదండుగుల్? ౪౪

కం. జనవిశ్వసనీయుఁడవై, మనఁ గరుణం గలఁ డటంచు♦మదిఁ దెలిసినచో
జను లర్థమేల ప్రాణంబును నిచ్చెద రెడరులం బ్ర♦భువునకుఁ దా రై. ౪౫

కం. నమ్మవు గద కొండెఁడుల? నమ్మవుగద వాదములను♦న్యాయము? సత్యం
బిమ్మవుఁగద నెయ్యెడల♦న్నమ్మకయుండెదవొ సాధు♦నయబోధకులన్. ౪౬

కం. అన్నరు గద కన్నెల నెల, కమ్మరు గద భూమివిబుధు♦లాగమము? జనం
బమ్మదు గద యన్నము! మొ,నమ్మలు సత్యానృతములఁ ♦ జలుపఁబడవుగా.

కం. ఆడరు గద జూదము? వీడ, నాడరుగద నరులు గురుజ♦నావళి? నాం త్రై
గ్గాడరు గద పతులం? జే,వీడరు గద సతుల వారి♦విభు లేనాఁడున్. ౪౮

కం. నినుఁ గొలిచెడిజనములు దమ,మనుదలకై పరుల వేఁడ♦మరియాదా? వే
తనములఁ జాలఁగ నిచ్చెదె, దినములు సరిగాఁగ వారి♦దీనత వాయన్? ౪౯

చం. ఋణముల నిచ్చెదే ధనవి♦హీనకృషీవలకోటికిన్? దయ
న్గొనుచె శక్తికై కవృద్ధిగ? ము♦నుం బ్రసభంబునఁ బెచ్చువడ్డియా
సను గపటంపుయుక్తుల నొ♦సంగి పదంపడి లోభవృత్తిఁ గై
కొనవుగదయ్య భూములను ♦ గొడ్డులగోదల నమ్మఁబెట్టుచున్? ౫౦

ఆ. చారదృక్కు వయి వి♦చారదృక్కువు నయి,వఱలి యెఱిఁగి లోక♦వార్త లెల్లఁ
దప్పుగలుగువారి ♦ దండించి సాధుల, మదినిసంకటంబు ♦ మాన్తు వయ్య? ౫౧

మ. కలమాత్రంబును లేదు కా దనక జో♦కన్ గేస్తు లాతిథ్యముం
జలుపం జూతురె? భక్తి గేహినులు భి♦క్షుం బిత్తురే వేఁడు పే

దలఁతురె? దైవగురుప్రపత్తిగలదే? ధర్మంబుఁ బోకార్చు స
త్ఫలవృక్షంబులక్రిందినాఁగు జెముడా♦పాపాత్ముకు ల్లేరుగా? ౫౨

కం. మెచ్చినచో మనుదలకై, యచ్చపునృపభక్తులకు మ♦హాకార్యములన్
మెచ్చుగఁ జేసినవారికిఁ, బెచ్చుగ నిడు ధనము; రిత్త♦బిరుదము లేలా? ౫౩

చం. జనముల హేయదుర్విషయ♦సక్తుల రోగులఁ జేయునీతినా
శనకరవస్తుసంతతి బ♦జారున నమ్మఁగఁబెట్టి, మానఁగా
జనములు వీనిఁ బన్నులను ♦ జాల విధించితి నంచు యుక్తులన్
ధనగతచింత నాడవు గ♦దా మతిమంతు లెఱింగి నవ్వఁగన్. ౫౪

సీ. వసుల నాఁగుటమాత్ర♦వర్షంబు గురియదు, గుత్రమంముల వ్యాధి ♦ కుదురఁబోదు
దండనీతిని ప్రభు♦త్వమ్ము నిల్కడ గాదు, కర్మలం బమ్మినఁ ♦ గలిమి రాదు
ప్రౌఢయుక్తులచేతఁ ♦ ప్రజ లుల్లసిల్లరు, బేహారమునఁ బెంపు♦పెరుఁగఁ బోదు
సాక్షిమాత్రన న్యాయ♦సరణి నమ్మఁగరాదు, పక్షపాతం బెప్డు♦బలము కాదు
తే. నీతికోవిదులైనట్టి♦నృపతివరులు, ధర్మ మొక్కండె తమకు నా♦ధార మనుచు
దానిఁ జెడకుండరక్షించి♦రేని తమకుఁ, బ్రజకుఁ గొదవలు గగనపు♦ష్పములె లేశ.

సీ. జారత్వమున సౌఖ్య♦సమ్మానములు లేవు, చోరత్వమునఁ గల్మి♦చొప్పు నిలదు
క్రోధమాత్రంబున ♦ గొప్పతనము లేదు, దానంబుచేఁ బేద♦తనము రాదు
పరుషవాక్కులచేతఁ♦బరువు నిల్వఁగఁ బోదు, హింసచేతను బుణ్య♦మెపుడు లేదు
విద్యలేమిడిచే వి♦వేకంబు గుదురదు, దుష్టసంగతిఁ గీడు ♦ దొలఁగ దెపుడుఁ
తే. గావున నృపాల! నీవు స♦ద్భావముననను, సుజనసంగతియును శాస్త్ర♦చోదితంబు
నైనవర్తన మెడలక♦యనఘశీల, మునను జరియింపు మిహపరం♦బులును గలుగు.

వ. అని పలికి మఱియును. ౫౭

చం. తరుణవయోవిశేషము జి♦తప్రసవాంబక సౌకుమార్యమున్
వరధరణీపతిత్వమును ♦ పౌరుషవృత్తియుఁ గల్గియుండి నీ
వరయఁగ బ్రహ్మచారి వగు ♦ టక్కట మేలె? గృహస్థధర్మము
న్సరసతఁ జేకొనం దలఁపు♦నం గనుమా కొనుమా కృశోదరిన్. ౫౮

తే. ఆశ్రమంబులలో గృహ♦స్థాశ్రమంబు, శ్రేష్ఠ మానని కాదొకో♦శిష్టమతము
ధరణిఁ దరుణీద్వ్యసంగతిఁ ♦ బరఁగనట్టి, పురుషజన్మంబు జన్మంబె♦పురుషవర్య. ౫౯

తే. దేహరక్షాదికక్రియఁ♦దిరుగునట్టి, నరుఁడు తనకూర్మి యిల్లాలి♦నగు మొగంబుఁ
గానఁజెందాఁక నందాఁకఁ♦గ్రాలునతని, కాయమానసవేదనా♦కాండ మధిప! ౬౦

సీ. వ్యసనాంధకారదు♦ర్భరమగ్నచిత్తుల, కను వైనప్రాపు ప్రో♦యాలిచూపు
రాజకీయక్రియా♦యోజితవ్యథఁ బాప, మేలైనయుక్తి యి♦ల్లాలియుక్తి

బహుళప్రవాసోప♦వాసయాతనలకుఁ, జాలినవిడుపు ప్రో♦యాలికుడుపు
బహుదూరపథయాన♦బాధానివృత్తికి, నమరినమందు ప్రో♦యాలిపొందు
తే. కష్టకార్యాచరణ నిత్య♦కర్మఘులకు; నధిప! సరిలేనిజయము♦ప్రోయాలినయము
కాన ననుగుణవతియైన ♦ మానినిఁగల, జనునిభాగ్యంబె భాగ్యంబు♦జనవరేణ్య.
సీ. వ్యసనాంధకార దు♦ర్భరమగ్నులకుఁ దల,నమరినమోపు ప్రో♦యాలిచూపు
రాజకీయక్రియా♦యోజితవ్యథఁ బెంప, నాసురశక్తి ప్రో♦యాలియుక్తి
బహుళప్రవాసోప♦వాసయాతనలకుఁ, జాలినజడుపు ప్రో♦యాలికుడుపు
బహుదూరపథయాన♦బాధాప్రవృద్ధికి, నదరింపుగాము ప్రో♦యాలిమోము
తే. కష్టకార్యాచరణనిత్య♦కర్మఘులకు,నధిప! సరిలేనిభయము ప్రో♦యాలినయము
కాన ననుగుణవతిగాని♦మానినిఁ గల,జనునిజన్మంబు జన్మంబె♦జనవరేణ్య? ౬౨
కం. కావునఁ బంచలకారయు,తావనినాథాత్మజాత ♦ నగ్రమహిషిఁగా
భావించిన నిహపరసౌ,ఖ్యావళి భవదీయకరత♦లామలకంబౌ. ౬౩
కం. అని మునియాడిన సూక్తులఁ, గొనియాడుచు ననియె మన్న♦గుణదోషంబుల్
గని సతి గ్రహింప నెటు లగుఁ, దనపూర్వఋణంబుకొలఁది♦దాపర మగుటన్.
ఆ. తనపురాకృతర్ణ♦ఘనఫలంబునఁ జేసి, దాపరించుఁగాదె ♦ తలిరుఁబోణి
పిన్ననాఁటిబుద్ధి ♦ పెద్దైననుండునే, యిత్థ మనుచు నిర్ణ♦యించు టెట్లు. ౬౪
ఉ. శిక్షితవైరి యాజి యిటు♦చెప్పిన నిక్కమ నీదుపల్కులున్
దక్షిణకోసలాధిపుఁ డు♦దారుఁడు విక్రమనీతిసత్కళా
ధ్యక్షుఁడు వానికూఁతు రసి♦తాంబుజనేత్ర సువర్ణగాత్ర పుం
డ్రేక్షుకరాసిపుత్రి నిర♦తేడితనీరధిపుత్రి భూవరా. ౬౫
కం.సుమసారము మృదువాక్కులు,సుమసారము కచభరంబు♦సొంపుఁదలఁప నౌఁ
జుమ సారము జఘనం బౌ,సుమసారశరాంబఁ బోలు ♦ సుదతి గుణమునన్. ౬౬
కం.కంజరమ మేను; మనసిజ,కంజరమ సువచనరచన♦కలిమి; న్నడలం
గుంజరమ; మత్తమధుకర,కుంజర కంజముల గెల్చుఁ♦గోమ రగుకనులన్. ౬౭
తే. నీలరుచి మీఱుచు సుమన♦స్స్నేహమూని పెంపుగననంగశింజినిఁ♦బెనఁగికాంత
పదసరోజాతపాళిని♦ప్రాలుచుంట,భృంగములు కావె తిలకినీ♦భృంగతతులు. ౬౮
కం.భూవల్లభ! నడను స్వయం,భూవల్లభ ముక్తి నాత్మ♦భూవల్లభ మా
భూవల్లభగురుతఁ గనెదు, నీవల్లభఁ జేసి తేని ♦ నీరేజముఖిన్. ౭౦
ఉ. గీటునఁ బుచ్చివైచుఁ గను♦గీటున నీటున నీటిపాపలౌ
పాటలగంధిరత్నములఁ ♦ బాటన పాటిలఁ బాటపాట సీ

మాటిమిటారఁ మెన్నఁ దర♦మా తగుపాటిగ నైన? లేదు ము
మ్మాటికి సాటిబోటి పలు♦మాట లవేటికి నవ్వధూటికిన్. ౨౧

ఉ. ఆసుమకోమలాంగి భవ♦దగ్రకుటుంబినిఁగా నొనర్చు, ము
ల్లాసము మీఱ నిచ్చును వి♦లాసవతిన్ మది నీవు గోరినన్
వీసము శంక లేక పృథి♦వీవరుఁ, డాసతి కారణంబుగా
వాసిగ నైహికంబు నప♦వర్గము నొందెదు నిత్యకీర్తివై. ౨౨

ఆ. అనిన హర్షమంది ♦ యాతనిసెల వంది, యవనిపాలకుండు ♦ జవము మెఱయఁ
బురికి నరుగుచోటఁ ♦ బోలుపారఁ గనుఁగొనె, నాత్మగురువసిష్ఠు♦నాశ్రమంబు ౨౩

కం. మీకులగురునాశ్రమము సు,మా కువలయనాథ! యని స♦మంచితరీతిమైఁ
బ్రాకటమతి సారథి యన, వే కనుఁగొనవలయు ననుచుఁ ♦ బృథివీవరుఁడున్. ౨౪

ఉ. సారథిఁ దోడఁ బల్కిన హా♦సా దని వేగమ యాశ్రమస్థలిం
జేరఁగఁ దేరు డోలుటయుఁ ♦ జే మొగిడింపునఁ జొచ్చి కాంచె ధా
త్రీరమణుండు యోగరత♦ధీనుతధీరుని మానిరాట్పునా
సీరు నరుంధతీవిమల♦చిత్తకుశేశయనవ్యసూరునిన్. ౨౫

చం. వలగొని మ్రొక్కి నిల్చి ముని♦వల్లభదర్శితపీఠి నుండి తాఁ
బలికె నృపాత్మజుండు దన♦వచ్చినహేతువు నత్రిదర్శనం
బలము నిబోధ మంతియు స♦మగ్రముగా, విని యంతటన్ ధరా
తలపతితో వసిష్ఠుఁ డనెఁ ♦ దథ్యము సుమ్ము కుమార! యంతయున్. ౨౬

చం. అనఁ జెలి వొంది పల్కె వసు♦ధాధిపుఁ డో మునిరాజమౌళి! యే
యనువున మానవుం డిల గృ♦హస్థుఁడు దా నయి మోక్ష మందు నా
యనువు దయాపరుండ వయి ♦ యానతి యి మ్మిది సాధ్య మంచు నా
మునివరుఁ డత్రి వల్కె నను ♦ బోధము చేసెడిపట్లఁ బ్రీతితోన్. ౨౭

కం. ఏవాని నెవ్విధంబున, భావింపఁగ వలయు? సులభ♦పథ మెయ్యది దు
ర్భావభవాబ్ధితరణహిత, భావగ సంసారమగ్న♦భావుల కిలపై? ౨౮

చం. మన మతిచంచలంబు త్రుటి♦మాత్రముఁ జిక్కఁగఁ బట్టనేర; నో
య్యాన నియతోపవాసము ప్ర♦యాసము గాదె? ప్రవాస మన్ననో
ఘనతరతీర్థసేవలను ♦ గాఱియ యింత యనంగ రాదుగా?
మనుజున కేవిధిన్ సులభ♦మార్గమునం గడ తేఱుఁ బుట్టువుల్. ౨౯

కం. అని ప్రార్థించిన విని ముని, జననాథునిఁ జూచి పలికె ♦ సంతసమున నో
యనఘా! నీ దగుప్రశ్నం, బనుపమము వచింతు వినుమ ♦ యవధానమునన్. ౩౦

## వసిష్ఠుఁడు దశరథునకు రామనామమాహాత్మ్యంబు సెప్పుట.

సీ. ప్రాఁగన్ను వెట్టుచుఁ♦మఱితూఁగఁగా నేల, రామతారకమంత్ర♦రాజ మెఱుఁగ
నఖిలాన్యదేశవా♦సాయాస మది యేల, రామతారకమంత్ర♦రాజ మెఱుఁగ
బహుళమంత్రంబులు♦వల్లింపఁగా నేల, రామతారకమంత్ర♦రాజ మెఱుఁగ
ముక్కులు బిగఁబట్టి ♦ బుసగొట్టఁగా నేల, రామతారకమంత్ర♦రాజ మెఱుఁగ
ఆ. గ్రుడ్లు మిటకరించి ♦ గ్రుక్కుమిక్కుడక, కదలమెదల కేల♦కాఁటియపడ
రామమంత్రమెఱుఁగ♦రాజన్యవర్య ! యీ, భూతలంబునందుఁ♦బురుషులకును. ౮౧
సీ. మననంబు భవకూట♦హననంబు ధిక్కృత, జననంబు పుణ్యావై♦జనన మధిప
మంత్రంబు మోక్షమా♦మంత్రంబు సర్వస్వ,తంత్రంబు భవరోగ♦తంత్ర మధిప
ధ్యానంబు కృతహితా♦ధ్యానంబు పుణ్యాస,ద్యానంబు ముక్తిమో♦ద్యాన మధిప
స్మరణంబు దుఃఖసం♦హరణంబు తన్నమ, స్కరణంబు జన్మసం♦స్కరణ మధిప
ఆ. రామభక్తి యతుల♦రాజితవరశక్తి, ముక్తిభుక్తిఁగూర్చ ♦ మొదటియుక్తి
రక్తివెలయ మిగుల♦సక్తిఁగో భజియింప, శక్తిగొలఁదినేని ♦ ముక్తియొదవు. ౮౨
ఉ. "మా" యనఁ బంచవింశతిత♦మం బది యాత్మకు సంజ్ఞ; రెండునై
"రా" యన నిర్వదే డవది ♦ గ్రాలుఁ గదా పరమాత్మసంజ్ఞ; నా
రాయణుఁ డాతఁడే ప్రణవ♦మందలి "యు" త్తన నిర్వదాఱు నాఁ
గా "య" తలంప నాఁ బురుష♦కారము సూచనసేయు లక్ష్మినిగన్. ౮౩

## ద్విరదగతిరగడ.

మానవాసమదుఃఖ♦మారకము తారకము- దానవాహితభయవి♦దారకము తారకము
ధ్యానశీలమనుజో♦ద్ధారకము తారకము- దాననైష్ఠికజన్మ♦తారకము తారకము
ధరణీశ తతశుభా♦ధారకము తారకము- ధరమధుర జితసుధా♦ధారకము తారకము
నతజనావజ్ఞాత♦నారకము తారకము- తతకోటిమంత్రబృం♦దారకము తారకము
శరణాగతత్రాణ♦సారకము తారకము- కరుణామృతయుతభృం♦గారకము తారకము
వైకుంఠపట్టన♦ద్వారకము తారకము- శ్రీకంఠహృదయము♦ద్రేరకము తారకము
శమితభక్తశ్రేప♦స్మారకము తారకము- హరిపద్వర్ణమణి♦హారకము తారకము
భృత్యజనవాంఛిత♦శ్రీరకము తారకము- సత్యవాజ్మికరవి♦స్తారకము తారకము
అష్టకష్టాఘాప♦హారకము తారకము- శిష్టతాపాపహా♦శీరకము తారకము. ౮౪
తే. తెలియఁగా నాల్గుపురుషార్థ♦ములును రాము, మంత్రజపశాలికరతలా♦మలకములగు
రామమంత్రంబుసాటిమం♦త్రంబు లేదు, తథ్యమింతయుఁ దథ్యంబు♦తరణివంశ్య. ౮౫
సీ. తీర్థయాత్రలచేతఁ ♦ దీఱనిపాపంబు, దేవసేవలచేతఁ ♦ దెగనియఘము
నుపవాసములచేత ♦ నుడుగనివృజినంబు, దానధర్మంబులఁ ♦ బోనికీడు

వ్రతగురునిష్ఠలం♦బాయనిపాప్మంబు, ఘనకర్మములఁ బోని♦కల్మషంబు
మంత్రతంత్రంబుల♦మాయనిపంకంబు, పలుజన్మములఁ బోని♦కలుషచయము
తే. రామ శ్రీరామ శ్రీరామ♦రామ రామ, రామ శ్రీరామ శ్రీరామ♦రామ రామ
యనుచుస్మరియించినంతనే♦యడఁగిపోవు, రామనామంబుసామాన్య♦మేమహీశ.
మ. ధరణీనాయక ! పెక్కులేల విను శ్ర♦ద్ధం; బూర్వ నష్టాక్షరీ
వగు మంత్రంబునఁ బంచమాక్షరము, శై♦వం బైనపంచాక్షరిన్
స్ఫురితం బైనద్వితీయవర్ణమును దోఁ♦చున్ రామసంజ్ఞం; దద
క్షరవిశ్లేషముచే నపార్థదములై♦ కన్పట్టు నామంత్రముల్. ౮౭
ఆ. "నాఽయనాయ"యనుచు♦ "న శివాయ" యనుచు నా
మంత్రయుగము నిల్చి ♦ మానవేంద్ర
కాదు ముక్తికొఱకుఁ ♦ గాదు శుభంబున
కని విరుద్ధ మైన♦యర్థ మిచ్చు. ౮౮
శా. ఆమంత్రద్వయరాజితార్ణముల స♦న్యోన్యస్థలీసూచకం
బై మాన్యం బయి స్వాంకసంకలితమా ♦ నా "రా" "మ" లున్ లేమిడిం
దా మాహెంపును బాసి నిష్ఫలములౌ ♦ ధాత్రీశ ! కంసే మను
గ్రామంబందును రామమంత్రమును సా♦రం బంచు నూహింపుమా. ౮౯
కం దూరీకృతదురితం బగు, భూరమణా ! "రా" యటంచుఁ♦బూని పలికినం
జేరఁగరానీ దఘమును, వారక "మా" బద్ధ మగుక♦వాటము పగిదిన్. ౯౦
కం ప్రణవసమం బగు నారా,యణ యనఁ దత్సమము రామ ♦ యనుశబ్దంబున్
అణుమాత్రమైన శంకను, గణియింపకు మోక్ష మాత్మఁ♦గాంక్షించినచోన్. ౯౧
కం వినుమ నమస్కరణంబు నమో, యన నగు మత్కృతు లొసర్ప♦నాత్మార్థమురా
మునికొఱకె; శరణ మాతఁడె,యనుచుం బరమార్థతత్త్వ♦మమరుం దాసన్. ౯౨
మ. మనుజాధీశ్వర ! విన్నవాఁడవు గదా♦మంత్రార్థ సారంబు పా
వన మాయర్థము నాత్మలో నిలిపి స♦ర్వప్రక్రియల్ మాధవా
ర్పణబుద్ధిన్ ఘటియించి తత్ఫలములన్♦వాంఛింప కశ్రాంతమున్
వనజాతాయతపత్రనేత్రునిఁ దలం♦పం బ్రాఁతె వైకుంఠమున్. ౯౩
కం. దేహముఁ బ్రోచుచు జనసం, దోహముఁ బ్రోచుచును భక్తి♦దోహలమున లో
శ్రీహరిఁ దలఁచిన నేసం,దేహము మది లేదు లేదు♦దేహం బిట్టపై. ౯౪
న. అనిన ౯౫
ఉ. రాజసవృత్తిఁ దాలిచి ధ♦రాపరిపాలనకర్మశీలురై
తేజము మీఱ లోభమద♦తీవ్రదురాగ్రహకామమత్సరో

ద్వేజితచిత్తు లైనపృథి♦వీపతు లుత్తమసత్త్వ మూని పే
రోజఁ జరింప నెట్టు లది♦యొప్పు మహాత్మ ! యెఱుంగఁ జెప్పవే. ౯౬

కం. తామసరాజసగుణ యుత, భూమీశమనఃప్రదేశ♦ముల నెటు నిల్చున్
నేమమునఁ దద్విరుద్ధగు, నామలసత్త్వంబు నిశ్చ♦లాకృతితోడన్. ౯౭

కం. వెలుఁగుం జీఁకటు లొకచోఁ, బొలుచునె? యన్యోన్యవైర♦మున నొప్పుగుణం
బులు సాత్త్వికతామసములు, బలితంపుఁదమంబు సత్త్వ♦వశమా గెలువన్? ౯౮

వ. అనిన ౯౯

ఆ. మనసు కారణంబు ♦ మానవలోకేశ ! బంధమోక్షములకుఁ ♦ బ్రజల కెల్ల
మనసు గలిగెనేని ♦ మార్గంబు కలుగును, విశదపఱుతు దాని ♦ విధము వినుము.

ఉ. జారథవానురాగగుణ♦సంపద చిత్తము నిండఁ, దానెదో
తీరున గేహకృత్యములఁ ♦ దీర్చుచు సేవగలందు నాత్మసం
సారమునందు భర్తకును ♦ సంతసముల్ సమకూర్చుచున్న యా
జారిణివృత్తిచందమును ♦ సామ్యముగాఁ గనుఁగొమ్ము భూమిపా ! ౧౦౧

కం. గంగాభంగాంతరముల, నంగము సగమొప్పు నిలుచు♦నప్పుడు నాత్మో
ద్ధ్యాంగంబున నుష్ణము నధ, రాంగము శీతలము మదికి♦నగుఁగా తెలియన్. ౧౦౨

కం. ఎంచు నుభయదృగ్గోళము, లం దొకచూ పుంచుకాకి♦యనువున ద్వివిధా
నందంబులందు సొందముఁ, బొందింపఁగ నేర్చు బుధుఁడు♦సొరపడఁ జెపుదుర్. ౧౦౩

మ. తెలియన్ భాషలరెంటి నే నెనఁడు ధా♦త్రిన్ లోకు లవ్వానిచే
యలఁతిం బల్కినఁ దత్తదుక్తులను వాఁ♦ డారెంటియర్థంబు ని
చ్చలు గూఁగా యెఱుఁగంగ నొక్కట; ద్విభా♦షాజ్ఞాన మీ మూత్మకుం
గలదో లేదో విచారశీలి వగుమా ♦ క్ష్మానాథ ! నీ వీమెడన్. ౧౦౪

వ. భవత్సంబంధి యగుజనకుం డిట్టివాఁడుగాఁడే యని యుపదేశించిన దశరథుండతని
సెలవంది సాకేతంబున కరుగుదెంచి సంతతరామనామధ్యాన సమాసక్తచిత్తుండై
యుండె నంతఁ గొంతకాలంబు చన. ౧౦౫

## ** శరదృతువు వర్ణనము. **

ఉ. సారససారసౌరభ, ర♦సాలవికాసవిలాస, కైరవో
దారశరస్మయావహ, ని♦తాంతవనాంతలతాంతసంతతి
స్ఫారసుగంధబంధుర, స్వ♦బాంధుజనాన్వితలోకగేహ మై
శారదవేళ భాసిలె వ♦సంతమునా సుమనఃప్రమోది యై. ౧౦౬

మ. చెలఁగె న్వేణిక సైకతం బొరసి, తోఁ♦చెన్ శోషరేఖావళుల్,
లొల్లసెం గాములు వ్యక్తమై యతనుకే♦ళీపాత్రమై భూజనా
వళికిన్ మోదముగూడఁ జూడ నలస♦త్వం బందె యానంబు, ని
ర్మలసారస్యము గూడె నాపగను లేఁ♦బ్రాయంపుఁజెల్వం బలెన్. ౧౦౭

తే. శారదాఽగమనంబున♦సమ్మదమున, శారదాఽగమ మెంతయు ♦ సంతసించి
భక్తి ధూపంబు లర్పించె♦వాతధూత, నవనిజపరాగపూగకై ♦ తవము మెఱయ.

చం. వికలత లేక తార వెను♦వెంటఁ దగుల్కొన, యామినీవధూ
టికయుఁ జలత్పయోధరత♦టిం గనఁజేయుచుఁ గప్ప నంబరం
బొకటఁ గరాలఁ బట్టి నసి♦తోత్పలినీలలనల్ మృగాంకుఁడుం
దికమికలాడుచు న్నిలక♦తెప్పున నుప్పరపీదిఁ బాఱఁ గొం
చక హసియించె ధాత్రి వికి♦సచ్ఛసంచయకైతవంబునన్. ౧౦౯

తే. మానస మెఱింగి వర్తించు♦మానసౌక, సములచక్రంబు లెఱుఁగుట♦శారదాగ
మనముమనముసఁజను డెంచె♦ఘనజవమునఁ, గ్రౌంచభూధరసుషిరమా♦ర్గంబు వెంట

ఉ. రాణువగట్టివచ్చు నుసు♦రాణువ కింకులు ద్రుంప మంచెపై
త్రాణము గొన్న కాఁపుది తు♦టారముగా నెలుఁగెత్తి తోలినన్
రాణను జౌకళించి వల♦రాయమిటారితుటారి మేల్ జుహూ
రాణము లోలి గుంపులయి♦రా శుకవాణియుఁ జీరు వల్లభున్. ౧౧౧

మ. అతనుం డుజ్జ్వలచాప మెక్కిడియె రో♦షాలంబుఁడై, దేవతా
యతనంబందును దీపకోటి బయలం ♦ దాకాశదీపంబులు
జ్జ్వలనం బయ్యెఁ, బయోధి వెల్వడె రమా♦నాథుండు నిద్రాచ్యుతిం
దత ముల్లాసము భూజనాళి కొదవెన్ ♦ ధాత్రీసమారాధనన్. ౧౧౨

తే. శ్రీకుమారాభ్యుదయ మిలఁ♦జెన్నుమీఱ, రామచంద్రాంకితంబునై♦క్రాల దిశల
సరసకవిశస్తసూక్తుల♦సంపద లొగిఁ, బ్రబలవాసుబ్బరాయన♦వ్యప్రసక్తి. ౧౧౩

కం. కాంతారక కాంతారము, కాంతిన్ రకరకముగాఁగఁ♦గ్రాలె వియోగా
క్రాంతవధూజనతాంతక, కంతుఁడు పైరిజెనో విండ్లు♦గాఁ గొనుకోర్కెన్. ౧౧౪

కం. లలితామలకాగమములు, కలితామలకంబు లైన♦క్రమసరస్సుల్
ఫలితామ్లికనగతతు లస్ఖలితామలకంబుకంఠి♦కాగానంబుల్. ౧౧౫

వ. మనోహరంబులై యొసంగె నట్టి శరత్కాలంబున ౧౧౬

తే. స్వార్జితం బుత్తమంబు పి♦త్రార్జితంబు, మధ్యమముగాన దుర్బలు♦మాడ్కి జనక
దత్త మీనేల నేనేల♦రిత్తకేల, వీరభోజ్యంబు రాజ్యంబు ♦ విదితముగద. ౧౧౭

## దశరథుఁడు దండయాత్ర పోవుట.

వ. అని సూఁయాణంబునకై ప్రయాణభేరిఁ జఱపించి ౧౧౮

కం. లగ్నంబు గదియఁగా హుత, భుగ్నివహమ్ముఁ దనిపి వేల్మిఁ ♦ బోలుపతి రిపు లు
ద్విగ్నులుగాఁగను దమలో, నగ్నిముఖాశీర్వచఃప్ర ♦ హర్షితమతులై. ౧౧౯

కం. అష్టామాత్యులతోడను, స్పష్టాహంకృతిని మనము ♦ పరిఢవిలంగా
నష్టాపదాంశుకులజుఁడు, శిష్టాశీర్యుక్తి నుల్ల ♦ సిల్లుచు నడచెన్. ౧౨౦

కం. ఆజికి నడువఁ దలంచిన, యాజికి రణసవనసోమ ♦ యాజకఁ బురనా
రీజనములు ప్రీతిని నీ, రాజనముల నిచ్చి రపుడు ♦ రాజితభక్తిన్. ౧౨౧

తే. ధగధగద్వరమణిగణ ♦ స్థగిత మగుట, కాంతిపూరంబున మను వి ♦ భ్రాంతిఁ జెందు
తత్పరీమండనాపాంగ ♦ లతలు దోఁచె, వెస మరందర్పశరంబుల ♦ భసలము లన.

ఉ. అత్తఱిఁ దివ్యలోకనస ♦ మాగతనాకసతీమహాత్మస్వాయం
వర్తిదృఢోపగూహనవి ♦ ధానసమాదృతిసంప్రహృష్టలే
ఖోత్తమ "శీఘ్రమేవ భువ ♦ నోత్తరపుణ్యవతీవివాహ సం
పత్తివ సిద్ధిర" స్త్వితిసు ♦ వాక్కులు మ్రింగెను ధాటికార్భటిన్. ౧౨౩

మహాస్రగ్ధర.

స్ఫుటధాటీఘోటకోటీ ♦ స్ఫురదతులఘుటా ♦ స్ఫోటనాస్ఫోటితోర్వీ
తటదూళీపాళి హేళిం ♦ దవిలి యుడుపథో ♦ ద్ఘాటనంబున్ ఘటింపం
బటుతిగ్మత్విట్కులక్ష్మా ♦ పతిబలకృతదు ♦ ర్వారపీడాపిధంబున్
స్ఫుటితంబుం జేయ ధాతం ♦ బుడమి యడుగఁగం ♦ బోయెనో నాఁగనొప్పెన్.

చం. అగపడఁ జొచ్చెఁ బట్టపవ ♦ లందున తారలు; రాక వచ్చె నాఁ
దగెఁ; దలయేరు నెక్కొనెఁ బృ ♦ దాకువరేణ్వున కేది భారముల్,
వగఁ బ్రవహంబు మందగతి ♦ వర్తిలెఁ; నేమివిచిత్రమో యనం
దగి నృపసూతిదిగ్విజయ ♦ ధాటిని వ్యాప్తపరాగశక్తిచేన్. ౧౨౪

మ. ధ్వజవాతూలపరంపరాహతులచే ♦ వా పోయిన ట్లయ్యె ది
గ్ద్విజముల్; వైరికరేణువుల్ విముఖతన్ ♦ భగ్నంబులై తూలె; భూ
భుజపాళుల్ విభుతం దలర్చెను జుమీ ♦ భూమిన్ భయాధీనభూ
భుజనార్యస్రుక్స్రుతశోణికర్దమమునం ♦ బోరామిఁ గోరాటికుల్. ౧౨౫

సీ. తలబరువునఁ గ్రక్క ♦ దల మాన్ప శేషాహి, చేతులు లేమికిఁ ♦ జింతనొందె
నలభయావహఘనా ♦ హవము హేమాద్రిశోఁ, గ్రాలునోయని యెవ ♦ రాహవముఁడు
ఒకకరంబునఁ బట్ట ♦ నోఁ ఱగునో మఱియొండు, దెస సని దిక్కరుల్ ♦ దిగులు చెందె
నడిపీఁపు కడుమిట్ట ♦ యిడఁ బాదు లేదని, నెఱిఁ జెందె లో మొగ ♦ పిఱికి తేఁడు

తే. వరపదాతిపదాహతి ♦ నడివడంక, ధరణిభరణకిరణహతి♦పసులు పరులు
వోలెఁ దహతహలాడిరి ♦ పుడమిఁగలదె, ధారణీనాయకునిజైత్ర♦ధాటి సాటి. ౧౨౭

సీ. నవకంపుబుక్కా_ము♦సవురుదాల్చెనుమింట, నృపుధాటిఁబరికించు♦ నెలఁతలకును
బెట్టనినునుబూది ♦ పట్టెలై కనుపట్టు, వైరికాంతాముఖ♦వ్రాతములను
జెంగావిరంగారు ♦ రింగుల్సెలంగిన, కంగోరు లయ్యె ది♦శాంగనలకుఁ
దారాడునదనేదిఁ ♦ దారాడకున్నను, గోరాడుటయ్యె ది♦క్కుంభులకును
తే. దిగ్జయారంభవేళ ధా♦త్రీతలేంద్ర, సమ్యగర్పితభూపపుం♦జంబు లయ్యె
విష్ణుపగమున కవనీశ♦విపులసైన్య, ఘట్టనోత్థితభూపరా♦గంబు లపుడు. ౧౨౮

వ ఇట్లు చనిచని నీవాఁడ నన్ను రేఁచుల పోఁడిమి మాపక సూడున నెదిరిన వేఁడిమి
చూపి తేఁజిల్లుచుఁ జనుచు ౧౨౯

ఉ. కోరిఁకసు కొల్లలం గొనఁగఁ ♦ గోరిఁకసు ప్రాగ్రహదాహ మేయెడం
గోరిఁకసు రక్తహింసలిడఁ ♦ గోమలులం జెఱవెట్టఁ గయ్యెడ
న్నేరె జగత్త్రయీజనమ♦నోవితతాద్భుతహేతుభీకరో
దారభుజాబలం బరివి♦తానముమీఁద నె చూప నాజలోన్. ౧౩౦

చం. ధరణిపుఁ జూచిచూచి విబు♦ధప్రముదల్ మదనాశుగాహతిం
బొరిఁబొరి స్రుక్కుచుందురు వి♦భుండు దిశాజయధాటి వోవ స
గరమున వానిఁ దాఁకునృప♦కాండముల న్వరియింపఁ జొచ్చి రౌ,
స్మరశరపశ్యచిత్త లగు♦మానిక దారుల కేటికూరుముల్? ౧౩౧

కం. కుంతలవల్లభసురుచిర, కుంతలదీధితులు వెలసెఁ ♦ గోసలధరణీ
కాంతపదాంబుజసక్త, స్వాంతనటన్మధుకరాళు ♦ లై యయ్యెడలన్. ౧౩౨

కం. స్వబలము పలాయనంబై, న బటాబూరంబు చెడి వ♦నంబులఁ బడుటన్
శబరాధీశున కప్పుడు, శబరాధిశత్వ మవని ♦ శాశ్వత మయ్యెన్. ౧౩౩

ఆ. నే వరాటకాఖ్య♦నెగడుదుఁ బ్రజ మాన, మునను నను గణించు♦మొదల నీదు
కరుణ కలిగెనేని♦గాంగేయ సమముగాఁ, దూఁగఁగలనునన్నుఁ♦ద్రోయవలదు. ౧౩౪

వ. అనిన నతని నాదరించె నంతి నొక్కపెట్ట రాపట్టు లందఱపై దాడి వెట్టుటనీతిగామి
శక్తుఁ డయ్యును బ్రాజ్ఞుం డగునద్ధరారమణుం డొక్కొక తేప నొక్కొక్కదిశ
భూపతులన్ జయింపఁ బోవుచుఁ బ్రాధ్వంకృతసమస్తరాజన్యుండై విహరించు
చుండ నొకనాఁడు సుమంత్రుండు ౧౩౫

కం ఇది దక్షిణకోసల బల, మదమున భూభుజుఁడు భాను♦మంతుం డేలున్
ముదమున నతివచించిన, మదిరాక్షికి జనకుఁ డితఁడు ♦ మహీపా! యనుచున్.

చం. అనినను లెస్సగాక బల ♦ మంతట నంతట నిల్పఁ బంపు చే
కొనకుము యుద్ధకృత్యములు ♦ గొబ్బునఁ బాళెము నేద దీర్పుకోఁ
బనుపుము మంత్రులం బిలిచి ♦ భావన సేయుఁడ మెల్లకార్యముల్
మనమున నంచుఁ బల్కిన సు♦మంత్రుఁడు పిల్వఁగఁ బంచె మంత్రులన్. ౧౩౭

వ. వార లరుగుదెంచి సర్వంబు విని వసిష్ఠాదు లైన పెద్దలతోడ నాలోచించి సందే
శంబుపుచ్చుట లెస్స యన నట్లకాక యని వారిలం బోవఁ బనిచి నిజపటకుటీరా
భ్యంతరమునకుం జని వసిష్ఠు ధ్యానించిన నతండు విచ్చేయుటయు నమస్కరించి
నిజమనోగతం బెఱుంగఁ జెప్పి యిట్లనియె ౧౩౮

ఉ. ఆలలనాభిరూప్యఁ భ♦వామలశీలకథాసువర్ణముం
జాలఁగ నించుచున్ శ్రవణ♦శష్కులిపాత్రి నిరుంతచింతెనా
తూలిక నంతరాళమునఁ ♦ దొయ్యలి మానసచిత్రికాగుఁ జా
ర్యా! లిఖియింపఁ గన్నులు య♦థార్థ మెఱుంగఁ గఁ గోరెడుం గడున్. ౧౩౯

వ. అని పచియింపుచుటయు నతండు భావి భావించి యట్ల కావించెద నీ వీసాయంతెన
సమయంబున నిచ్చటి కనతిదూరంబునఁ జక్కటిపొదుపుమూలచాయ నరుగుమం
దొక ప్రమదవనంబు గల దందు సీనయునపర్వం బగు నని పల్కియదృశ్యుండయ్యె
నంత దశరథుండును గల్పప్రాయంబులుగఁ దోఁచుక్షణంబుల నెట్టెటో కడపుచు
నేఁడేల సూర్యుండు మందగమనుం డయ్యెనని యెంచుచు సాయంసమయంబగుడు
ముని నిర్దిష్టమార్గంబునం జని ప్రమదావనంబుఁ జొచ్చుడు. ౧౪౦

చం. తరుణకుసుంభవర్ణపరి♦ధాననిబద్ధకటప్రదేశయై
తరుణి నిజాంశుకాంచలము ♦ తా నిటులట్టులుఁ దూఁగియాడ సిం
ధురగమనంబు దోఁపఁ జను♦దోయి మిథోధికకర్షణంబునన్
సరములరాల్ప మౌక్తికక♦జం బుసదెంచుచునుండఁ గన్గొనెన్. ౧౪౧

వ. ఇట్లు చూచి మెచ్చి తలయూఁచి తత్క్రీడావినోదావలోకనకౌతూహలియై యుప
దాంతరనికుంజపుంజంబులమాటున డాఁగి యుండె నని శుక యోగి పరీక్షిన్నృపా
గ్రణి కెఱిఁగించిన తెఱంగు ౧౪౨

ఉ. వా(స)వరత్న మేచకసు♦వర్ణ! సువర్ణపటా! పరాత్పరా!
వాసవపుత్రసింహశర♦భా! శరభాసితహస్తపుష్కరా!
వాసరరత్నవంశ్య! ప్రతి♦భాప్రతిభాసిత! భద్రభూధరా
వాస! రఘూత్తమా! ప్లవగ♦వల్లభవల్లభ! జానకీశ్వరా! ౧౪౩

## పంచచామరము.

ర(మా)మనోహరా! నగాధి♦రాజనందనార్చితా!
రుమామనోహరాత్మమిత్ర! ♦ రుంద్రకీర్తిశోభితా!
సుమాంబకోపమానరూప! ♦ సూర్యవంశదీపకా!
సమస్తదేవశస్త! భద్ర♦శైలరాజమందిరా! ౧౪౪

## గద్యము.

ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిందాయమానమానసత్వ
మహావైభవ వానిలికొలను రామచంద్రరాయతనూభవ
సుజనవిధేయ సుబ్బరాయనామధేయ ప్రణీతంబైన
శ్రీ కౌసల్యాపరిణయంబున
ద్వితీయాశ్వాసము.

శ్రీరామచంద్రార్పణమస్తు.

శ్రీరామచంద్రాయనమః.

# శ్రీ కౌ స ల్యా ప రి ణ య ము.



## తృ తీ యా శ్వా స ము.

యమిసవనత్రాణప
రాయణ! దీనార్తిహరణ ♦ రాజాభరణా!
ధీయుతనుతచరణా! నా
రాయణ! నతశరణ! వినత♦రాజాభరణా! ౧

తే. అవధరింపుము దేవ! మ♦హానుభావ, భావనాతీతవైభవ♦పరమయోగ
భావపుంభావకరుణాస్వ♦భావుఁడైన, బాదరాయణి యిట్లను ♦ సాదరముగ. ౨

మ. అతనుద్వేషితమిత్రసార్థకనిజా♦ఖ్యాతుండు భాషావధూ
న్నతవక్షోరుహచందనాయితదిశా♦నాఽడ్యముక్తావళీ
కృతగంగాధవశేఖరాయితసుర♦గేయప్రథాశాలి యో
క్షితిపా! దక్షిణకోసలాధిపతి మిం♦చెన్ భానుమంతుం డనన్. 3

తే. అతనిదేవేరి జితకుసు♦మాస్త్రనారి, దీనజనకల్పవల్లి సా♦ధ్వీమతల్లి
యధరజితబింబ లసిత♦ఫాలాపహసిత, చంద్రభాగ యనఁ దగుఁ♦చంద్రభాగ. ౪

-చంద్రభాగ భానుమంతునితోఁ దనసంతానవాంఛఁ దెలుపుట.-

ఉ. ఆవరవర్ణినీసహితుఁ♦డై హితగీతిని బెద్దకాల మా
భావభవాభరూపుఁ డను♦భావ్యమనోభవకేళికావినో
దావహమానసుండయి ని♦రంతర సంసరణైకభోగ్యసౌ
ఖ్యావహపుత్రలాభజని♦తామలమోదముఁ దా నెఱుంగమిన్. ౫

ఉ. దానముచేసి, చేసి యవ♦ధానమునన్ ధరఁ బాలనన్, హరిన్
ధ్యానము చేసిచేసి, సువి♦ధానము దప్పక యజ్ఞకోటులం
దానమరాళిఁ గొల్చి, పరి♦ధానము లర్థుల కిచ్చి యిచ్చి, సం
తానముఁ గాన కెన్నిసువి♦ధానముల న్మదిఁ జింతసేయుచున్. ౬

ఉ. ఆవిభుఁ డొక్కనాఁడు కన♦కాంచితసౌధవితానసీమ మో
దావహమాలికాసురభి♦తామితమార్దవహంసతూలికా
భావితతల్పమందుఁ బరి♦భావితవాసవభోగభాగ్యుఁడై
శ్రీవెలయ న్విహింపఁ బతి♦చిత్త మెఱుంగుచుఁ జంద్రభాగయున్. ౭

ఉ. దీనత దోఁపఁ బల్కె సుద♦తీమదనా! మదనాగమం బనూ
చానులమై గ్రహించి నెఱ♦జాణతనంబున మీఱినార మే
లా? నిరతంబు నుల్లమున ♦ హాయి జనింపమి నేవగించెదన్
మానవలోకనాథ! విను♦మా గనుమా ఘనమానసంబునన్. ౮

ఉ. వల్లభ! నేఁటిదాఁక రతి♦వల్లభుక్రీడలఁ గూడు టెల్ల నా
యుల్లమునందు వ్యర్థ మని♦ యూహ యొనర్చెద; నట్లయౌఁ గదా
పెల్లగు వేడ్క మొల్కకొలెఁ ♦ బెంచి శ్రమింప ఫలాభికాంక్షచే
సల్లలితాననీజ మరు♦సం బొనగూర్చునె గొడ్డు వోయినన్. ౯

ఉ. ఆవిధి సంభవించె వసు♦ధాధిపచంద్రమ! నాదుచందమున్
భావన సేయఁ బెంపెసఁగు♦భావజుకేళిని దేలు టెల్ల శో
కావహమయ్యెఁ జిత్తమున ♦ హర్ష మొకింతయు లేక, వంశముం
గావఁగ వ్రేలెఁ డంతమొల♦కం గనుపుణ్యము లేమి వల్లభా. ౧౦

ఉ. ఆటలఁ గొన్నినాళ్లు, తన♦యావళిఁ గాంచుటెల్లఁ బెద్దజం
జాట మటంచుఁ గొన్నిదివ♦సంబులుఁ బుచ్చితిఁగాని పిమ్మటన్
సాటివధూటికామణులు ♦ చంకలబిడ్డల ముద్దులాడ నా
రాటము సిగ్గు దోఁచెను ధ♦రావర! వంజతనంబుఁ జూచినన్. ౧౧

ఉ. సిగ్గునఁ గొన్ని నాళ్లు, తమి♦చేతను గొన్నిదినాలు, చింతచే
మ్రగ్గుచుఁ గొన్ని నాళ్లు, నవ♦మానభరంబునఁ గుంది కొన్ని నా
ళ్ళగ్గతిఁ బోవ, లోన సర్మి♦యించితి, నావలఁ బూజ సేసితిన్
సిగ్గఱి బాహిరంబుగనె ♦ శ్రీతరుణీచరణాంబుజాతముల్. ౧౨

కం. కుడువను గట్టను గలిగియు, బుడుతల ముద్దాడుభాగ్య♦మును లేమి నయో
యడవిని గాచిన వెన్నెల,వడు వాయెను నాదుబ్రతుకుఁ ♦ బరికింపఁ బతీ. ౧౩

సీ. చంటిపాపలనునుఁ♦బంటినొక్కులు లేని, కుచములు కుచములే ♦ కువలయేశ!
యనువుగాఁ దనకూన ♦ లాడఁ జూడనియట్టి, కన్నులు కన్నులే ♦ సన్నుతాంగ!
తప్పడుగులవచ్చు♦నప్పాప నెత్తని, చేతులు చేతులే ♦ పూతచరిత!
తొక్కుఁబల్కులబిడ్డ ♦ నొక్కిముద్దాడని, పెదవులు పెదవులే ♦ మదనరూప!

ఆ. బొరసాఁచికొనుచుఁ ♦ బైపడి మెడఁగ్రుచ్చి, మీఁదికెగయఁ బ్రాఁకి ♦ మేలిపలుకు
లొనరఁ బైఁటఁ జార్చి ♦ చను వేఁడు సుతు లేని, సుదతి బ్రతుకు బ్రతుకె ♦ సుందరాంగ!

చం. నిరుపమరాగయుక్తుఁ బతి ♦ నిన్, గుణవంతుల నాత్మజాతులం
దరుణులు గోరుచుండుదురు ♦ ధన్యుని బొంది నిను న్మదీప్సితం
బరయ నొకండు సాగె, మఱి ♦ యవ్యయసౌఖ్యనిదానసూనులా
భరమ లభింపమిన్ మనుట ♦ వ్యర్థము దోఁచెను నాకుఁ జూడఁగన్. ౧౫

చం. అనుచును విన్నఁబాటు వద ♦ నాబ్జము ముంపఁగఁ జంద్రభాగ ప
ల్కిన విని చేరరాఁ దిగిచి ♦ కేలను దన్వి! భవద్విచారమో
యనుపమభవ్యమౌఁ జుమి, ల ♦ దర్థ మపేక్షిత మౌట దానికై
పనిగొని సత్ప్రియత్నముల ♦ వారక చేసితి నెన్ని యేనియున్. ౧౬

ఉ. చేసితిఁ బెక్కుజన్నములఁ ♦ జేసితి నెన్నియొ సద్వ్రతంబులం
జేసితి భూరిదానములఁ ♦ జేర్చితిఁ జిత్తమునందు వెన్నునిన్
గాసియ కాని వేఱొకటి ♦ గానఁ జుమీ ఫలితంబు సర్వమున్
వీసరవోయె నాయెడను ♦ వెన్నునకు న్దయ లేమి నంగనా! ౧౭

కం. కాన నతకల్పకం బగుఁ, గాన రమారమణుఁ గూర్చి ♦ కాన నియతినై
బూనెదఁ దపంబు; శీతరు, గానన! యిట నీవు సలుపు ♦ మా హరిపూజల్. ౧౮

చం. అని హృదయేశుఁ డాడిన ప్రి ♦ యాప్రియవాక్యము లాలకించి యా
వనజదళాక్షి పల్కె నను ♦ బాసి చనం దగ నౌనె కాన? కో
యనఘ! స్వధర్మకామముల ♦ "నాతిచరామి" యటంచుఁ బల్కవే?
గాన మధికంబు గాదె కవ ♦ గూడి తపం బొనరింప దంపతుల్? ౧౯

చం. ప్రియ యిటు లాడ మే లనుచుఁ ♦ బిల్చి యమాత్యులనెల్ల సర్వముం
బ్రియమునఁ జెప్పి రాజ్యము స ♦ మేధితరక్తిని నప్పగించి భా
ర్యయుఁ దనవెంట రాఁ జని య ♦ రణ్యముఁ జేరి శుచిస్థలంబునం
దయగతిచే జితేంద్రియత ♦ నాలు మగండుఁ దదేకభక్తిమై. ౨౦

*భానుమంతుని తపస్సునకు మెచ్చి విష్ణువు వరంబులిచ్చుట.*

చం. చలిపిన ఘోర మాతపము ♦ సంతసమంది రమామనోహరుం
డలరుచు భార్గవీసహితుఁ ♦ డై భవదీప్సిత మెద్ది వేఁడుఁడీ
ఫలితము సేయువార మన ♦ భక్తి నమస్కృతు లాచరించుచుం
గలితనిటాలహస్తపుట ♦ కంజముల న్నృపచంద్రుఁ డిట్లనున్. ౨౧

కం. దేవా! ప్రత్యక్షంబై, కావలసిన దెద్ది యనఁగఁ ♦ గామ్యము వేఁడన్
మావంటి వెడఁగు లీయిల, పై వెదకినఁ గలరె యైనఁ ♦ బంకజనాభా! ౨౨

శా. సంతానార్థముగాఁగ నిన్గొలిచి వి♦శ్వస్తుత్య! యీనిష్ఫలం
గాంతాయుక్తుఁడనై ఘటించితిని ని♦ష్కాముండ నౌ టెట్లు? శ్రీ
కాంతా! నిన్నని తుచ్ఛకామ్యముల వే♦డ్కం గోరఁగా నొల్ల నా
కాంతారత్నమునం దనూభవుఁడవై ♦ కారుణ్యముం జూపవే. ౨౩

కం. అటులైన నిహపరంబులఁ, బటుతరముగఁ బొందఁగలను ♦ బద్మాక్ష! భవ
త్స్ఫుటకారుణ్యము పేర్మిని, ఘటియింపుము నాదుకోర్కె♦గాదనక వెసన్. ౨౪

చం. అన విని పిన్ననవ్వు దొలఁ♦కాడఁగ భూభుజుఁ జూచి పల్కె నా
యన! భవదీయపుత్రకుఁడ♦నై జనియింపఁగ రాదు నాకు, నీ
తనయకు నాత్మజుండ నయి ♦ తథ్యము నీకు శుభంబుఁ గూర్తు, నం
దను ననుఁ గోరివాఁడవు గ♦దా జనియించును నీకుఁ బుత్రుఁడున్. ౨౫

వ. అని యంతర్ధానం బయినఁ దదీయకరుణావిశేషంబున కచ్చెరు వందుచు వారు
పురంబునకుం జని రంత వరప్రభావంబునఁ జంద్రభాగకు నెలమసలుటయు. ౨౬

కం. బలిసెను నడు మలసెను నడ, నెలసెను నూఁగారు మీఁ ♦ దేవి ల్లోకసై
గలసెను వళు లొలసెను నిదు, రెలు మనుపయి నాస సతికి ♦ రహియించెనటన్.

కం. కోకనదచారువదనము, ప్రాకటననననపరాగ♦రాజిత మగు శ్రీ
కోకనదం బన ధవళ, శ్రీకలితం బయ్యె గర్భ♦చిహ్నము దోఁపన్. ౨౮

## కౌసల్యాదేవి జననము.

వ. ఇట్లు నెల లంతకంతకు నెక్కుటయు రాజానన వైజననంబున నొక్కతనయునొక్క
తెఁ దనయఁ గాంచినఁ దద్వృత్తాంతంబున కలరి నృపుం డుత్సవంబు సేయించి
యమితోత్సాహంబునఁ బొదలుచుఁ బుత్రునకు భామమంతుం డనియుఁ గూఁతు
నకుఁ గౌసల్య యనియు నామకరణంబులు గావించి సంతోషాంబునిధి నోలలాడు
చుండె నంత నక్కౌసల్యయు దినదినప్రవర్ధమానయ్యె. ౨౯

మ. తనతో నాడెడితోడిబాల యొకచే♦తం బుండరీకంబు నొ
య్యనఁ దాల్పంగఁ బసిండిబొమ్మ యల క♦న్యారత్న మవ్వేళ దా
సిని బంగారపుఁదమ్మిఁ దె మ్మనఁగ సు♦శ్వేతాంబుజం బొండుఁ గై
కొని చేనియ్యఁ దటాలున న్మదినిం బొం♦గుం బూరితేచ్ఛంబలెన్. ౩౦

వ. ఇ ట్లబ్బాలామణి కన్యాత్వంబు గడచిన. ౩౧

మ. నవలావణ్యరసాభిషేచనవిధి ♦ న్వక్త్రాబ్జ మింపొంద సొం
పవువక్షోరుహమంజరుల్ మలఁపుచూ♦పన్ వాతెఱన్బింబముం
దవులంగాఁ దనురక్తిమంబు నయనాం♦తప్రేక్షణేందిందిరా

రవిహారం బొలయన్ మనోజ్ఞనవసౌ♦రభ్యం బుపాసింప హృ
ద్భవనామోదము మీఱఁ బ్రాయ మనను♦ద్యానంబు పుష్పించినన్. ౩౨

మ. వలరాయం డలసీరుపాయ మను భ♦వ్యం బైనకాలంబునన్
లలనాదేహగృహప్రవేశమును జ♦ల్పం డెంకిఁ గై సేయుత్రో
వలు సయ్యోన్ మణిగాసనంబు నవలా♦వణ్యంబుగాఁ, బైఁడిపుం
డలుగా వత్సరుహంబులుం, గలువదం♦డల్ గాఁ గటాక్షావళుల్. ౩౩

కం. పొడమెను గుటిలత చూపుల, ముడి కందనికురులు పాద♦ముల నటియించెన్
నిడు పయ్యె నంగదట్టము, నడుమంతరమందుఁ జిక్కె ♦ నడుమంతరమే. ౩౪

మ. జనయిత్రీచరణాభివందనము వాం♦ఛం జల్పి యేతెంచునం
తనె యాయాసభరశ్రమాలసత స్వే♦దం బూరె రక్తాబ్జఖే
లనజాతారుణిమంబు పాణి నిడె బా♦లా! పాయదే యంచుఁ దాఁ
గనఁగాఁ జేయు సకిన్ సతీమణియు వే♦డ్కం బాణిరక్తాబ్జమున్. ౩౫

వ. ఇట్లజ్ఞాతయౌవనయై చరించుచున్నచంచలాక్షికి వివాహంబు గావింపఁదగినమనువు విచారించుచు. ౩౬

*భానుమంతుఁడు కౌసల్యకు మనువు విచారించుట*

ఉ. అన్నృపుఁ డొక్కనాఁడు విన♦యజ్ఞనయజ్ఞులు మంత్రు లోలి దు
ర్మానవిహీనవిజ్ఞజన♦మాన్యవివేకులు ప్రాడ్వివాకులున్
జ్ఞానవిశిష్టశిష్టులు మ♦నంబున భక్తిని గొల్వఁ గొల్వులో
మానితరీతిభవ్యగరి♦మన్ రహిమించి చెలంగుచుండఁగన్. ౩౭

తే. రాజకీయక్రియావిచా♦రంబు దీర
వివిధవార్తాప్రసంగంబు ♦ విస్తరిల్లఁ
దనదుకూఁతురు కౌసల్య♦కు నుచితంపు
మనువు నెమకంగఁ దలఁచి యా♦మనుజవిభుఁడు. ౩౮

వ. సకలదేశాధీశగుణాగుణబలాబలంబులు విచారించుచున్నతఱి దౌవారికుం డత్రిరాక విన్నవించుటయు. ౩౯

*అత్రి భానుమంతుం జూడవచ్చుట.*

తే. అరిగి యెదురుగ నర్ఘ్యపా♦ద్యాదివిధులఁ, బూజనముసల్పి కొలువంగ♦భూజనంబు
లోనికిని దెచ్చి యాసనా♦సీనుఁ జేసి, భక్తితాత్పర్య మెసఁగఁగఁ♦బలికె నిట్లు. ౪౦

తే. క్రూరదుర్వారసంసార♦ఘోరసంత, మసగహనసీమ బంభ్రమ్య♦మాణులైన
మాదృశుల్ దరియింపఁగ♦మార్గమున్నె, మీకృపాపాంగదీధితుల్ ♦సోఁకకున్న? ౪౧

వ. నిరంతర నారాయణనామపారాయణపరాయణులును నిష్కారణకరుణాతురాయణులు నగుతా రిచ్చోనిచ్చేయుట నాయిచ్చఁగలకచ్చులు గడతేఱె ధన్యుండనైతి నని యచ్చపుభక్తి విన్నవించి కుశలప్రశ్నంబు గావించి స్వాగతకారణం బడుగుటయు మచ్చిక మీఱ మునివరుం డిట్లనియె. ౪౨

కం. నీబోఁటి నేలనేలఁగ, మాబోఁటుల కేమికొదవ♦మానవనాథా!
రేబోటిమగఁడు వెలుగంగాఁ బాటిలదే చకోర♦కములకు ముదముల్? ౪౩

చం. కొదవలు లేవు మాకు నృప♦కుంజర! సుమ్ము తమంతఁ దారునై
వదలక వెల్లిగాక కల♦వస్తువులన్నియునుర్భ భవాదృశుల్
ముదమునఁ గూర్చుచుండుటను ♦ మోదమ మాకుఁ, దపస్సు లెస్స, మా
కదుపులు మేల, నిర్భయము♦కాననము ల్వనముల్ ఫలీద్యముల్. ౪౪

కం. నీసేమ మరయ వచ్చితి, భాసురరవితేజ! యనిన ♦ బద్ధాంజలియై
కోసలవల్లభుఁ డనె నీ,దాసుఁడు మీదర్శనమున ♦ ధన్యుం డయ్యెన్. ౪౫

కం. నాపుత్త్రిక మునినాథ! స్వ,భూపుత్త్రసమానుఁడైన♦భూనాథున కే
నీపట్ల నీయఁ దలఁచెద, నీపనిచినయట్ల చెప్పుమ ♦ నిస్తులు నొకనిన్. ౪౬

వ. చరాచరంబుల మీమనోగోచరంబు గానిపరమాణువు లేదు. దయావంతులరై యెఱిఁగింపరే యని కౌసల్యను రావించి మ్రొక్కించిన నాశీర్వదించి. ౪౭

కం. ఆకూతం బెఱిఁగించెద, సాకేతం బేలునట్టి♦జనలోకధవుం
డీకాతరనయనకుఁ దగు, లోకోత్తరచరితుఁ డతఁడు ♦ లోకారాధ్యా! ౪౮

వ. అతనిపురం బైనయయోధ్య మహిమంబును దశరథుబలరూపవిభవంబులు నీవెఱింగియుండు వైనను నిట్టికార్యంబులపట్ల వరునిగుణాగుణంబు లంద తెలియంగుట దగు నందు నీబాలారత్నంబు మదినెఱుంగు టావశ్యకంబు గావున విశదీకరించెద విను మని యిట్లనియె. ౪౯

## అయోధ్యాపురవర్ణము

కం. చటులభటాకుటిల ఘటా,పటలరటనదళితదిగ్వి♦భాగ మయోధ్యా
పుటభేదన మరిజనహృ,త్పుటభేదన మమరు నమర♦పురికిన్ సరియై. ౫౦

సీ. వీటులా చక్కని♦బాటలా కొమరైన, పేటలా పురలక్ష్మి♦పేట లగుచుఁ
దోఁటలా శృంగార♦వాటులా రొదసేయు. తేఁటులా సరసులు ♦ దేటలొలుక
లేటులా చివుకను♦దాఁటులా కడిమిడి, చోటులా చేగట్టు♦పేటులందు
బోటులా వారల♦నీటులా ముద్దుల, మాటలా సొంపుల♦మూట లగుచుఁ
తే. బాటలా వారియాటలా ♦ దీటులేని, కోటలా జాలమేటులై ♦ యోటలేని
ధాటినాఘోటులా ద్విజ♦కోటు లెన్నఁ, బోటిగనరామి నవ్వీటి♦సాటిగలదె! ౫౧

కం. ప్రామినుకుల పెన్నిక్కలు, ప్రామినుకులవేల్పులేమ ♦ రంగస్థలముల్
భూమిసురజ్యేష్ఠులవా, ల్భూమి సురజ్యేష్ఠసములు ♦ పురమున విప్రుల్. ౫౨

చం. అపుర సహస్రశీర్షుఁ డగు♦నాదిఫణీంద్రుఁడు భాషలందు వె
య్యావ దగుపాలు నాలుగవ♦యంశముఁ బూర్ణకళాఢ్యుఁ డౌకళా
ధరుఁడును బోలుచుంద్రు వసు♦ధాబుధులన్; ద్విజరాజనామముం
త్రవశమె వారిఁబోల ద్విజ♦రాజసమాఖ్యము లేదె పక్షికిన్. ౫౩

సీ. కృతులిచ్చినను బహూ♦కృతులిచ్చుచుందురు, నతియొనర్చినమహా♦న్నతిఘటింత్రు
నెలిచవి యన్నను ♦ వెలిమాలపనియంద్రు, ప్రజలనెల్లను దమ♦ప్రజలెయంద్రు
దర్పచేఁ జెలఁ బొప్ప ♦ దర్పణిఁ జూడరు, స్వారి పోవఁగ జారి♦ణీరతేచ్ఛ
నాడిబొంకరు వేఁడ ♦ నాస్తి యంచాడరు, దుష్టులఁ గాఁ బొత్తుఁ ♦ దొలఁగియుందు
తే. రాజ నెదిరిన వీరారి♦రాజవరులు, రణపదమునను శమలంపు ♦ గణనమీఱ
నొంకువర్ణంబు మునుచెప్ప♦కుండవిడరు, వెలయునవ్వీటిలో రాచ♦కొలమువారు.

ఉ. మేకొని వేలనేకడఁగి ♦ మీఱఁగ నేరఁ, డొసంగి యప్పులం
గైకొనలేఁడుగా ఘనులు ♦ గ్రమ్మఱ నీయక యున్న, మెండువో
కూఁక లటంచు నర్యవర♦కోటులు కంధి జడాశయుండు ర
త్నాకరుఁడే? యటంద్రుపయి ♦ నప్పతియై కనుచుండ భంగముల్. ౫౫

సీ. కేదారముల నెల్ల ♦ భూదారములచేతఁ, గేదారములఁ జేసి ♦ కీర్తి వెలయ
రాజనంబులు వేఁడ ♦ భోజనంబుల కిచ్చి, రాజసంబుల నిష్క♦రాజు లొసఁగి
కోటీశహస్తులై ♦ కోటీశు లౌచుఁ గి, రాటేశులకు నప్పు ♦ పూఁటవడక
పాటీరపంకంబె ♦ పాటీరపంకంబు, శాటీరమ వరాశి♦సంచయంబు
తే. గాఁగ మాలుగుఁబోతులై ♦ కడఁక చెడక, రాలుగాయతనంబున ♦ రచ్చకెక్క
కఖిలకృషికార్యములను స్వ♦యముగఁ దీర్చి, శ్రీలఁ జెన్నారుహాలిక♦పాళియచట.

మ. ఘనవిఖ్యాతిని గాంచి యుండినను ద్రా♦గన్ క్షారనీరంబులే
మనకున్ దాపుర మయ్యె నంచు మదిఁ బ♦ల్మాఱాడుచు న్మబ్బు లీ
వనము ల్దిపి నెసంగె నేఁడు బళిరా ♦ ప్రాప్తంబు మే లంచు జీ
వనదోజ్జీవనదంబు లై నపరిఖా♦వాఃపూరముల్ గ్రోలెడున్. ౫౭

చం. నిరుపమదానధార నవ♦నీరజముం బొడవాప సర్వముం
జరణములందు మేఘమును ♦ సాగరి మాత్రవణాంతికంబునం
దిరపుకొనంగ సిగ్గున మ♦దేభసమూహము లొప్పమీఱఁగాఁ
బురజనతావదాన్యగుణ♦ము న్వినుతింప వశంబె యేరికిన్? ౫౮

ఆ. సప్తసప్తిగుప్త♦సప్తసప్తిరథంబు, మునుఁగు దాఁటలేక♦వనధి నొంచు
ననుచు నగుచు సప్త♦వనధుల దాఁటుట, సప్తినామ మొందె ♦ జగతి హరులు.

కం హరిహయహయ హరిహయరథ
హరిహయముల జవనగరిమ ♦ నదటున గెలువన్
హరిహయ హరిహయరథహయ
హరిజిత్వరలీల నెసఁగు♦హరు లాపురిలోన్. ౬౦

మ. గమనం బొక్కవిధంబ, చిత్రగతులం♦గాన్పింపఁగా లేఁడు, వే
గ మనన్ జాములునాల్గు దోలుఁను జుమీ ♦ కంజాపుదవ్వన్, నిజాం
గ మనం బిచ్చకకుంటు, శాత్రవులుదాఁ♦కం దేరి వేత్రోయు శృం
గమునందుండి పయోధి నంచు నగుదున్♦కుత్తిల్ రవిప్రాజితన్. ౬౧

చం. సురపురసాలముం దవిలి ♦ చుంబనకేళిని దేల్చుచుండు నా
పురవరసాలము న్నిపుల♦పూగము లెక్కుడు వేల్పుటాండ్రతో
సరసులపజ్జఁ గ్రొంజిగురు♦సజ్జలఁ బూవుల సెజ్జనాకముం
దరియఁగఁ దాపయాఁ బునను♦శెల్లి సాల ము టుంచుఁ బల్కెడిన్. ౬౨

ఉ. గీరథప్రభావుఁడు భ♦గీరథుఁ డుర్వికిఁ దెచ్చె నభ్రిభా
గీరథిఁ జిత్రమా? తలఁప ♦ గీరథయాన లహర్ముఖంబులన్
సారతరాంజనైణసుద♦చర్చల వాచ్చలుచోన నాడ జం
భారి విభాకరాత్మభవ♦నాకము నేగతిఁ జేరెనో యనన్ ౬౩

చం. లలనలకన్నుసన్నల మె♦లంగు ననంగుఁ డనంగ నేలొకో
యలయక వాడవాడ ముస♦నమ్ముల నమ్మచునుండు నెచ్చెలుల్
గలయఁ బ్రదక్షిణించు ఝష♦లాంఛనునారులు గల్గునారులుం
దలముగ మారుమావుల న♦వల్చెడిసాంకవగంధు లొప్పఁగన్. ౬౪

ఉ. గీతనినాదపూరితని♦కేతనకేతనజాత మారా! సా
కేతము డాయ వచ్చు సుర♦కిన్నరముఖ్యుల దూరయానసం
జాతమహాశ్రమంబు సనఁ ♦ జల్లఁగ వీచు ననంగఁ దత్పురీ
పూతజనాళియయ్యతిథి♦పూజల మేర లెఱుంగ శక్యమే. ౬౫

చం. ఘనకురువిందవజ్రమణి♦కాండముల న్విలసిల్లుగోడల
న్గొన బగుమేడలం దిరుగుఁ♦గోమలు లావల నత్తలిండ్లకుం
జని యట రేల నిర్లు గని ♦ చయ్యనఁ దర్జని మోపి ముక్కునన్
గస మిది మాపురంబున న♦నంగ నెగాదిగఁ జూతు రజ్జనుల్. ౬౬

చం. రస వగగ్రాలఁ జాల మగ♦రాల్ మొగరాలనిగారవుంబసల్
పొసఁగఁగఁ గ్రొంబసిండినును♦బొమ్మలు బొమ్మలఁ బొమ్ముపొమ్మనన్

వెస జవరాండ్రపాట విను♦వేడుకఁ జేరెడి వేల్పుఁగొమ్మలం;
గొసరుచు వారు పాట విని♦గొబ్బున బొమ్మలె యాడు రచ్చటన్. ౬౭

ఉ. శ్రీలసితానిమేషకబ♦రీమతులుర్ లలితోరగాంగనల్
లోలవిలోకనాభినయ♦లోపమునర్ వరనర్తనంబున
న్గాలుపదద్వయీకలిత♦రమ్యవిలాసవిహారహీనతర్
బాలిశ లంచు రెంట నుతి♦పాత్రలు పాత్రలు వోల్తు రప్పురిన్. ౬౮

ఉ. సారణగండ్లనుండి చనుఁ♦జొక్కపుఁదావులధూపధూమ మే
పారఁగ ధూమయోను లయి♦యాతపవారణరీతి వేసవిం
దీరయి సారసౌరభము ♦ నెక్కొన ఘుంఘుమలాడు మంచిప
న్నీరము వానలం గురియు ♦ నిచ్చలుఁ జిత్రతఁ బట్టనంబునన్. ౬౯

ఉ. ఘుమ్మనికమ్మవాసనలు ♦ గ్రమ్మఁగ ధూపచయమ్ము నెత్త గే
హమ్ముల ధూమ మాగడప♦లట్ల రహించి నిదాఘువేళ ఛ
త్రమ్ములరీతిఁ బాంథులకుఁ ♦ దాపముఁ బాపు ననం బరోపకా
రమ్మునఁ దజ్జనంబులఁ ద♦రంబె నుతింపఁగఁ దమ్మిచూలికిర్? ౭౦

వ. అట్టిపురి కధినాథుండై. ౭౧

అట్టి దశరథుని వర్ణించుట.

కం దశరథుఁడు తేజమున ద్వా,దశరథుఁడు నితాంతరుచిర♦తనుసుందరతర్
దశరథుఁడు సంతతార్చిత,దశరథుఁడు సుమీ ప్రతాప♦ధన! కేవలుఁడే. ౭౨

మ.తను నర్థించినయట్టివా రొరులయొ♦ద్దర్ వేఁడకుండంగ బల్
ధనముం గోరినవెల్ల లేదనక చే♦తఃప్రీతిమై నిచ్చు నై
నను లోపం బొకఁ డేర్పడెం దనదుసౌం♦దర్యంబునుం జూచుభూ
జనతాలోచనపాళి కెయ్యెడలనే ♦ సంతుష్టి లేఁ డీయఁగర్. ౭౩

ఉ. ఆధరణీశనందశ♦తాంగరథాంగహతి న్మణీమయ
జ్యాధరముల్ దిశాంతముల ♦ హాల్యము లైచన జొన్నఁజల్లి యా
త్మాధరవాసు లౌజనులు ♦ మంజరులం గని యారరత్నభూ
మీధరజాతసస్యములు ♦ మేలిమణుల్ సుమి యండ్రు నివ్వెఱర్. ౭౪

ఆ. రాజు సారసహిత♦తేజుని దమిఁ గనుం,గొనినమధ్యలోక♦కుముదనయన
లెల్లఁ గనులమూఁత♦లెప్పుడుఁ బెట్టరు, తలఁపు నిలిపి వలపు♦కలిమిబలిమి. ౭౫

తే. వసుధఁ బర్జన్యవిభు నర్క♦వంశ్యుఁ జూచి
దరము లజ్జయు నొదవంగ ♦ శర ణటంచు

నగ్ని రవిఁ జొచ్చెఁ గానఁగ♦దా జనంబు
లగ్నిగర్భుఁ డటందు రా♦యగ్నిగర్భు. ౨౬

ఆ. మగఁడు దన్నుఁ దిట్ట ♦ మగువ బిడ్డను గొట్టు, చంద మతనిశత్రు♦చయమువిధము
వానిబాణనిహతి ♦ మానిదేహంబు నై,లింపసతులఁ బెట్టు♦ఱంపుఁ జూడ. ౨౭

చం.తరణికులావతంసునిప్ర♦తాపము మించె నమిత్రరూపమై
యరులకదేమిచిత్రమొ, మ♦దారినృపాసితపద్మలోచనా
హరిణమదాంకసక్తహరి♦ణాంకసమంచితతుండమండలం
బరరె! మృగాంకరిక్తధవ♦ళాంశురుచి న్వెలుఁగొందె భూవరా! ౨౮

వ. అట్టి జగద్వినుతు భవదీయజామాతఁగా నొనర్పుమని ౨౯

మ.మునిసంక్రందనుఁ డిట్లు పల్కిన మహా♦మోదంబు సంధిల్లఁగా
జనపాలాగ్రణి భక్తిఁ బల్కె భవదా♦జ్ఞప్తిం బ్రవర్తింతు, నా
జననంబుల్ సఫలత్వ మొందెను భవ♦త్సందర్శనప్రాప్తి మీ
యనుకంపార్హుఁడ నౌట నంచుఁ బలుమా♦ఱాడంగ నమ్మౌనియున్. ౩౦

వ. వారల వీడుకోలు వడసి యాశీర్వదించి చనుటయుఁ గౌసల్యయు దశరథుండ తనకు మనోనాథుండుగఁ దలంచుచు నతనియంద మనంబు నిల్పి తత్సంగమంబుఁ గోరుచుండె. ౩౧

## వసంతఋతువర్ణనము

ఉ. అంత నితాంతకాంతసువ♦నాంతదురంతలతాంతసౌరభా
క్రాంతదిశాంతవంతము, ప్ర♦కంపితకాంతవశింజినీవిభా
సంతము, పాంథకృంతనని♦శాంతకుహూకలలోలమత్తవా
నంతము, గాయనాదృతవ♦సంతము, దోఁచె వసంత మయ్యెడన్. ౩౨

సీ. చైత్రవనేందిరా♦సంగమవేళ వి,భ్రష్ట మామకరికా♦పత్రము లన
రా మాధవుఁడు వన♦రమ గయిసేయ జా,ఱఁగనూడ్చుప్రాఁబచ్చ♦ఱవిక లనఁగ
వసుమతీజోరుజ♦పాళులు వెలిఁజూపు, చెలువైనయుపరంజి♦పలక లనఁగ
విటవిటీతతులకై♦ విటపచేటులు రక్తి, హత్తిన నునుమెత్త♦మెత్త లనఁగ

తే. నిండుమతి దండనుండిన♦దండిపక్కి,దండములగుండెదిటమెల్ల ♦ బెండువడఁగఁ
బండుటాకులువనినిండ♦మెండుకొనియె, నొంటికొమ్మలుచెలువేది♦యుండనపుడు.

ఉ. చెల్లుటఁ గాలమెల్లఁ దముఁ♦జేరెడుపైకములెల్ల జాఱ, సొం
పెల్లను మాయఁ, బత్రము ల♦దృశ్యముగాఁగను, బండ్లు వాయుటం
బల్లవవర్జితం బగుచుఁ ♦ బాంథవిగర్హితమై యహృద్యమై
వెల్లడిగాఁగ వార్ధకపు♦వేశ్యలసంచునఁ గొమ్మ లొప్పినన్. ౩౪

సీ. అగము లగము లౌటఁ ♦ దగ నట నిట జగ, జిగిమీఱుతొగరాల♦వగ లనంగ
నవయౌవనము పరి♦ఢవిలంగఁ గొమ్మల, మొగములఁజెలువారు♦మొటిమ లనఁగ
విరహిణీమర్మని♦భేదనం బొనరించి, కడఁగనిమరుముల్కి♦కదమ లనఁగ
మాధవురాకకు ♦ మదిని గొమ్మలు పూను, స్మరజాతశిఖిశిఖాం♦కురము లనఁగ
ఆ నొగరుపొగరుదగుల♦జగడాలబిగిఁగ్రాలు, మగువలెదల దిగులు♦బుగులుకొనఁగఁ
దొగరువగలుమిగులు♦జిగులుపెంపొలయంగఁ, దొగరుఁజిగురులల రె♦నగములందు

సీ. చిగురులో యివిగావు ♦ మొగరంబ మనుపొగ, చెలువానుస్మరదీప♦శిఖలు గాని
చిలిరులో యివి గావు ♦ తరుణభూజనశాఖఁ, గమనీయ నుగుమేల్న♦ఖములుగాని
యిగురులో యివిగావు♦మగసంపుబిగిసించు, కముఁజించుపరుముల్కి♦గములుగాని
ననలొకో యివిగావు♦సునుపాయమదిడాయఁ, గనుగొమ్మలనుజూచు♦కములుగాని
తే. యనుచు జనములు పొగడంగ♦మొనలుసూపి, నిక్కిమోమ్పునవిచ్చుచు♦నిగ్గుమీఱి
తొగరుచిదక్కి జొంపమై♦వగలుచెలఁగె, ననలుకుజముల కొమ్మల♦కొనలయందు

ఉ మావులు మారుమాఫ్రులకు ♦ మందురలై విలసిల్లెఁ; బెల్లునె
త్తావులతావులైనసుల♦తాతతిఁబొలల నూఁగి పుష్పవి
స్రావిమధూళికాధునుల ♦ సారెకు నీఁతలుగొట్టి తుమ్మెదల్
దీవెలరాలుపూలగుమి♦దీవ్రులఁ బాపుకొనెన్ శ్రమంబులన్. ౮౭

శా. గండుంగోయిలకూయుకూఁకలును, వీఁ♦కం గేకు లీలోకమున్
నిండన్ వేసెడుబిగ్గకేకలును, వా♦ని న్మించఁ గీరంబు లు
ద్దండత్వంబునఁ జూపుడాకలును, మా♦ద్యద్భృంగముల్ జోకలున్
గండా లందురు మారుకాఁక లెదఁబా♦కం గామినీకాముకుల్. ౮౮

ఉ. కూర్మిని నోలలూఁచి, యొక♦కొమ్మను వృంతములంటి, యొండుచో
నర్మిలిఁ బద్మినిం గదిసి♦యాడి రతి, న్సరసిన్ ఘటించి సే
రూర్మిక లొందఁ నొక్కతెను ♦ నొక్కతపాదపరాగ మూనుచుం
బేర్మిఁ జరించె దక్షిణస♦మీరకుమారుఁడు జారుఁడై వడిన్. ౮౯

ఆ. పొదలఁబొదలఁ జిల్కి♦పొదలు కోకిలముల, మూఁకమూకుతనము♦మూలఁబడఁగ
నలరు లలరఁ దుమ్మె♦దలు దలమీఱి నెమ్మదులమెదలువాఁడు ♦ కదలెదాడి.

సీ. ధర్మశుద్ధాంతకాం♦తాగీతములఁ జొక్కి, మకురునఁ దేజి మా♦ర్మలయు చున్న
మలయాద్రిచెంచుచె♦ల్వల చేతిధనువులఁ, జూచి పూఁబోదమాటు♦సురుఁగు చున్న
ద్రావిడీమందిరా♦రామసీమల నునుఁ, బచ్చికకై మెడ♦వ్రాల్చు చున్నఁ
గర్దమితంబు లౌ♦ఘనన దీమాతృక, కేదారములఁ గాలు ♦ పాదుకొన్న
తే. మడిమలనుదాఁచి హైఁయని♦కడునదల్చి, మెడను నిమురుచుఁ దట్టుచు♦జడుపుదీర్చి
వాగె బిగియించి, కాల్నడ♦వచ్చుకతనఁ, జెందెఁ బృషదశ్వుఁ డావేళ♦మందగతిని.

ఉ. ఓలి రసాలసాలముల ♦ నుయ్యెల లూఁగుచు, మూఁగుచున్న హిం
దోళచయంబులం గసరి ♦ తోలుచుఁ, గంఠము లెత్తి రక్తి హిం
దోళముఁ బాడ బాలలు కు ♦ తూహలితం జెవి నిక్క నెట్టుచున్
హాళిఁ గురంగ మేగమిఁ గ ♦ దా! పవనుండు చరించు మెల్లగన్. ౯౨

ఉ. తమ్ములఁ గంపు లూరె, సుర ♦ తమ్ముల నింపులు గూరె, మీఱి ద్రో
తమ్ముల పెంపు గేరె, లలి ♦ తమ్ములఁ దెంపులు తారె, ధీలతాం
తమ్ముల సొంపు చేరెఁ, బరి ♦ తమ్ముల చిక్కులముద్దుముద్దుగీ
తమ్ములఅంపు మీఱె, హసి ♦ తమ్ములతంపులు గీఱె భోగులన్. ౯౩

**చంచరీకావళీ వృత్తము.**

వ్రాలుం బూలన్ లీలం ♦ ద్రాగ కే తేనె పానం
బోలం ఝంఝమ్మంచుం ♦ బోవు నవ్య ప్రసూన
శ్రీలన్ రేఁచున్ జోపున్ ♦ హాళి మూచూచు నూఁగుం
జాలం గేళిం దీఁగెం ♦ జంచరీకాళు లిచ్చన్. ౯౪

ఉ. కంధర మానుచున్న తను ♦ కాన సుగంధివినూత్ననాబ్జినీ
స్కంధసుమాసవంబు గొని ♦ కాంతలతాంతగుళుచ్ఛపీఠిఁ బు
ష్పంధయము ల్పరాగముల ♦ సారెకు ధూసరితంబు లౌచు గ
ర్వాంధతఁ బోర్లుఁ బాంథజన ♦ తాపత తీవ్రవటద్విరక్తి నించుచున్. ౯౫

ఉ. పూలను వ్రాలుఁ దేనెఁ గొన ♦ మూర్కొను ఝుమ్మని యేగు వెండియున్
వ్రాలును లేచు బమ్మెరను ♦ బైపయిఁ జుట్టులువెట్టు నొండు మ
త్తాళి మధూళి నానఁగ ర ♦ యంబునఁ బైపడి పోరు సల్పు హిం
దోళ మొకండు; నిల్కడకు ♦ మారగులే గద చంచలాత్మకుల్. ౯౬

ఉ. జాతులు సిగ్గులుం జెడఁ, గు ♦ జాతు లనూనవిలాససంపదు
ద్జాతములై చెలంగఁగ, వి ♦ జాతులనాదము మిన్నుముట్ట, హృ
జ్జాతకలి ప్రభావమున ♦ సత్త్వవికాసము డిందఁగా, మధూ
ద్భూతగుణప్రవర్తనము ♦ పొల్చి కలింబలె నొప్పె నామనిన్. ౯౭

ఉ. మూఁకలరీతి నున్నయళి ♦ మూఁకల నిద్దుర లేపి, నిద్దపుం
బోఁకల గుజ్జుమావినును ♦ మోకలఁ బాదము మోపి, వీఁకఁ బల్
పోకలఁ బద్మినీజనవ ♦ పుర్శ్రమవారిని బాపి, మీఱు వే
పోకల వేగుఁబోకలను ♦ బోకలరాకలఁ జల్లఁ దెమ్మెరల్. ౯౮

తే. పుడమిని వివాహమహ మల్లి ♦ కడలఁ జెలఁగ, నవనవసుగంధయుక్తి న ♦ నారతంబు
దక్షిణాశఁ జరించెను ♦ దవిలి ముసలి, ఛాందసుం డనఁ బవనుండు ♦ మందగతిని. ౯౯

వ. ఇట్లు నిరంతరకాంతవకుంతలతాంతసురభితనిశాంతంబును, నశ్రాంతపథికాంతకాశాంతరతికాంతసంతతప్రకంపితగుణారవద్విగుణీకృతాక్రాంతదిగంతవాసంతకలకలశ్రవణావిస్మృతేతరోదంతంబును, రతికాంతరణతాంతవినికృంతనవిశాంతహిమవాసంతభాసంతంబును, మాకందమందారబృందారవింద నిష్యందమకరందబిందుసందోహపానానందనటత్తుందిల మిళింద కందర్పమదావిలమదావలకులకోలాహల సమాకులంబును నై వదావళు లగుశిఖావలంబుల రొదాళంబుల హాళాహాళికి నళికి బెళికి కులుకులఁదళుకులఁగొలఁకుల కెలఁకులఁ జిలుకలపలుకుల ములుకులుగ నులుకుకులుకులాఁడుల కలికిపలుకులును, నల్లిబిల్లిగఁ బెల్లుగ నల్లుకొనినమల్లికావల్లి కామతల్లికాదుల వేదుల సల్లలితసంఫుల్లలతాంతంబుల దినాంతంబుల శాటీపాటీరంబులఁ బాటనచేసి పాటవంబుమీఱఁ బాటపాటపాటల బిటారంబుల మిటారులు మొలనూలిగజ్జియలరవళి రవళింప లీలాహల్లీసక కేళీలోలలై యింపుసొంపార నటింపఁదన్ముఖనయనాభినయవిలోక నేహాపరత్వంబునఁ బార్శ్వంబునకుఁ జాఱెనాఁ బింపిణీలూఁపుయుగంబుల మార్చిమార్చి నృత్యంబుసలుపఁ దాలఫలవిభ్రమభ్రమకారులగుపయోధరంబుల నాచ్ఛాదించు జాఱుపయంటలసందుసందునసితపయోధరంబులదృశ్యంబగుచచిరద్యుతుల శోభ ననుకరించు నిగన్నిగ మనుకనకమణిహారకాంతులు వదనేందునకుఁ బరివేషంబులఁ గల్పింప విరళంబు లగుకురుళంబులు బంభరడింభంబులుపోలె సంరంభింప, వానివదనంబులనుండిరాలుమధుబిందువులునాఁగర్పూరతిలకితముఖంబునఁ బుటమరించుఘర్మబిందువులు జాతీ హరిచందనపత్రభంగచిత్రరంగ మైనకపోలముకురంబుల వజ్రస్థగితసువర్ణఫలకంబులుగను, వక్షోదుకూలంబుఁ జకోరికాకబళననిర్వ్యథితరాకాసాంద్రచంద్రికాపూరంబుగ నొనరింపఁ గేళికాయాసభరంబునఁ బైపై వచ్చుదట్టంపు నిట్టూర్పులు నెట్టికొనిరా మిట్టిపడుచనుమిట్టలు మిట్టిపడి యడంగఁ, దత్తనువల్లులఁ గొల్లలుగ వెల్లువలై డుల్లుచెమటలనటమటగిటగిటనగా వాడపీవలి వీవనలవీచెనా జంపాడువిశాలరంభా పత్రంబులును, విరిపోటులెంచక యిరుపోటుల విరిపోటులెంచి విరివాసివచ్చిన గాసినిడ నద నని మెద నని మదనుండు శరఘాతంబుల విశరఘాతంబుసేయు నని వెరవేఁకివేఁకరంబునఁ దమవెంట వెంటముకై మసపసమెఱయ మసక మెసక మెసఁగ మఱుసంజలవల్లభులఁ దోడుకొని యారజంబుపెంపుటారజంబులనీరజంబులననీరు గ్రోలిమదావలంబులై వదావళు లగుసమదాళులవళావళుల కలుకు మృణాలజాలగ్రసనలోలమరాళంబుల సరాళంబు లగుకేళాకూళులఁ గేలీలోలలై, మాందాళిచీరలుధరించిహావణించిన కొమ్మలగతి మినమినలాడు కవటాకులటాకుటీకు గల కొమ్మలచాయలనుల్లసిల్లి జగతుల శతపత్రంబుసహస్రపత్రంబైన నీవిరివాసివచ్చునేయని మెచ్చుగొలుపు నవనవశిరీషకుసుమవిసరశయనతలంబునఁ బరవశ లగువశాగమనలును, రహింప నందంబుమీఱు నావసంతసమయంబునఁ గౌసల్యాబిబ్బోకవతి నిబ్బరంబులేక మారునిదెబ్బలకుఁ దబ్బిబ్బులాడుచుఁ బ్రబ్బినచింత విర

హావేవనాదూయమానమానసయై చింతిలుచున్నసమయంబున నెచ్చెలులు తచ్చరిత్రం బెఱింగి వనంబున మెలంగినఁ గాక యీకాఁక వోకడపెట్టఁజాలమని బాలమనికితంబుఁ బాపఁ జాలమే లని జాల మేలని మేలంపుమాటల పాటలాధర లారామనారామంబునకుం దోడ్కొని చనుటయుఁ గౌసల్యాదేవియు నెచ్చెలితోడఁ దిరుగుచుండ నచ్చటివిశేషంబులు ముచ్చటమీఱ ముచ్చటింపఁ దలచి వయస్య యిట్లనియె. ౧౦౦

## *కౌసల్యాదేవీవనవిహారము.*

ఉ. అల్లదె! యల్లిబిల్లిగను♦నల్లినమల్లియతీవెలందుఁ బైఁ
బెల్లగుపూవులం గనుమి ♦ ప్రేయసి! నీఱునఁగప్పునిప్పు నా
నుల్లమునందు నెంతు, నది♦యొప్పును బాంధుల వాడఁజేయుటన్
వెల్లడిగా హసంతి యను♦పేరు వహించుట గ్రొత్తలే చెలీ! ౧౦౧

శా. ఝంకారస్తననార్భటీస్ఫుటితది♦క్కైలంబులై ఫుల్లస
త్పంకేజాతమరందపానరతస♦క్తస్వాంతయుక్తిన్ నిరా
తంకారంబున వచ్చుషట్పదములన్ ♦ దర్శించి నూతన్నాంబుభృ
చ్ఛంక న్నేను వణంకఁగా సుడుఁగుహం♦సం జూచితే భామినీ! ౧౦౨

చం. నిరుపమకోమలాంగి! ధర♦ణీరుహముం గనుమా శిరీషమున్
సరసను జేర నీవు పయి ♦ జల్లున రాల్చెఁ బ్రసూనజాలమున్
స్థిరవరపేశలం బగుత్వ♦దీయశరీరముఁ జూచి పూలచే
నరుదుగఁ బూజసేసెనో; మ♦హాత్మకు లన్యగుణజ్ఞులేకదా. ౧౦౩

చం. కుజదళపాళి రంధ్రములఁ♦గూరిచి తూఱిచి నారనందు న
క్కజముగఁ బీఁచుపోఁచలను ♦ గట్టుచు లోఁ గది యుండ దాన స్వ
ప్రజకయి జ్యోతిరింగణము♦పక్షుతిఁ బంకమునన్ బిగించి పై
స్గజిబిజి నల్లియున్నగిజి♦గాఁడులగూఁడులఁ జూడు మక్కరో. ౧౦౪

కం. సౌరభవర్జిత మయ్యును, జారుతరం బయ్యెఁ గనఁగ ♦ జలజాక్షీ! వి
ద్యారహితుం డైనయలం,కారపువిద్యార్థిఁబోలి ♦ కను కింశుకమున్. ౧౦౫

కం. మాధవసంగమవిలసిత,రాధోల్లాసంబుఁ గాంచి ♦ భ్రమరారభటిం
గ్రోధముఁ దెలుపుచుఁ గనుమా, మాధవి విలసిల్లె రక్తి♦మహితాననయై. ౧౦౬

ఉ. వాడఁగఁ గర్ణపూరములు ♦ వ్రాలమహోత్పలపత్త్రిరాజి, దో
పాడఁ జలించుచున్ భ్రమర♦కావళీ, వృంతము లింత నల్గఁగా
వీడ లతావలేప, మట♦వింతబెడంగు రహించుపద్మినిం
జూడ సఖీలలామ! మది♦సాక్కెను నీ కదియేమి చెప్పవే? ౧౦౭

ఉ. ఆతపతాప మోపికను ◆ నాఁపి వడింబడి పెన్నడిం దనూ
జాతఘనశ్రమం బెడల ◆ సారసుమాంచితసద్రసంబు నైఁ
బ్రీతిగ నంటుకోఁ జెలువ ◆ పేర్మి హిమాంబులఁ దోఁగి తాలిచెన్
నూతనపత్రరేఖలఁ గ◆నుంగొను కొమ్మ లనాహతద్యుతిన్. ౧౦౮

వ. అని యిట్లు తనయనుంగు నెచ్చెలి యందలియందంబు నందంబుగా మందలించు చుండఁ గనుంగొనుచు. ౧౦౯

చం. *వికటపలాశివారముల ◆ వేడ్కఁ శరంబుల ముంచి, జింకకై
ప్రకటితరీతి నేగి, యెడఁ◆బాసిననిష్టవయస్యఁ జీరుచున్
శుకముల కుల్కుచుం, దనకు◆స్రుక్కినపక్కిని నాదరించుచున్
నకి యొసఁగన్ ఫలోత్కరము ◆ సాపడుచుం గడుసంతసంబునన్. ౧౧౦

ఉ. *కోమలపల్లవావళులు ◆ గోయుచుఁ, గాకి విషంపు మాన్పుచున్
శ్రీమయపర్ణశాలల వ◆సించి, మహాశ్రమమారి సుందరా
రామముఁ జేరి తానబల◆రక్కసినాసను గోయఁ బంప నా
రామవిహార మీఁగతిని ◆ రాజిత మయ్యె వనాంతరంబునన్. . ౧౧౧

వ. ఇట్లు గ్రుమ్మరుచున్న సమయంబున సంధ్యాకాలంబు డాయుటయు వనవిహారంబు చాలించి పురంబుఁ జేరఁ బోవుదము రమ్మనినఁ గౌసల్య రాక మంజుకుంజంబుల సుమపుంజంబులకై తిరుగుచున్నఁ జెలి బెదరింప వయస్య. ౧౧౨

కం. అవరాజకీరమతి నీ,సవురున బింబోష్ఠి ! తిరుగ ◆ సయ్యాటమునం
గువలయనాథుఁడు దోఁచెడి, నవలా ! నవలాఘవంపు◆నడ రావమ్మా. ౧౧౩

శా. రామామాధవుఁ డుండు నాసరసఁ బో◆రాదమ్మ, యీపూఁబొదన్
భామా ! తామరసాంబకుండు మెలఁగున్ ◆ వ ల్దన్న వే పోయెదో
శ్యామా ! భూపకుమారకుం డచటనే ◆ సాక్షాత్కృతిం దోఁచు నీ
సీమాటీకన మేల మే లటవె యో◆సీమాటి ! ముమ్మాటికిన్. ౧౧౪

వ. అని పలికిన దశరథుండు చెలి తన్ను వీక్షించి హెచ్చరించుటకాఁ దలంచి తనడాఁగినకుడుంగంబు మాటు వీడి తటాలున వారియెదుర నిలుచుటయు. ౧౧౫

కౌసల్యాదేవి దశరథుంజూచుట.

సీ. జిగిబిగిరుచులచేఁ ◆ జెలఁగుపుండ్రమువాని, వలెవాటు గలపొన్ను ◆ వలువవాని
నెగయుమూఁపులతోడి◆సొగియురూపమువానిఁ, గమనీయజలజాంబ◆కములవాని
మృగరాజు నిరసించు◆మేలిమధ్యమువాని, సరసవిశాలవ◆క్షంబువాని
డంబుమీఱినయట్టి◆కంబుకంఠమువానిఁ, గామినీహృద్యవి◆గ్రహమువాని

తే. భూపతనయుని దశరథు ♦ దాపునందుఁ, జూచి తిలకించి పులకించి♦సొక్కి తెలిసి
కలఁకవాఱినమనమునఁ ♦ దెలియలేక, మదనుఁడనుచును భ్రమసెను♦మదిరనయన

వ. ఇట్లద్దాటున దాపున నిలిచిన దశరథుఁ జూచి జంకి శంకించి ధీరోదాత్త గావున భావంబు బయలుపడనీయక.

ఆ. నిరుపమానతేజు ♦ నిస్తులరతిరాజ, రాజితాంగుఁ జూచి ♦ రాజవదన
రాజసమునరక్తి♦రాణించుమాడ్కి నీ, రాజితాంఘ్రిఁ జేసె ♦ నోజ మెఱయ ౧౧౮

## కౌసల్యా దశరథుల సంభాషణము.

ఉ. అంచముమీఱఁ గాంత నిన♦యంబు నయంబు రయంబు దోఁప రా
కేందునిభాననన్ వరమ♦హీపతిగాఁగ నెఱింగి భూపసం
క్రందన! యల్ల సత్కుసుమ♦రాజితపీఠిని విశ్రమించి మా
యందు ననుగ్రహించి చరి♦తార్థనుగా నొనరింపుమా దయన్. ౧౧౯

ఉ. నీతముగాఁగఁ గ్రొత్తనవ♦నీతముకన్నను పేశలంబునౌ
నీతతకోమలాంఘ్రినవ♦నీరజయుగ్మము నింతదవ్వు యా
నాతతకారణాకలిత ♦ మానటు లేల యొనర్చె డెంద? మా
హా తెలిసెన్ మము న్మిగుల ♦ నాదరయుక్తలఁ జేయనే కదా ౧౨౦

చం. నినుఁ బతిఁగా వరించి ధర♦ణీతరుణీమణి యేపురంబునం
దనయము హాళి మీఱెడినొ ♦ స్వచ్ఛసువర్ణపుఁ బేరునందు ర
త్ననికర పట్లు నీదుశుభ♦నామమునం జతురత్వమందె నే
వినుతమహాత్మురాళి? పృథ♦వీవర! వీనులవిందు సేయుదే. ౧౨౧

ఉ. ఏమినిమిత్త మెచ్చటికి ♦ నెచ్చటినుండి మహాత్మ! పోవుచో
నీమహిఁ జేరవచ్చితి వి♦టీవనిసొంపుఁ గనంగ నోకొ? యా
రా! ముఖకాంతిసుందరత♦రాజకుమారకలక్షణంబు లు
ద్దామముగాఁగఁ దెల్పెడు య♦థార్థము చెప్పుమ చెప్పఁగూడినన్. ౧౨౨

చం. ఇది ప్రమదావనంబు పృథి♦వీశ్వర! దక్షిణకోసలుండు ధీ
సదనుఁడు భానుమంతుఁడు ప్ర♦శాంతుఁడు తద్ధరణీశుపుత్రికన్
హ్లాదిని విహార కేళిఁ జరి♦యింపఁగ నాస జనింప నేఁడు మే
లద నని వచ్చినారము సు♦మావచయం బొనరింప నింపునన్. ౧౨౩

వ అని యూరకున్న నయ్యన్నులమిన్న మృదుమధురవచశ్చమత్కారంబునకు నల
రుచుఁ గల తెఱం గెఱింగించువాఁడై. ౧౨౪

*⁂ ప్రియకాంతావృత్తము. ⁂*

అనితివి నీవే తెలియ సు♦మాంగీ ! సకలం బై
నను నెఱిఁగింతు న్వీను కల♦నాదామణి ! ప్రీతిన్
ఇనకులజాతుండ దశర♦థేశాఖ్య జనుల్ న
న్ననుదు రయోధ్యాపుర మిర♦వయ్యెం బ్రియకాంతా. ౧౨౫

*⁂ స్ర గ్వి ణి. ⁂*

దిగ్వితానంబులం ♦ దేజు మీఱంగ స, మ్యగ్విభూతిం జమూ♦మండలంబొప్పఁగా
స్రగ్విణీ! పోవుచున్ ♦ శాంతికై మానిరా, డ్వాగ్విధిన్నిల్చితిన్ ♦ భామకర్ణంబునన్.

*⁂ మా ని ని. ⁂*

మానిని ! నీయసమానవిలాసము ♦ మాన్యగుణంబులు పెక్కుజను
ల్వీనులవిందుగఁ జెప్పఁగ విందు, స♦లీల నిను న్వరియింపఁ గడున్
మానస ముబ్బట లూఁగుచు నుండఁగ ♦ మానితవృత్తిని నీజనకున్
దానముగా నిను వేఁడుకతంబున ♦ దాపున ! నిల్చితి సేనలతోన్. ౧౨౬

*⁂ వనమంజరీవృత్తము ⁂*

అలమినసంజ వనాంతరవీథుల ♦ హాయి నొంటిగఁ గ్రుమ్మరం
దలఁపు జనింపఁగఁ బోవుచుఁ గోయుచుఁ ♦ దన్వులున్ వనమంజరుల్
కలకలనాదము కర్ణరసాయన♦గౌరవంబున నింపఁగా
హాళహాళికం గన వచ్చి కుడుంగప♦దాంతరంబున డాఁగితిన్. ౧౨౭

*⁂ కుసుమితలతావేల్లితము. ⁂*

అందం బొప్పంగాఁ బ్రియసఖియు నీ ♦ వర్మిలి న్ముచ్చటింప
న్వీందుం గందుంగా కుసుమితలతా♦వేల్లితం బైనకుంజం
బం దిం దున్నన్ డాఁగి యని నిలువన్ ♦ హల్లకాక్షీ ప్రబోధం
బొందాఁ బల్కాడన్ జలజవదనా ♦ పూని నీతోడ నంచున్. ౧౨౮

తే. ఆడఁబోఁ దీర్థమెదు రైన♦యట్లు చెలువ! వెదకుతీఁగియ పదములఁ♦బెనఁగి నట్లు
నాదుభాగ్యంబుపెంపున♦నళిననయన ! వచ్చితివికాన వచ్చితి♦ముచ్చటింప. ౧౩౦

*⁂ తో ద క ము. ⁂*

మానిని ! నిన్గన ♦ మానసమందున్, మానసజాతుఁడు ♦ మాననివీఁకన్
మానముదూలఁగ ♦ మార్గణపంక్తిన్, మానకచిమ్మెఁ జు♦మా ననుఁ గాంతా.

చం. ధరణిఁ గలట్టిరాజులను ♦ దద్దయు మార్కొని వీరవిక్రమ
స్ఫురణను బోర గెల్చి పువుఁ♦బోణిరో! నీదుకటాక్షపాతవి
స్ఫురణ సహింపలేక మది♦పొంగు దొఱంగి మొగుడ్డుఁ గేలు దు
ర్భరసుమబాణబాణవిని♦పాతనభీతుని నేలు కోమలీ. ౧౩౨

ఉ. ఇంటి భవత్తనూరుచిర♦విభ్రమరూపవిలాససంపదం
గంటిని గంటి కామెతగఁ ♦ గాంతరో! నేఁ డిటనుండి, యంతఁ బూ
ఇంటివజీరు నాదువెను♦వెంటను గొంటుతనాన దంటవా
ల్గంటిరో! గెంటఁగాఁ దొడఁగెఁ ♦ గాండముల న్గడుఁ గంటగించుచున్. ౧౩౩

ఉ. మోహముఁ బెంచె నీకురులు ♦ మోమువికాసము దెల్పెఁ దెచ్చె, సం
దేహముఁ గూర్చె నీనడుము ♦ నిశ్చయనిశ్చలగౌరవంబు నో
మోహిని! నీగభీరతయె ♦ పొందుగఁ దెల్పెఁ గరంబుఁ బ్రీతి వై
వాహికకేళిఁ దేలుపఁగ ♦ స్వాంతమునం దలపోయు భామినీ. ౧౩౪

వ. అనినఁ గౌసల్యయు. ౧౩౫

ఉ. పూరుషు లిట్లు రాఁ జనునె ♦ భూధవపుంగవ! కాననాంతరో
దారఫలప్రసూనకిస♦లావచయాదికకేళికారతిన్
హారివిహార లైనజల♦జాస్యల వంచనఁ బొంచి కాంచుటల్
సూరకులావతంస! యిది ♦ చోరునికర్మమొ శూరధర్మమో ౧౩౬

కం. కులకన్యను గానా? పెద్దలు లేరా నాకు? నిపుడ ♦ ధరణీశా! నీ
పలుకులు జనకుఁడు వినినను, బెలుచనఁ జేసేత ననుభ♦వింపఁగ నిచ్చున్. ౧౩౭

వ. అని రానికోపంబు దోఁప మాఱుమొగంబు వెట్టుకొని నెచ్చెలింగూడి నిర్నిష్కు-
టయై వేఱుమార్గంబునఁ జనునెడ. ౧౩౮

కం. పదములు మును చనఁ జూచున్, మది వెనుకకుఁ బాఱిపోయి ♦ మరలదుమఱిక
న్నుదచూపు మధ్యవర్తియొ, పదురుచు వెనుకకును బోయి ♦ వచ్చుం బోవున్.

వ. ఇట్లు పోగమకించుపదంబులఁ బోనియ్యనిమనంబుతోఁ దిరిగితిరిగిచూచుచు నేటి
కెదురీఁదువిధంబునఁ జనుచు దశరథుం డనంతరథుం డైనపగిది భావనాబలవిశేషం
బున నెచ్చటఁ జూచినఁ దోఁచుటయు. ౧౪౦

ఉ. ఎచ్చట విన్న మారహయ♦హేషలె, యేయెడఁ గన్న ముల్కులే
యెచ్చోటఁ జన్నఁ దద్రథమె ♦ యెక్కడ నక్క విజాతికూఁతలే
నచ్చికమార దుష్టశకు♦నంబులె యెల్లెడఁ గాననయ్యె, న
న్నిచ్చటి కేల తెచ్చితిరె ♦ యింతులు! కంతునిశస్త్రశాలకున్. ౧౪౧

వ. అని తనమనోవికారంబు దేటపఱుచుటయు నెచ్చెలి తదనుగుణంబుగా. ౧౪౨

సీ. సారసోదారకా♦సారంబు గాదమ్మ, మారనారాచతూ♦ణీర మమ్మ
యంద మామాకంద♦బృందమ్ము గాదమ్మ, కందర్పమందురా♦బృంద మమ్మ
వలిపెంపు గల్గుపీ♦వలిగుంపు గా దమ్మ, యంగజధాటీశ♦తాంగ మమ్మ
గంపుమీఱినచిల్క♦వండంబు గా దమ్మ, దండిమారుపటాణి♦దం డి దమ్మ
తే. రవణమీఱంగఁ గోయిల♦రవళిగాదు, రతిమనోహరభటమహా♦ర్భటులు సుమ్ము
కాన నీకానలో నేక♦తాన మారు, నాన తిరుగంగ రాదమ్మ♦మానవతికి. ౧౪౩

## సాయంసమయవర్ణనము.

తే. అపరదిక్కాంత గైసేయు♦నాశయమున, రాగమలరారుచుండ సం♦ధ్యాగమమున
ముఖముననుబెట్టు కుంకుము♦బొట్టనంగ, వెలయుభానునిఁ గంటివే♦జలజనయన!
ఉ. వాసకసజ్జవోలె నిజ♦వల్లభురాకను రాక కొప్పఁ ద
న్వీ! సవరింప నెత్తుకురు♦విందమణీకృతహస్తయుగ్మసం
భాసితదర్పణద్వయము♦భాతి నిశాముఖమందుఁ గంటివే
వాసరయామినీధవులు♦భామిని! నిల్వఁగఁ బ్రత్యగంబునన్ ౧౪౫
తే. జలజకుసుమంబు తింత్రిణీ♦దళముభంగిఁ, బాల వికసించునింతియ ♦ పద్మనయన?
ప్రొద్దుదిరుగుడుఁబువు రవి♦పోకఁ బోవ, సమ్ముఖమ్మగు నెప్పుడు ♦ సారు మీఱి.
ఉ. హెచ్చుగఁ గేకల న్నభము ♦ నెల్లెడ నింపుచుఁ, బక్షకాంతికిం
బెచ్చుగ సంజడా లొసఁగ ♦ వింతహొరంగు, బెడంగుఁగూర్పఁ గాఁ
బచ్చలహారపంక్తులయి ♦ భాసిలి సాయములచ్చియక్కునన్
వచ్చెడిఁ గంటె కీరములు♦బౌపలు దీరుచు గూండ్లు సేరఁగన్. ౧౪౭
వ. కావున నీక నిట నుండరాదు మందిరంబునకుం బోవుదము రమ్మని యమ్మంద
యానఁ దోడ్కొని చనియె నంత. ౧౪౮
చం చిలుకలు సేరె గూండ్లు రొద♦సేయుచు; నింటనె నిల్చి యున్నకే
ఫులు మది రా బితాన నట♦మో మొకయోరగ వంచి వాలము
ల్సెలఁగ నటించుపాముగతి ♦ లీలగ నెత్తుచు బిగ్గఱంకెలం
గొలుపుచు దాఁటుల న్మిగిలి ♦ గోవులు వాఱె గృహాళి సేరఁగన్. ౧౪౯
ఉ. మాటికిమాటికిం దనదు♦మార్గనిరోధముగాఁగ వత్సముల్
దాఁటులు వెట్టుచుం బొదుఁగు ♦ దద్దయుఁ గ్రుమ్ముచు నెత్తివైచుచున్
గాటముగాఁగ నడ్డునిడఁ♦గాఁ గసి నాకుచు మేను, గ్రేళ్లుగన్
దాఁటుచుఁ బోయె నాలగుమి ♦ దా భయ పెట్టుచుఁ గ్రుమ్ముకైవడిన్. ౧౫౦
చం.యువసపుగంపఁ దాల్చి శిర♦మందలిచిన్నిపయంటచుట్టపై
జవజవలాడ నెన్నడుము ♦ చన్నులభారము సైఁపలేమిఁ జ

న్గవపయిఁ బోటికింబలెనె • నాట్యము సల్ప నితంబబింబముల్
జవమున వానిపోరు నవ•సానము సేయఁగ నొక్కొ పాదముల్
తవతవలేక పోవఁగ హు•టాహుటిఁ గాఁపుమిటారి యేగెడిన్. ౧౫౧

చం. పెడమఱిఁ ద్రిప్పి మోము నడి•పేదినిఁ బోయెడివారిఁ జూడక
న్లొడమడు గైనపాదముల•నేర్పడ నిల్చి నఖాంకురంబులం
దడయక గీఱుచో నవవ•ధానితనా నెగఁద్రోచి త్రొక్కఁగ
న్వడ నొకకొంత చన్నుఁగవ•వాకిట నిల్చిరి జారకామినుల్. ౧౫౨

చం. చలువమడుంగుఁ గట్టి బురు•సాపనిత్రైక బిగించి మేలిదు
వ్వలువపయంటలోఁ జనులు • వారక డాఁగురుమూఁత లాడఁగాఁ
దలు పొక యోరమాటుచుఁ బ•థంబునఁబోయెడివారిఁ జూచి వా
రలు దముఁ జూడ మాటుగొని • క్రాలిరి బాళిని వారకామినుల్. ౧౫౩

శా. దోషాద్ధత్యము మీఱఁ బున్యజనసం•దోహంబు నిస్తుల్యసం
తోషం బొందెను; లోన సంతసిలి ప్ర•ద్యుమ్నుండు జాగ్రద్దశా
శ్లేషం బొందె; నదృశ్యభావము వహిం•చెం దారకల్; హెళి సం
శ్లేషానందసుఖంబుఁ గాంచి వికసిం•చెం బద్మినీసంతతుల్. ౧౫౪

ఉ. ఊహాచెడం దమోరి చనె • నొడి, మహానటుఁ డయ్యె వైరి, పాం
థాహితుఁ డైనరాజు హితుఁ • డయ్యె, స్మరోద్ధతిఁ దాళ శక్యమా
మోహతమంబునన్ జగము • ముంచునొకో యనుభీతిచే వరా
రోహలు దీపికాచ్ఛలని•రూఢిని గంతున కిచ్చి రారతుల్. ౧౫౫

వ. ఇట్లు చీఁకటివడుటయుఁ గౌసల్య దశరథుఁ దలంచి వలపున సుడివడుచు హారా
హారవిహారవిముఖయై యొకరాత్రి వేఁదు తెత్తినట్లు చరించుచుండ ప్రియవయస్య
యమ్మనంబు వే ఱొకప్రసక్తిఁ ద్రిప్ప నెంచి యుదయించునిశాచంచలాక్షీమనోహ
రుం జూపి యి ట్లనియె. ౧౫౬

ఉ. *పొంగుచుఁ దండ్రి పంపఁ జని • పొందుగ శాస్త్రములెల్ల నేర్చి పే
ర్మిం గురునాన దాటక హ•రించియుదారమతిన్ సవంబు సే
యంగనగాధిరాజతన•యావనుఁడై కృతజీవశర్ముఁడై
రం గగు నాత్మజాతుఁ గను • రాజముఖీ! విధు రామచంద్రునిన్. ౧౫౭

మ. *తనరాకన్ జనకుండు పొంగఁగను సీ•తాతోషణాపాదియై
యనయంబున్ జనమోదదుం డగుచు నా•ర్యానందకృద్ధర్మవ
ర్ధనుఁడై కౌతుక మొప్ప నిగ్గుగనుచున్•రాజిల్లె దారాన్వితున్
ఘనసత్తేజు నరిస్మయాపహుఁ జెలీ • కాంచంగదే యర్మిలిన్. ౧౫౮

తే.*కొమిరె! భవితవ్య మిదిగాదొ ♦ కొ మరుఁ డదిగొఁ
దోడునాలియు రాఁగఁ దాఁ ♦ గ్రీడ లీల
వెడలెఁ గాంతారమునుబట్టి♦పుడమిఱేఁడు
కైకయికిఁ గూర్చు నీ కేల ♦ శోకమంద. ౧౫౯

ఉ. ఈనెల నొప్పుకప్పునకు ♦ నెన్నియొ చొప్పులు లోకు లందురే
కాని యవన్ని దబ్బఱలె♦కా, నెల దా ముకురాయమాణ మౌఁ
గాన నిశాకృశోదరి జ♦గాగయి సేఁతలు సేయఁబూనుచో
వేనలి దిద్దఁ దోఁచుప్రతి♦బింబ ము టంచుఁ దలంతు నెచ్చెలీ. ౧ ౦

వ. అని పలుకుకలికిం గనుంగొని యఘుకుగదిరిన మనమునఁ దనమనంబు దశరథాయత్తంబై యుంట నెఱుగఁ జెప్పె. ౧౬౧

సీ. తరమటే సైరింప ♦ స్మరసారతరఘోర,కరవీరశరవార♦ఘాతములకు
వశమటే యోర్వంగ♦దశద శావశమనో, వశదశాకరనిశా♦పరుచులకును
దలమటే తాళంగ ♦ మలయాగమలయాగ,నలమానపవమాన♦బాధలకును
గలనటే సహింయింపఁ ♦ గలనాద ! కలనాద,కలనాదకులమహా♦కులతలకును
తే. బాప! యీపాప మెట్లాఁపఁ ♦ బ్రసవచాప, సుమనిశాపమహాబల♦సమదకీర
కోపకృతతాపమున కోప ♦ నేపగిదిని, సైఁపఁ గలనమ్మవీరల♦యేఁపుఁగొమ్మ !

ఉ క్రొన్నెలయేపులుం, గడుసుఁ♦గో వెలచూపులు, మారుతూపులుఁ
వెన్నెలమాపులుం, వడఁకు♦వీవలికైపులు, వేఁకిలీపులుఁ
వన్నెలచిల్క రాపులు, నృ♦పాలకు నత్తరిలీపు లొక్కటై
నన్నిటు లేఁచసాగె లల♦నా! కలనా సయిరింప నీదశల్. ౧౬౩

మ. లలనా! నేఁ గలనా సుఖంప భువనా♦లంకారరూపప్రభో
జ్జ్వలనానావిధభూషణా జివిలస♦ద్బాహోపరిశ్లిష్టనై
వలమానభ్రమరాకులీకృతశుకీ♦పాళీమయూరావళీ
కలనాదారవపూరితోలపశుభా♦గారంబున న్నిచ్చలుఁ. ౧౬౪

వ. అని యిట్లువందురుకుందరదన కూఱటగా. ౧౬౫

కం.శంబరగంధర్వవరుఁ, శంబరకలితాంకు నిహత♦శంబరదనుజుఁ
శంబరజాక్షీమణి యా,డంబరమున ననియెఁ బ్రస్ఫు♦టం బగుఫణితిఁ. ౧౬౬

— మన్మథదూషణము. —

కం నీ వొకసుకుమారుండవు, నీవి ల్సుకుమార మయ్యు ♦ నిర్దయ మటరా
యీవగ సుకుమారాంగుల, నీవగలను బాలుపఱుప ♦ నిందిరతనయా. ౧౬౭

కం. కామా తన్వంగుల మో, కామా! సౌఖ్యప్రదాన♦కర్మము నీదే
కా! మాబోటిని నేచుట, కా మాపతి నిన్ను జగతి♦గావించె నయో. ౧౬౮

ఉ. మానవదుర్వ్యథాకలిత♦మార్గుఁడవుం దనుజుండ వైనని
న్నానిటలాక్షఫాలనయ♦నాగ్నిఁ బడన్ సయిరించెఁ ద్రుంపకే
తా నయి లచ్చికై నరక♦దానవదర్పవిదారి, యాజగ
త్త్రాణపరాయణుండు నినుఁ♦ దా మదిఁ బూనినఁ గావ నేరఁడే? ౧౬౯

మ. కమలానాయకు నాత్మనీనులు శుభా♦కారుల్ వయోయుక్తులుం
గమలామందిరవర్ధనోద్యమపరుల్♦గాంతారభాస్వత్కరుల్
క్షమ వైకల్యసమేతు లున్ మఱి మనో♦జాతుల్ గదా గాన నో
కమలాసూనులు! మీర లిద్ద ఱొక్కటై♦కారింతు రజ్ఞాత్ములన్. ౧౭౦

— చంద్రదూషణము —

కం. రుషచేఁ బెనుగా మనుదు, ర్విషమున నాకువునఁ జేరి♦ మెలఁతుక నేచన్
విషధరశేఖర! నీదు,ర్విషము నరేంద్రుండు పాచు♦ వెఱపింపకుమీ. ౧౭౧

సీ. మునిశాపము నిశాప♦ నినుఁద్రుంపదాయెఁగా, రోహిణీమాహాత్మ్య♦రూఢినేమొ
సర్పదష్టుఁడ వయ్యు♦ సమసిపో వైతిగా, యోషధీశత్వవి♦శేష మేమొ
దినము వారిధిఁబడి♦ తెగటాఱిపోవుగా, జైవాతృకత్వంబు♦చంద మేమొ
నడిగండి సెలవాటి♦ మడిసిపో వైతిగా, మఱి సుధాకరుఁడవౌ♦మహిమ నేమొ

తే. కటకటా యిన్నిగండముల్♦గలుగ నీవు, మడిసిపోవక మనుదల♦ మిడిసిపడుట
భళిర! నీతల్లికడుపుచ♦ల్వయొ తలంప, విరహిణీజనకృతపాప♦భరమొ చంద్ర!

ఉ. మాయురె! రాతినే నిమిష♦మాత్రమునం గరఁగంగ నీరుగ
జ్జేయఁగఁజాలు జాణఁడవు♦నీ రసికత్వము నీళ్లపాలుగాఁ
దోయరుహాక్షులన్ వెతలఁ♦ద్రోసెద వయ్యయొ దర్శనాశము
జ్జేయు భవత్కళావితతి♦ నేఁడు భయోద్ధతిఁ జూపె జాబిలీ! ౧౭౩

ఉ. పాడి దొఱంగి నీవు బుధ♦వైరివి గావుటఁ గాంచి భీతి న
ల్లాడఁగఁ జక్రపాళి పదు♦నాఱుగఁ జేసి యజాంగనేశు లా
పీడమునందుఁ గూర్చ నినుఁ♦ బెట్టి మతిన్ హరి బైల గెంటియున్
వీడక యొక్కకంటఁ గని♦పెట్టి రుమాధవమాధవుల్ శశీ! ౧౭౪

ఉ. హా! యన లోకమెల్ల సిత♦హాయన! నీరయిపోవ నీయన
శ్యాయము న్యాయ్యమేర నిజ♦శార్వరనామము సార్థకంబుగా
మాయురె! తోయజాక్షులను♦మార్తుఁడవై వెస రూపుమాయఁగాఁ
జేయఁగ శర్వరీశ్వర! ప్ర♦సిద్ధివహించెదె కూళ సేతలన్; ౧౭౫

సీ. జైవాతృకుఁడు గావె ♦ జీవనాధారమై, పంటపైరులఁ బ్రోచు♦దంట వగుట
జీవజీవము గావై ♦ దేవతాతతికిఁ జ, కోరంబులకు బువ్వ♦కోర వగుట
దివిదివ్వెటివి గావె ♦ తివిరి దరిద్రతా, ధీనదీనాళికిఁ ♦ దెరువు దెలుప
విధుమూర్తివే గావె ♦ వితథంబుగాకుండ, నిందిరాసతి నెద♦నొందియుంట
తే. ననఁగ మేలిగుణంబుల♦ననువుమీఱి, రట్టడిని దేఱి యువతుల♦గుట్టు చెఱిచి
తిట్టుదిననేల యఘు మొడి♦గట్టనేల, కరుణ నేలుము చేపట్టి♦కడలిపట్టి ! ౧౨౭

*మందానిలాదినింద.*

కం. పవమాన ! యింతదయఁ దలఁ, పవ మానవతీచయంబు♦పట్టుల నయయో
పవ మానవ చెలి వెత నిడు, నవమానపుఁ జేఁత లేటి ♦ కయ్యో పవనా ! ౧౨౮

సీ. నుడికార మేది నీ♦నుడి కార నఁగు టేమి, కీరమా! యిది నయ♦గార మటవె
పైకమా! మీ కేమి ♦ మైకమా యనుకంప, సైకమా మది విర♦సైక మటవె
పయ్యోరా! యెంత రా ♦ పయ్యోరా చెలికిఁ గ్రై, పయ్యోరాపయి మీను♦పయ్యోరాకు
తాళుమా యింతకాం♦తాళమా మత్తహిం, దోళమా! రిత్తరో♦దాళి మేల
తే. గాసిపెట్టెదవే పులు♦కాసిపులుఁగ, కర్జమే పులుగాకు ప♦ల్గాకులార
నీసదాచారమా జడా♦నిలమ యిదియు, నీమలీమసతయు నిదే♦యేమొ యళిని.

ఉ. చాలుర చాలురా కినుక ♦ జాణర జాణతె గాదురా చలం
బేలర? బేలరా పెరుఁగు♦నీఁదర నీదర మేదురా కడుం
దూలెర తూలరాశిగతి ♦ నొచ్చుర మచ్చర మెచ్చనీకురా
గోలర గోల రా పిడుఁగు♦గోరక కోరకదంతఁ బ్రోవరా. ౧౨౯

మత్తకోకిలము. బాల యాటను భీత యాచును ♦ వ్రాలుచున్ ధర సోలెరా
గోల మన్నినఁ బుణ్య మందురు ♦ గూల్పఁగన్ ఫల మేమిరా
చాలుఁ గిన్కను బుద్ధినుంపక ♦ శత్రుమున్ ధర వీడరా
చాలు నన్నని ప్రీతిమై సతి ♦ జాలి ముంపఁగఁ బోకురా. ౧౩౦

వ. అని యిట్లు మారకూపారకుమారకీరసమీరంబుల నిందించుచెలిం గని కౌసల్య యిట్లనియె. ౧౩౧

చం. తనకులనాశకుం డతఁడు ♦ తమ్ముఁడు తమ్ములమేలు నోర్వఁడా
దననిలయంబుఁ గూలఁ దోలు♦త న్నగఁజిమ్ము నితండు పుత్రుఁడా
వనితరో! భార్గవీసతి త♦పంబు లవెట్టివొ నర్చెనో కదా
తనకిటువంటిసూను లిల ♦ దాపుర మాటకు మత్తకాశినీ. ౧౩౨

ఉ. చందనగంధులార! చని ♦ సందులగొందుల వాడవాడలం
గ్రందుగ భూమియందలిపు♦రంబులఁ జాటఁగఁ బంపుఁడీ వెసం

బొందుగ రాజునాజ్ఞ యని ♦ పొం గఱఁగంగను మిన్ను ముట్టియె
ముందుగఁ గాల్పఁ డంచును స♦మున్నతచందనభూమిజాతముల్. ౧౮౩

వ. అని యిట్లు. ౧౮౪

శా. బాలారత్నము శయ్యపైఁ బొరలుచుం ♦ బ్రాలేయరుగ్బింబ ము
ద్వేలాభీలనిజాంశుజాలములఁ గ♦ స్తింబెట్ట హస్తాంబుజం
బోలిం జెక్కునఁ జేర్చి యేడ్చి మిగులన్ ♦ దీర్ఘాయనీమంజరీ
మేలోదంచితవల్లకీకలరవో♦న్మేషంబుఁ బోషించుచున్. ౧౮౫

వ. ఇట్లంతకంతకు గుఱువులువాఱు నెలంతకంతుసంతాపంబు నిశాంతంబుతోఁగాని
యంతంబునొందదని పలుతెగల నూఱార్చుచు వేకువచిన్నెలం గని. ౧౮౬

*ప్రాతఃకాలవర్ణనము.*

చం. కవి యగుఁగానఁ బుణ్యజన♦కాండగురుం డగుఁగాన నెంతయే
నవికలసమ్మదంబునఁ ద♦దాగమనంబున కుత్సహించుచుం
గవినికరంబు మెచ్చెడిని ♦ గణ్డరసాయన మాసుధోక్తులం
బ్రవిమలభావ మొప్పఁ గను♦మా యనుమానము మాని మానినీ. ౧౮౭

ఉ. ఆరసి పద్మినీవధయు♦నాదిగఁ గల్గినయాత్మకృత్యముల్
చేరువయైన నాహరియుఁ ♦ జింత నితాంతము కుందు మీఱఁగా
దారదవర్జితం బయిన♦దర్పణమో యన నెల్ల నొచు నో
సారసనేత్ర! చంద్రుఁ డదె ♦ జాఱెడిఁ గంటివె పశ్చిమాంబుధిన్. ౧౮౮

సీ. కువధుగాఢవ్యథా♦వివృతాస్యగహ్వరం, బగుఁగాని ముదితరో ♦ మృగము గాదు
శ్వాసదుస్సహాకార♦జాసముద్భవ బాష్ప,ములుగాని నునుమంచు♦బొట్లు గావు
ఉపశాంతికై పీల్చి♦యుమ్మెత్త నూర్పుచ్చఁ, బొగ గానివెన్నెల♦నగయుఁగాదు
పెల్లుతూపాడిచిన♦గళ్లయే పచ్చిక, బూఁజుపై నివముల్లొం♦బురుఁగు గాదు

తే. కర్మమెవ్వారికైన భో♦క్తవ్యమనుట, మఱచి వననిధిఁబడియెదు♦మగువ విధుఁడు
రాజయక్ష్మార్దితుఁడు పోయెఁ ♦ దేజమెల్ల, వీని కేటికి నెఱవంగ ♦ వెఱ్ఱిదాన!

చం. *కడఁగి తమోవృతం బయి జ♦గంబు నిశాటమహాధ్వతిం భరం
పడుచును వేగుచుండ ద్విజ♦వారము లొక్కటఁ గూయివెట్ట దం
దడి కరుణారసాప్తి జన♦నందనుఁడై జనియించు రాముఁడై
వడి హరి నీయెడం గనుమి♦పద్మదళద్యుతిలక్ష్మణాన్వితున్. ౧౯౦

కం. *రామా వేగనె పంచెద, నీమనమున సంతసంబు ♦ నివ్వటిలంగా
భూమిఁ బ్రియాన్వేషార్థము, నామదికిం గూర్చునట్టి♦నయగుణమణులన్. ౧౯౧

వ. అని యిట్లూరార్చె నంత. ౧౯౨

ఉ. "త్పి"వ్వని లేపి యెడ్ల వెలిఁదోలి "కిరో" యని నీరువెట్టి పె
ద్దవ్వగ నీవ లావలఁ జనం "గెకకోబ్బ" యటంచు నిల్పి తాఁ
జివ్వనఁ గాఁడి నట్టుపయిఁ జేర్చి వహించుచు మేఁడితోఁక మి
న్నువ్వదయించుకంటె మును పోయిరి కాఁపులు చేలఁ జేరఁగన్. ౧౯౩

ఉ. చేలచెఱంగు చెక్కిఁ కురిచీపయి వ్రాలి పేరువెట్టి మం
దాలను బిల్చి జానుయుగళాంతరకీలితకుంభసీమలోఁ
బాలను సుట్టుసుట్టు మనధ్వానము మోదముగూర్పఁ గాఁపుఁబ్రో
యా లిరుచేతులం బిదికె నప్పును డయ్యక ముక్క కంతయున్. ౧౯౪

సీ. తమ్ములతోఁడఁ గందమ్ములు విచ్చెను, దమముతో స్మరమోహతమము విరిసె
వాకు లుద్ధతశ్రుకవాకుల నన లెత్తెఁ, బవనంబు వెడలె నుపవనములను
దెలవాఱెఁ గాముకి తెలవాఱె వెరవేకి, రెడ్లు చేలను జేరి రెడ్లతోడ
నలులతో ముద్దుఁదోయ్యలులు మేల్గాంచిరి, ద్విజులను మేల్గాల్పె ద్విజకులంబు

తే. పంచపంచయటంచాడి బ్రాహ్మణతతి, పంచెపంచెయటంచూని వార్చిసిలిచి
పంచపంచలఁ గేల్మొకుళించికొనుచుఁ, బంచపంచద్వయాత్మ నర్చించెనంత.

ఉ. ముచ్చిల రేయి చేపడమి రొక్కము లిక్కలు చేరినట్టి పె
న్మచ్చులు జారిణీసురతమోహాకిలోలమతుల్ కువేశ్యలుం
బెచ్చుగ సోమరుల్ కువధుపీడితులున్ మఱి విప్రలబ్ధలున్
హెచ్చుగ నిద్రగూరి రెద నెంచక యభ్యుదితత్వదోషమన్ ౧౯౫

ఉ. మింట వెలింగె వేవెలుఁగు మేల్కొను మమ్మ యటంచు లేపఁ దా
రొంటరమింటరంబు లని యుస్సని దాసినిఁ దిట్టి భీతి లో
నంటక పొర్లి రింటఁ దమయత్త ననంద యు లేమిఁ గంటులే
కొంటరికాఁపురంబు గని యొప్పినమేటితుటారికత్తియల్. ౧౯౬

వ. ఇట్లు విరహవేదనాదోదూయమానమానస యగుకౌసల్యయూరడం బ్రియవయ
స్య ముద్దుఁజిలుకం జూచి. ౧౯౭

శా. *తారాకాంతుఁడు పెంపుదూలె వెలఁగందం దీఱె నాయంకిలుల్
ఆరన్ భూమిపరాగముల్ వెలసెఁ గాంతాన్వేషణార్థంబు నె
వ్వారిం బంచెదవో ఖగాన్వయమణీ వైళంబ శైలాపగా
పారావారవిలంఘనక్రమపటువ్యాపారపారీణులన్. ౧౯౯

వ. *అనిన నారామవాక్యంబుల నప్పతంగకులపుంగవుండువిని ప్రియవయస్యాస్యంబుఁ
జూపుటయు. ౨౦౦

కం. *వినుమా! సరి దాక్షిణ్యం,బును మానక రామభద్రముద్ర యిదే కై
కొనుమ యభిజ్ఞానమునకు, ననుమా నయమార హితముఁలాదటఁజనుమా. ౨౦౧

*శుకసందేశము.*

వ. *అనిపంచినఁ జని చని కొంతకాలంబునకు మరలి వచ్చి నీ ప్రియకాంతోదంతంబు సెప్పెద విను మని. ౨౦౨

ఉ. *ఆనతిమీర కేఁ జని ర♦యంబునఁ బట్టనముల్ ధరంబులుం
గానలు గోనలుం గడచి ♦ క్రన్నన సింధువు దాఁటి యచ్చటన్
దా నవగేహసీమఁ బ్రమ♦దావనమందు వసింపఁ గంటిఁ జం
ద్రానన రామ రామ యని ♦ యూఱనికూర్మిఁ దపించుచుండఁగన్. ౨౦౩

తే. *చేరి శాఖాగ్రమునఁగొంత♦సేపు నిలిచి,కనఁబడక యుండి యతనువే♦దనఁగృశించి
రామ రామా యటంచును♦భామ పలుక, సీనిమిత్తంబకా మది♦నిశ్చయించి.

తే. *రామ! నీనామకలితమై♦క్రాలుముద్ర, జాఱ విడిచితిఁ గొమ్మల♦చాటు నుండి
దానిఁగని నిన్నుఁగనినట్టు♦మానసమునఁ,దలఁచుచును బ్రేలధరియించి♦వలపుమించి.

మ. కర మాహ్లాదము మీఱ తె మానసమునం ♦ గాంచ న్నినున్ ముద్దుటుం
గరమా! నెచ్చెలిఁ జూచిన ట్టిటకు రాఁ♦గాఁ గారణం బేమి? యె
వ్వరిహస్తాబ్జ మలంకరించెదవొ? తె♦ల్పన్ రావొకో ప్రేమ శ్రీ
కరమా నాతరమా యెఱుంగఁ బ్రియవా♦క్యం బొందు రానీఁగదే. ౨౦౪

చం. అడిగితి నెవ్వ రీవనుచు ♦ హా! తెలిసెన్ క్షమియింపు దూఱకే
జడమతి వైతివే యెఱుఁగఁ♦జాలవె ము న్నొకమాటు చూచి యం
చడలుట వల్లభార్థముగ ♦ నాత్మ వివేకము దప్పు టయ్యొ నీ
యెడ నిది యొగ్గు సేత కృప♦యేర్పడఁ జెప్పకు మంబుజాక్షికిన్. ౨౦౫

తే. అర భవదీయముఖకలి♦తాక్షరత్రి,యమును జూడంగఁ త్రైవర్గ్య♦మమరుభావి
భద్రసూచనగాఁ దోఁచె ♦ భద్రముద్ర! నిక్క మాఁగద చెప్పుమా♦నిర్ణయముగ.

మ. సరసాదంచితశస్తసద్గుణమణీ♦జాలాలవాలంబునై
కర మొప్పారుటఁ గాదె నిన్ను నవలా♦గారామునం దాల్చు నా
దరముం జూపి వచింపుమా యొకఁడు తా♦త్పర్యంబుతో వేఁడెదం
దరుణీరత్నము గారవించుమణిము♦ద్రా! భద్రమా కాంతకున్! ౨౦౬

ఉ. ఆయలినీలవేణి లలి♦తాంబుజపాణి శుకాభవాణి లో
లాయతమీననేత్ర కన♦కాంచితగాత్ర ముఖావమానిత
ప్రాయసుధాంశుబింబ మధు♦రాధరబింబ సుఖావలంబయే?
"నా" యనిచెప్పఁజాలఁ గరు♦ణామతి నాపయి లేమిఁ గొంతకున్. ౨౦౭

చం. స్థిరకరుణాతిరేకమునఁ ♦ జేర్చఁగదా యురమందు మాటికిన్
నరహితవృత్తిమైఁ బలుకు♦వాక్యముల న్వినుచుందువే కదా

తరళవిలోచనామనము ♦ త్వత్ప్రతిపన్నముగాదె పల్కుమా
దరమున బాలనెమ్మనము ♦ దాఁపక కన్నులఁబోల గాఁగదా. ౨౧౧

చం. వెలఁదికరంబున న్వ్రేలుఁగు♦వేళ నితాంతముఁ గాంతిసంపదన్
వెలయుచునుంటి వీ విపుడు ♦ వేఱుగఁ దోఁచెద వేల చెప్పుమా
యలఘువియోగభారమున ♦ నంగన కుందఁ దదీయగీతులం
జెలఁగెదొ? యింతసేపు సతి♦చెంగట లేమినొ మద్వ్యథంబుగన్? ౨౧౨

శా. ఆలీలారమ యావిలాసగరిమం ♦ బావాక్యనవ్యామృతం
బాలావణ్యవిశేష మానయగుణం ♦ బానీలవేణీభరం
బాలోలాంబకవైఖరీవిలసనం ♦ బామేలిమొయ్యారమిం
కేలీలావతియందు నైనఁగలదే ♦ యెంతెంత చింతించినన్. ౨౧౩

మ. కనఁ గెంగేలఁ బయంటకొంగు దనరం♦గా నిల్చుచున్ సామిమో
డ్పునఁ గన్నుంగవ రాగలజ్జలను సొం♦పుంబెంపఁ గ్రొంజెమ్మటల్
చినుకన్ మోమున నామిటారమును యో♦జింపంగ నా కిప్పుడుం
గనులం గట్టినయట్టు లున్నది గదే ♦ కంజాక్షి వీక్షారతిన్. ౨౧౪

ఉ. చెక్కునఁ జేయి చేర్చునెడఁ ♦ జిక్కులు పాచెడివేళఁ గొప్పునన్
మక్కువమీఱఁగా శ్రవణ♦మండనముల్ సవరించుపట్ల నీ
వక్కడనే మెలంగెదు క♦దా! చెవిలోన వచింపు నాపయిన్
మక్కువఁ బాయఁగా వలదు ♦ మానిని! యంచును రత్నముద్రికా ౨౧౫

చం. చపలమనీష లౌట స్వవి♦చారవిదూరలు బాలికామణుల్
కృపయును గల్గునే యనుచు ♦ నేటికిఁ బ్రశ్నమొనర్పఁ? గల్గెనే
నపరిమితానురక్తహృద♦యంబున నేలక నాఁడు వోవునే
త్రప యనుసాకు పెట్టుకొని ♦ తద్దయు మాఱుమొగంబు వెట్టుచున్? ౨౧౬

ఉ. నా కికఁ దెల్పుమా సకియ ♦ నాకడకు న్నినుఁ బ్రేమఁ బంచెనో?
లేక మదీయవర్తనము♦లీల నెఱుంగఁగ నీవ వచ్చితో
ప్రాకటపార్శ్వవర్తిశుక♦వల్లభసంగతిచే గుణాఢ్య ర
త్నాకర! సజ్జనావన మ♦యారె స్వభావముగాదె నీకిలన్. ౨౧౭

తే. నేఁడు సౌందర్యఖని వైన♦నిన్నుఁ జూడ, భామ సాక్షాత్కరించిన♦పగిదిఁదోఁచె
వెలయునీయంతరంగంబు♦వివరముగన, భామ దానట్టులో యను♦భయముదోఁచె

తే. మాన్యవృత్తంబునై యెక్కి♦మదికి మఱితు,ద మొదలును లేని నిన్ను సు♦దర్శనంబ
కాఁదలంచెద నేఁడు నా♦కై రహింప, నతనుభూతవ్యథాశాంతి ♦ యగు నెనాకు?

వ. అనిన నే నిట్లంటి. ౨౨౦

ఉ. దేవర ! తల్లిదండ్రులయ♦ధీనలు బాలలు గారె ? స్వేచ్ఛమైఁ
దీవరపాటు సన్నె సుద♦తీమణికోటికి ? నొంటిపాటునన్
భావజరూపు లైనమగ♦వారలు డాసినచోట గోల ల
జ్జావతి యాట నేరమె ? వి♦చారము సేయుము దూఱ నేటికిన్. ౨౨౧

ఉ. రూపముచేతనే మనము ♦ రూఢిగఁ జూఱలు గొంటి దంటవా
ల్చూపులమాత్రనే తనువు ♦ సొక్కఁగఁ జేసితి తీపుమాటలన్
గైపునఁ గైవసంబు గను♦కై పొనరించితి వింతచేసి మా
పాపనె దూఱనాడెదవు ♦ పాపము ! నీ కగునయ్య యీకృతుల్ ? ౨౨౨

శా. ఒయ్యారంబు త్వదీయ మయ్యెడల మా♦యొయ్యారి వీక్షించి మే
ల్నెయ్యానన్ విరహాగ్నిఁ గ్రాఁగెడిఁ దనూ♦లీలావికాసద్యుతిన్
అయ్యో ! పాప మనంగ నేరదు సుమీ ♦ యాయల్లకోద్విగ్నయై
యయ్యో పాప మనంగ నేర వకటా ♦ న్యాయ్యంబె నీబోటికిన్ ? ౨౨౩

చం. ఘనత భుజాంకపాళి ధర ♦ గాతుక మందెను నీల సన్మనో
వనగుణధర్మరూపవిభ♦వంబులకై ప్రథ నిన్నుఁ గైకొనెన్
వనజదళాక్షి ! నీహృదయ♦వారిజవాసిని గాఁగ నే విలా
సిని మఱియున్నె మారమణిఁ ♦ జిత్తమునం దెడసేసితేనియున్. ౨౨౪

తే. కొమరుమిగులంగ నీవు గై♦కొనితి వేని. జీవితేశుండ నా దఁట♦సిద్ధముగను
గొమరుదలఁగంగ నీవు గై♦కొనక యున్న, జీవితేశుండ నా దఁట సిద్ధముగను.

ఉ. కోరిన నింద్రచంద్రనల♦కూబరమారుల నైన మెచ్చ దా
మారమణీమతల్లి నిను ♦ మానవనాథు వరించె భూభృదు
ద్ధారముఁ జేసితో సురలఁ ♦ దప్పక ప్రోచెదో రంభ నైన లోఁ
గోరవొకో మహేశమద♦కుంఠనశీలివో పల్కు మేర్పడన్. ౨౨౫

తే. విషముతోఁగూడఁ బుట్టని♦విబుధవంద్య, పతినిహృదయంబునను దాల్చు♦పరమసాధ్వి
చంచలత్వంబుఁ గాంచని♦చంచలాభ, మారమణి యెంచఁగా రమా♦మణికిమిన్న.

తే. సమరముల నిన్నుఁ గీనాశ♦సముదయములు, ప్రాణనాథునిగాఁజూడ♦భావమునను
బ్రమదమున నిన్నుఁ గోరెను ♦ పార్థివేంద్ర, ప్రాణనాథునిగాఁగ మా♦పంకజాక్షి.

చం. అనుచును మాటలాడుతఱి♦నాతనిమంత్రులు వచ్చి దేవ ! మీ
రనిచినమంత్రియున్ గురుఁడు♦హర్షవికాసము దోఁప భానుమం
తునిపురినుండి వచ్చి మిముఁ♦దోడ్కొని రమ్మనినారు వేగమే
కనుఁగొన నేగుదెం డనినఁ ♦ గాంత ! నృపాలుఁడు వోయె గ్రక్కునన్. ౨౨౯

ఆ. భానుమంతుఁ డనెడి♦పల్కు నాచెవిఁ బడ, నొకవిశేష మచట♦నుండు ననుచు
వారివెన్నడించి ♦ వైనంబుగా వింటి, వారివాక్యసరణి♦వనజనయన ! ౨౩౦

ఉ. ఇచ్చెద నంచుఁ బల్కె ధర♦ణీశుఁడు నీకు నిజాత్మజం గడు
న్నచ్చిగ నీసమర్థ శుభది♦నంబు ముహూర్తము నిర్ణయింపఁగా
బుచ్చెఁ బురోహితుల్ మదిని ♦ బొంగి యిదే శుభలేఖ నిచ్చె లే
దొచ్చెము ఫాల్గునాదిని ము♦హూర్త మగుల్ దశమి న్నృపాలకా. ౨౩౧

కం. అని పల్కి వార లేగిన, ననుపమముద మెదను మెదల ♦ నానందరసా
బ్ధిని మగ్నుఁ డై నదశరథుఁ,గన కేఁ బరువిడితి నీకుఁ ♦ గార్యముఁ దెలుపన్. ౨౩౨

చం.*స్మయగమహాశయోద్ధతిని ♦ మాన్చుచుఁ జేరి సువేల నందు దు
ర్ణయపరవాహినీధవుల♦రాణువఁ గూల్చి విరోధు లాఁగినన్
భయదశరంబుల న్విమత♦పంక్తిగళప్రవిభేదశాలియై
ప్రియజయలక్ష్మిఁ జేకొనుచు♦ వే చను దెంచు ముదంబుఁ జెందుమా. ౨౩౩

వ. అని కౌసల్యాదేవికిం జెప్ప యామె నూరార్చె నామెయు నాశుకాంగన న్నహూ
కరించి వివాహసమయంబు నిరీక్షించుచు నల్పం బగుత్రుటికాలంబుఁ గల్పంబుగా
నెన్నుచు దినంబులు ద్రోయుచుండె నని శుకయోగీశ్వరుఁడు పరీక్షిన్మండలేశ్వ
రునకు నెఱింగించిన తెఱంగు. ౨౩౪

శా.మా (ల్యా) లంకృతవక్ష ! దైత్యతరుణీ♦మాంగల్యరుక్కల్పముదీ
కల్యా ! నిత్యవిభూతినాథ ! నిరహం♦కారాత్మ ♦ భక్తౌఘనై
ర్మాల్యోత్కంఠ ! ధరాసుతాధవ ! చతు♦ర్వ్యూహస్వరూపా ! సదా
ఫల్యారంభ ! దయామతీ ! రఘుపతీ♦భక్తావళీసద్గతీ ! ౨౩౫

ఉ. ద(ర్ప)కదర్పహారివిను♦తా! విసతాతనయాసనా! శతా
హార్పతితేజ ! లోకజన ♦ కా! జనకాత్మభవామనోహరా!
స్వార్పితచిత్తభక్తదర♦హా! దరహాసవిలాసభాసురా !
సర్పమదాపహాంఘ్రిజల♦జా! జలజాంబకకోటిసుందరా ! ౨౩౬

*** గ ద్య ము. ***

ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిందాయమానమానసత్వమహా
వైభవ వావిలికొలను రామచంద్రరాయతనూభవ సుజనవిధేయ
సుబ్బరాయనామధేయప్రణీతం బైన శ్రీ కౌసల్యాపరిణ
యంబునందుఁ దృతీయాశ్వాసము.
శ్రీరామార్పణమస్తు.శ్రీశ్రీశ్రీశ్రీ.

———✿———

శ్రీరామచంద్రాయనమః.

# శ్రీ కౌసల్యా పరిణయము.



## చతుర్థాశ్వాసము.

నగజార్చితచరణా!
శ్రీనగసంచరణ! భక్త ♦ చిత్తాభరణా!
దానవహననాచరణా!
శ్రీనయగుణ! దహరశరణ ♦ సీతారమణా!

తే. అవధరింపుము దేవ! మ♦హానుభావ! భావనాతీతవైభవ♦పరమయోగి
భావపుంభావకరుణాస్వ♦భావుఁడైన, బాదరాయణి యిట్లను ♦ సాదరముగ. ౨

– రావణుని రాయిడికి దేవతలు దల్లడించుట. –

శా. కంఠేకాలవిధిప్రసాదకలనా♦గాఢస్మయాంధీకృతా
కుంఠీభూతకఠోరదృక్చ్ఛయదివా♦కౌద్ధైర్యసంఛేదనో
త్కంఠాజ్యాభవకంఠమత్రిదివకాం♦తాగర్భనిర్భేదకృ
త్కంఠాక్రందనపంక్తికంఠముఖర♦క్షుస్సంఘధూర్తత్వముల్. ౩

కం. తాళంజాలక కడువా, క్త్రాళంబులతోడఁ దలుపు♦తాళము లిడి చే
తాళుఁడు దోలినగతిని రొ, దాళంబులతోడ సురలు♦తరుణులు గూడన్. ౪

కం. పెల్లగుగాలికి నాకులు, చెల్లాచెద రైనయట్లు ♦ చేడెలు నమరుల్
దల్లడమున మరపిల్లుచు, నొల్లంబోవుచును జేరి ♦ రొక్కెడ బయలన్. ౫

ఉ. వారియపారదుర్దశల♦వారము పాకవిరోధి గాంచి దు
ర్వారమనోవ్యథానలదు♦రంతశిఖాపరిదగ్ధుఁడై ప్రతీ
కారము లేమికి న్ముఖవి♦కారము లజ్జను జూపుచుండఁ బ్రా
వారనివారితాస్యుఁ డయి ♦ వారలతో నిటు లాడె దీనతన్.

కం. కాలం బిప్పుడు కడుఁబ్రతి, కూలం బై యున్నకతనఁ ♦ గ్రూరారులచే
నాలమున దుఃఖ మొదవెను, గాలము మేలైన గెలువఁ ♦ గాఁ దగుఁ

ఉ. కట్టెఁడి దైత్యుఁ డున్మఁ డని ♦ కైటభమర్దను డూఱనేటికిం
బుట్టినవెంటనే పొలిసి♦పోవుట గల్గునె? భూరుహంబునాఁ
జెట్టయుఁ బుణ్యముల్ ఫలముఁ♦జెందు వివృద్ధినిఁ గాంచి మీఁదఁ దా
నట్టుగుటం దితిక్షను ద♦దాగమకాంక్ష మనంగ మే లగుల్. ౮

శా. ఆద్యుం డవ్యయుఁ డచ్యుతుం డతనికిన్ ♦ సాంతంబుగా దైత్యభీ
తద్యోయానవిహారదుష్క్రి తులు గాం♦తామానభంగక్రియల్
వేద్యం బౌనటు సేయ మే లగుఁగదా ♦ విధ్యుక్తిమార్గంబునన్
విద్యుద్గాత్రులఁగూడి పోవుదము త♦ద్వీక్షాసమాసక్తిచేన్. ౯

ఉ. రండు పదండు పోదము సు♦రల్ ! సురకాంతలు! ధాతఁ జూడ లే
లెండు పితామహుం డగుట ♦ లీలమెయి న్మనకస్తి దీఱఁగా
నొండుపమ న్వచించు మన♦కొక్కట నంతియగాక పాయునే
యొండుగతిన్ నిశాచరమ♦హోగ్రాపద్ధతికారణకారణౌఘముల్. ౧౦

వ. అని చనియెడునవసరంబున నందఱు సర్వతోముఖంబయి పీడాచరణప్రముఖం
బయిన దశముఖసైన్యంబుఁ గనుఁ బ్రొమి పోవ మాఱువేషంబుల ధరించి రండు.

**ఇంద్రాదులు మాఱువేషంబులతో బ్రహ్మం జూడఁ బోవుట.**

శా. కక్షస్థాచలపక్షదారణకళా♦కౌశల్య విద్విడ్భిదా
దక్షుం బౌపవి నుత్తరీయ మొుఱగాఁ ♦ దాల్పంగ నెవ్వారలేన్
వీక్షింత్రత్రిపనద్దెసల్ కలయఁ జూ♦పెట్టంగఁ జాలై సహ
స్రాక్షత్వంబు పులోమజాధవున క♦న్వర్థంబునై భాసిలెన్. ౧౨

ఆ. సమధికప్రతాప♦శక్తివిఖ్యాతుఁడై, నెగడుతన్నుఁ గన్న ♦ నగుదు రనుచు
మోముఁ దెలియనీక♦ధూమధ్వజుం డేగెఁ,దనకు రక్షగాఁగఁ♦దనధ్వజంబు. ౧౩

కం. వెలిఁ బాశముఁ దాల్చుచుఁ జనఁ, దల త్రా డొనరింతు రనుచుఁ ♦ దలఁగనిభీతిన్
మొలత్రాడుగ ధరియించుచు, జలనిధిపతి యేగె ధాతృ♦సదనంబునకున్. ౧౪

కం. పిడిఁ బిడికిట నిడి పట్టుచు, నిడుపుగ నిల యూఁత గొనుచు ♦ నిజసాధనముం
దడఁబడుచరణములం జనె, గడగడవడఁ కభినయించి ♦ కాలుఁడు భీతిన్. ౧౫

చం. అపుడు మహాబలుండు పరి♦హాసము సేయుదు రెవ్వరేని యన్
త్రప నొకకొంతఁ బాపఁ గన♦రాను గదా యనునిబ్బరంబు దా
విపులనిజధ్వజక్షపిత♦వీక్షణయుక్తులఁ జేసిచూపఱం
గృపణత నేగె సత్యజగ♦దీశ్వరదర్శనదోహలంబునన్. ౧౬

నదువేసంబు తనజోగి♦తనమునకును, దగుట మదిలోనఁ బొందక ♦ వగపు,నంది
కునుములుకట్టుగాఁ♦దోలుకొనుచుఁ,జనియెనీశానుఁడువిధాతృ♦సదనమునకు.

తే. ప్రకటకాష్ఠాభృతిముఖకా♦ర్యముల కెపుడు, సాధనంబైనగుదియ యర్క♦సాధనంబుఁ
గాష్ఠభృత్యాదికం బైన♦కార్యమునకు, సాధనంబుగ నొనరించి ♦ చనియె నసుర.
తే. నవనిధుల్ గొల్లవోవుటఁ ♦ దవిలి సిగ్గు, నాదిభిక్షువుతోడ స్నే♦హంబు నేఁడు
సమతఁజెందె న టంచును ♦ విమనుఁడగుచు, నైలబిలుఁడేగెనిర్వేద♦మాత్మ నెరయ.
సీ. జీనువాయులగూండ్ల♦చెలు వందెఁ గబ్భ, రం బిదియేమెయో♦రమణి! యనుచుఁ
గుక్కకాటుల కెంత♦మక్కువ చేసితే, చెక్కులఁ జేర్చి తో♦యక్క! యనుచు
నతులనవీనశ♦య్యాసుఖంబా వెన్న, కర్దమసిక్త మో♦కాంత! యనుచు
వెన్నున బ్రేకము ♦ ళ్లున్న వేలొకొ నేఁటి, నవనాగరకతయా ♦ నాతి !యనుచు
తే. నచ్చరల బలాత్కారంపు♦పాశరకృత, సురతలీలావిశేషముల్ ♦ సూచి నగుచు
నూర్ధ్వలోకామరీతతు ♦ లమ్మగఁ దలలు, వ్రాల్చినడచిరి రంభాది♦వనజముఖులు.

## —⥤ మధురగతి రగడ. ⥢—

వాసరపతిశత♦భాకారంబులు, భాసురమణిమయ♦ప్రాకారంబులు
ప్రమదాకులహిత♦వాఃపూరంబులు, గమగమవలచెడి♦కర్పూరంబులు
తేనియమున్మలసు♦ద్యక్కీరంబుల, తానక మగుమేల్♦తాళ్వారంబులు
కమనామోదవి♦కాసారంబులు, కమలామోదక♦కాసారంబులు
శ్రీరతమహిళా♦శృంగారంబులు, హీరభ్రాజిత♦భృంగారంబులు
పరిమళసంభర♦పాటీరంబులు, పొరిఘుంఘుమ్మను♦పువుటీరంబులు
కంతుముదాకర♦కాంతారంబులు, కాంతమనోహర♦కాంతారంబులు. ౨౧
వ. కలిగి విభాసమానంబై. ౨౨
ఉ. నిత్యము సత్యవాఙ్నిచయ♦నిస్తులవేదవచోవిచారసం
స్తుత్యము సంతతానవధి♦శుద్ధసుఖైకపరామృతాశిదాం
పత్యము సత్యధర్మశుభ ♦ భావరతాంచితభోగశీలసాం
గత్యము సత్యముర్ సురలు ♦ గాంచి చతుర్దశలోకజాత్యమున్. ౨౩
వ. భయభక్తులఁ జేరం బోయి రందు. ౨౪
కం. నిష్ఠాగరిష్ఠయోగి, శ్రేష్ఠులతో ధీవిశిష్ట♦శిష్టులతో స
ద్గోష్ఠి న్వెలిఁగెడియాపర, మేష్ఠిం గని కేలుమోడ్చి ♦ యెసఁగెడిభక్తిన్. ౨౫
ఉ. వారలు వారివారివల♦వంత రవంతయు దాఁప కంతయున్
వారక తెల్పఁగా విధి ని♦వారణమార్గముఁ జూచి యోజనన్
వారలఁ బల్కె వేఱొకట ♦ వారిత మా టిది కల్ల వెన్నుఁడే
కారణజన్ముఁడై యరిని♦కారణకారణ మాట దక్కినన్. ౨౬

ఉ. కావున నిందిరారమణుఁ ♦ గాంచి సమంచితభక్తి వేఁడినం
బావనభావనన్ మహిఁ గృ♦పాపరుఁడై నరుఁడై జనించి యా
రావణజీవనాశనప♦రాయణుఁ డౌచు సురావనుండు నా
శ్రీవనజాతనేత్రుఁ గనఁ ♦ జెచ్చెరఁ బోదము లెం డటం చనన్. ౨౭

వ. వల్లె యని సుర లందఱు నతని ననుసరించి చనుచుండి రంత. ౨౮

*** బ్రహ్మాదులు వైకుంఠమునకుం బోవుట. ***

కం. కంఠద్వయసం బగును,త్కంఠను నుపకంఠమునను ♦ గనిరి విధి శ్రీ
కంఠామరముఖ్యులు వై,కుంఠపురీవరము మది న♦కుంఠితభక్తిన్. ౨౯

మ. కని సాష్టాంగకృతప్రణామ లగుచుం ♦ గంజాతసంజాతము
ఖ్యనిలింపుల్ కమలామనోరమణ ! లో♦కాధీశ ! జేజే యటం
చని పల్మాఱును మ్రొక్కుచున్ హరి ! హరీ ♦ నారాయణా ! యంచుఁ జిం
తన గావించుచుఁ జేరఁబోయి యచటన్ ♦ ధన్యాంతరంగంబునన్. 30

*** వైకుంఠపురవర్ణనము. ***

ఉ. సారపు వేదమూలమును ♦ సత్యము స్కంధము నైగ మోరుశు
ద్ధారమ యోగశాఖయును ♦ జారుకలాసనపత్త్రిముల్ మనో
హారిసుభక్తిపుష్పమును ♦ నైఘన మోక్షఫలంబు నై శుభ
శ్రీరమణీయ మౌచు విల♦సిల్లు ధరారుహపాళిఁ గాంచుచున్. 3౧

చం. సరసమృణాళసల్లలిత♦సారముదావహ నిర్మలోర్మికా
ప్రరుచిరఫుల్లపంకజవి♦భాప్రవిభాసిసుపాణి నవ్యసుం
దరతరకంకణప్రకట♦నాదము నై రవణింపఁగాఁ బొరిం
బొరిఁ గమలాశయంబు లనఁ♦బోలుఁ బురీకమలాశయంబులున్. 3౨

సీ. స్పష్టార్థములతోడ ♦ నష్టాక్షరీమంత్ర,జపమునొనర్చెడి♦శౌకములను
లలిఁ బ్రణవంబు ని♦ర్మలమనోనియతిని, సారెకు జపియించు♦శారికలను
బ్రవిమలభక్తిభా♦వమున ధ్యానానుసం,ధానంబుగల భర♦ద్వాజములను
ద్వాదశాక్షరమంత్ర♦వరపఠనోత్సాహ,సంగతి మీఱుచి♦ట్టంగిగములఁ

తే. జరమపద్యంబు వల్లించు♦శకునవితతిఁ, దారకంబు జపించెడు♦సారసములఁ
జూచి తద్దివ్యమహిమకుఁ ♦ జొక్కి విబుధు, లతులితానందపరవశు♦లగుచుఁ జనఁగ.

సీ. ఏచాయలను డాయ ♦ నాచాయ నందక, శంఖచక్రాంబుజ♦శార్ఙ్గధరులె
యేజాడలను జూడ ♦ నాజాడ నాజాను,బాహుచతుష్కప్ర♦భాలసితులె

యే[శ్రీ]వలను బోవ ♦ నా[శ్రీ]వ వైజయంతీవనమాలికా♦దీప్తతనులె
యేదారులను జేర ♦ నాదారులను హాట, కాంబరదివ్యభూ♦షాళియుతులె
తే. యెందుఁ గనుఁగొన రవిశశి♦దృగ్లసితులె, యెచటఁ జూసిన హరినీల♦రుచిరతనులె
రాజ! వాఙ్మనసాగోచ♦రంబు లచటి, వింత లెంతని వర్ణింతు ♦ వేఱువేఱ. ౩౪
సీ. చన్నచో నెయ్యెడ ♦ నోన్నమోనారాయ, ణాయ యనవములే ♦ నలువుమీఱ
విన్నచో నేవేళ ♦ నోన్నమో భగవతే, వాసుదేవాయ యన♦పరమరవమె
యన్ని వేళలను శ్రీ♦నారాయణచరణౌ, శరణం ప్రపద్యే య♦నురవచయమె
చెన్నుమీఱఁగ నెప్డు ♦ శ్రీమతేనారాయ, ణాయనమోం యను♦నవ్యనదమె
తే. యోన్నమో విష్ణవే యన♦నొప్పునాడియె, యన్యథానాస్తిశరణ మ్మ♦టన్నపలుకె
సర్వకాలంబులందును ♦ శ్రావ్యమగును, భూమిపాలక! వైకుంఠ♦పురమునందు.
ఉ. ఏ ముని చెప్పువాఁడఁ బృథి♦వీశ్వర! యచ్చటిచిత్రముల్ రమా
కాముకనామసంస్మరణ♦కర్మఫలం గని నిర్జరుల్ మదిం
దా మరుదెంచుకార్యమునె ♦ తద్దయు విస్మృతిఁ జెంది వారలుం
దా మొకనీచకీటకవి♦తానముభంగిఁ దలంచి రెంతయున్. ౩౫
వ. ఇట్లచ్చటివిశేషంబు లాలోకించుచుఁ జన ౩౬
సీ. పరమసాత్త్వికభక్తి♦భావంబు నవరత్న, ఘటితలలాటికా♦పటిమ మెఱయ
వీతరాగద్వేష♦పూతసత్సంగతి, కమనీయ మగు పాద♦కమలములుగఁ
బంచేంద్రియాస్పృహ ♦ పరిఘవిల్లెడు నూర్పు, కమ్మతావియ యయి♦ఘుమ్మనంగ
సాంఖ్యరాజాదిక♦సకలసద్యోగవి, తతులు మైఁగల యలం♦కృతులు గాఁగ
తే. లేనగవున బ్రహ్మానంద♦లీలదోఁప, నభిముఖంబుగఁ జనుదెంచు♦నమరవితతి
నరసి క్రేగంటముక్తిక♦న్యామతల్లి, చేరఁ జనుదేక దవ్వ వేం♦చేసె నపుడు. ౩౭
వ. ఇట్లు ద్వారంబు డాయం జని నిలిచి కమలసంభవశచీధవముఖసురనికరంబులు కరంబులు మోడ్చి పలువిధంబుల నుతించి రందు విరించి యిట్లని స్తుతించె. ౩౮

### శ్రీమన్నారాయణదండకము.

శ్రీమద్రమామానినీచిత్తకంజాతహేళీ! దయాశీలశాలీ! సుధాహారపాళీనుతాదభ్రకేళీ! సుధాహారనేతా! జగత్త్రాత! యశ్వేతజీమూతభాపేత! లోకైకనిర్మాత! వేదాళినిర్ణేత! జీమూతధారీ! జగజ్జాలకళ్యాణకారీ! నతాంహోవిదారీ! హితానందకారీ! మహానందకారీ! మముంబ్రోవవేలా? దయాలోల! మౌనం బిదేలా? బళా! భూరికల్లోలమాలావిలాలోలకోలాహలోద్వేలహాలాహలాభీలకీలావిధాజాలమున్ దగ్ధలోకత్రయీశాలమున్ భక్షితాశాపురీజాలమున్

మామకస్వాంతసంచారముం జాల మున్మున్న భక్షించి, లోకాళిరక్షించి దైత్యాళి
శిక్షించి సత్ప్రేమ వీక్షింపవే, శౌరీ! తా మేటివా రంచు లోనెంచు సద్భక్తులన్
శేముషీయుక్తులన్ మోక్షసంసక్తులం జేసి తా మేటి నంచెంచు నాక్రించుఁడౌ దుష్ట
సత్కర్మవిభ్రష్టు దుర్వారదుశ్చేష్టు బల్ నిర్దయావిష్టుఁ గష్టంబులం ద్రోయు వేసత్య
సంకల్ప! భ్రాజద్గుణాకల్ప! త్వత్సేవకానల్పవాంఛాప్రదాన క్రియాకల్ప! సద్భక్త
ముక్తి ప్రకల్పా! యహీనాహిరాట్తల్ప! శ్రీభార్గవీతల్ప! కల్పావసానంబునన్ నీర
యానంబునన్ సద్విధానంబునన్ మీనవై యాశుగాధీనవై పోవునాయోడ జేజే
లకున్ జేడ! వేవేగ కాపాడవా; సోమకుం డద్దిరా వేదముల్ మోక్షసంపాదముల్
ధూతనిర్వేదముల్ సాధుసమ్మోదముల్ పాపసంఛేదముల్ దొంగిలన్ వానిఁ జెంగిం
పవే; బాలు రక్షస్సుతున్ లోకరక్షాపరున్ భక్తినిక్షేపమున్ బల్ దురాక్షేపముం
జేయఁగాఁ జేయి కాలాడకుండంగ స్తంభంబునన్ వీతదంభంబునన్ దోర్విజృం
భంబునం బుట్టి దైత్యాధిపుం గొట్టి ప్రహ్లాదుఁ జేపట్టవే దిట్టవై నామొఱాలింపరా
మమ్ముఁ బాలింపరా మోదవారాశిఁ దేలింపరా శ్రీసతీవల్లభా! పక్షిరాడ్వల్లభా!
మావధూటీసమాటీకనోరఃప్రవాటీ! కనత్స్వర్ణశాటీ! దళత్క్రూరనైశాటధాటీ!
దయాసారపేటీ! హరీ! డింభవేషంబునన్ ధీవిశేషంబునన్ యజ్ఞశేషంబునన్
సారతోషంబునన్ మేఘఘోషంబునం జేరినీవా బలిం గోరి పాదత్రయీపాంసులం
బాంసనుం దోలి యానంద సంధాయివై మీఱవే? లోకముల్ నింపఁగాఁ బెంపఁ
గాఁ ద్రెంపఁగా లీల మూర్తిత్రయం బూను నీయందు నీవాచకంబందు నిల్చుంగదా
లోకముల్; నిల్చు నీయందు సర్వంబు; సర్వంబునుం నీవయై వాసుదేవాఖ్యరాణింతు
వట్లాట నిన్నెన్న నే నెంత? శ్వేతాంతరీపంబు వైకుంఠలోకంబు క్షీరాంబుధామంబు
నీనిత్యధామంబులం చెంతు రౌఁ గాని నీలేని దో దేవ! యేకాణుమాత్ర స్థలంబైన
లోకాళులన్ లేవు; నీయూర్ధ్వకాయంబు సత్యాదులౌ నేడులోకంబులున్ నీయ
ధఃకాయమో తక్కులోకంబులౌ నట్టి లోకస్వరూపా! భవద్వక్త్రబాహూరుపా
దంబులన్ నాల్గుజాతుల్ మనస్సీమఁ జంద్రుండు ప్రాణంబున న్వాయువుల్ నాభి
నాకాశమంఘ్రిస్థలిన్ భూమి శ్రోత్రంబులం దిక్కులం గల్పనం జేసితౌ మున్ను ధీజా
డ్యయుక్తుం బ్రబోధింపఁగా నన్ను శ్రీశారదం బంప లోకాళినిర్మాణముం జేయఁగాఁ
జాలితిం గాదె? తత్తత్ఫలాపేక్ష లేకుండ సర్వక్రియల్ నీదుసంప్రీతిగాఁ జేసి నీవొక్కఁ
డే తక్క వేఱొండుగా దైవమా లేదు లే దంచు లోనమ్మి నిశ్చంచలత్వంబునన్మి
ఱుపుణ్యుండు సద్యోపవర్గంబునుం బొందు టబ్రంబొకో? నేర్చియే నేరకే ప్రీతినే
భీతినేఁ జేయ నీనామపారాయణం బుగ్రపాపౌఘమున్ నాశముం జేయుఁగా; బుద్ధి
మాంద్యంబున న్దాఁకినం గాల్పఁడే యగ్ని? నీవారశూకాకృతిన్ సూక్ష్మరూపంబు
నుం దాల్చి వైశ్వానరాకారివై దేహిదేహంబులం బ్రోతువీ వట్టి దేవాదిదేవా!
దయాశీల! మన్నించి రక్షింపుమా మాధవా! పూతభావా! నమస్తే నమస్తే నమః.

**** విరాట్స్వరూపవర్ణనము. ****

వ. అని వినుతించుచున్న సమయంబున హరియనుమతి ద్వారపాలుండు బ్రహ్మాదుల లోనికిం దోడ్కొనిచనుటయు వార లెదుట నరుణారుణప్రభాభాసితంబును, విశ్వకారణంబునునై జగంబులఁ బావనంబులఁ బావనంబు సేయుపావని మరందంబుగాఁ దత్షణోన్మీలితకనత్కోకనదంబులడంబున నందంబుమీఱు పదకమలంబులును, గమఠావతారసూచకంబు లగుప్రపదంబులును, మనసు గన్ననన్ను జెప్పవలెరక్షించి తెక తేరకు బట్టబయల దయవీడి ద్రోచితేయని యనేకరూపంబులఁ బాదంబులఁబడి వేఁడు నుడుపతివడువునఁ బోఁడిమిఁగనిన నఖాంకురంబులును, గలమాకారంబుఁగాంచుట భక్తకృషీవలుల పాలిపంటనా విలసించు జంఘలును,మధుకైటభవధస్థానంబును భూనీళాహస్తావమర్దనపరిచితంబును నగునూరుయుగళంబును,గగన జనకరూపకం బగునాభీవివరంబును, నృసింహావతారసూచకంబై చరాచరసహితానేక కోటిబ్రహ్మాండంబు లాసూక్ష్మప్రదేశంబుననిముడ్చునేర్పున నఘటనఘటనాచాతురిఁ జాటించుచుఁదన్మయం బగుధరణీతరుణి కర్పించిన వాసోభూషలునా రాజిల్లు పీతాంబరకనకమణిమయకింకిణీవిరాజమాన మేఖలావిలసితంబగు తనుమధ్యంబును, ముక్తికన్యాపేక్షకులకు నన్యాపేక్ష వల దనుసాధువులచే భావితంబును, కౌస్తుభరత్నపీఠివిమలవనమాలా డోలా స్తనకృతకధరాధర కుసుమహారవారప్రవన్మధూళీలాలసభసలవిసరసంయుతంబై రమారమణీరమణీయోద్యానంబునాఁ బొల్చి మృగమదకలితలక్ష్మీవక్షోరుహ ప్రహరణకిణాంకితంబై శ్రీవత్సలక్షితంబైన వక్షస్థలంబును భావిచతుర్భావసూచకంబును, భక్తజనచతుర్విధపురుషార్థదాయకంబును, జతుర్వ్యూహద్యోతకంబును, బ్రియావతంసోత్పలకర్ణభూషణశ్లథాలకాబంధవిమర్దశంసకంబును, నతావనచాతుర్యప్రశస్తంబు నగునాజానుహస్తచతుష్కంబును, మానసభవానూనకేళీవిరాజమానరమామానవతీగాఢపరిష్వంగసమయకరకంకణనికషణాంకితం బగుకంబుకంధరంబును,గమలానయనాంజనరంజితంబును శ్రీసతీరదనక్షతలక్షితంబును నగునధరాధరంబును, గుండలమణిమరీచికారంగస్థలాయమానగండదర్పణంబులును, బుండరీకశోభాభాసమానంబులును మత్స్యావతారసూచకంబులును దుష్టశిక్షణశిష్టరక్షణమున కహంపూర్వికాభావంబు కర్ణంబుల ముచ్చటించుగతి నాకర్ణాంతంబులైన నయనంబులును, స్వనిర్వ్యథననిర్గతగంధవహంబే సమదాళిశిక్షణధూర్వహంబగు టెఱిఁగించురీతిఁ జంపకకుసుమవిలసనంబువహించు గంధవహంబును, గమలాకమలాక్షి భూమిక్షుస్థలగతయగుట సపత్నీసాన్నిధ్యంబున నర్మాలాపంబుల నిరంతరం బాడ వలనుగామిఁ దన్నుఁ జేరుటనో నా శ్రీకారఖ్యాతిఁ గాంచిన శ్రవణంబులును, విక్షేపమాత్రఖలనాశనసమర్థంబులౌటనో కోదండఖ్యాతిఁగాంచిన భ్రూయుగ్మంబును,రాకాసుధాకరబింబసహస్రంబుడంబు విడంబించుముఖంబును, నిజతేజోవిశేషం బశేషంబుగఁ గోటిసూర్యప్రతీకాశంబై వెలుంగుకిరీటంబును గలిగి కామజనకుండయ్యుఁ

కామరహితుండును, క్రోధయుతుండుగాక సాధువిరోధులయందుఁ గ్రుద్ధుండును. మోహలోభదూరుం డయ్యు శ్రీమోహలోభయుతుండును, మదరహితుండయ్యు భక్తావనమదసహితుండును, మాత్సర్యవర్జితుండునయ్యు దుష్టజనశ్రేయోమాత్సర్యవిశిష్టుండును, నైదుష్టవర్ధనుండై శిష్టవర్ధనుండును, నిరంజనుండయ్యు భక్తరంజనుండును, నిష్కలంకుండయ్యు నీలవర్ణుండును, నిర్వికల్పుం డయ్యు వికల్పితవాహుండును, నిరాఖ్యాతుం డయ్యు నారాయణాఖ్యాతుండును, నైబుధావనంబునకై విషంబైన మ్రింగుట దేహనీలిమయు, సముద్రం బైన నీఁదుట నయనంబులును, కొండనైన నెత్తుట యంగుళియు, శుద్ధసాత్త్వికభావంబు భృగుపాదపరాగలక్షితవక్షంబును, కాలస్వరూపంబగుటఁ జక్రంబును, శబ్దమయుం డగుట శంఖంబును, భవరోగాగదంకారుఁ డగుట గదయును, ననంతుం డగుట శయ్యాయు, బోధింప వెలుంగుచు శేషతల్పంబున జగజ్జేగీయమాన దివ్యమంగళవిగ్రహంబునఁ గవిరాజమునిరాజనివహంబులుగొల్వ నాగభోగనిహితసవ్యహస్తుం డయి యూర్వ్వమర్దనకుర్దనంబున హర్షసమ్మర్దంబునఁ దేలుకమలానయన కువలయంబులకు వికాసకారణం బగుమందహాసకౌముదీకిశోరంబులు సంధ్యారాగారుణాధరంబునఁ గోకనదంబందలి రాజహంసంబుఁబోలె నివ్వటిల్ల శేషశయనకోమలత్వంబుఁ బరికింపనో నాఁగ నొరజాఱిన వనమాలికావైజయంతులతో వామదక్షిణనయనాకేకరంబులు రమాకుచకోకంబుల విష్వక్సేననిత్యముక్తాదులయందుఁ బొలుపారఁ బరుండినయమ్మహామహుం గాంచి నమశ్శ్రీమతేనారాయణాయ నమో భగవతే వాసుదేవాయ నమో విష్ణవే నమో జిష్ణవే నమోనమస్తే మమనాథాయ జగన్నాథాయనమో మమదైవతాయ దైవతదైవతాయనమో మమకులధనాయ దుష్టనిధనాయ యని సాష్టాంగదండప్రణామంబులు పౌనః పున్యంబుగ నాచరించి భయసంభ్రమాతిరేకంబునఁ బలుకంజాలక నిట్రాలవలె నిలువంబడిన బ్రహ్మాదులం గాంచి హరి కరుణాకటాక్షవీక్షాపాతమాత్రంబున నెవారిజడు ఫుడుపుచు మేఘగంభీరభాషణంబుల ని ట్లనియె. ౪౧

కం. మార్తురు లేరుగదా నీ, కార్తిసఘటియింప సృష్టి ♦ యలరెడిఁ గద యో
కార్తస్వరగర్భా! నీ, కార్తస్వర మేలగలిగె ♦ నయ్య విధాతా! ౪౨

వ. అని యట్లు యందఱ సేమంబు విచారింప నింద్రాది దేవతలు తమతమపరిభవభవదుఃఖంబుల నక్కాణింపఁ దొడఁగి రందు విరించనుం డి ట్లనియె. ౪౩

### ❋ సురలు హరితోఁ దమ దుఃఖంబులఁ జెప్పుట. ❋

మ. అతులం బైనభయాతిరేకమున స♦ర్వావస్థలన్ రాక్షస
ప్రతతిద్వారములందుఁ గాచి సుముహూ♦ర్తప్రశ్నలం గుంపులై
దితిజుల్ గోరఁగ నాల్గుమోముల భయా♦ర్తిం బల్కు నన్నింటికిం
జతురాస్యుండు పురోహితుం డనుదు రి♦చ్ఛన్ మెచ్చి వాచాలురై. ″ ౪౪

కం. కలిగెడి సుతులకు శ్రేయో, స్థలనం బగురీతి నొసట ♦ జనకోక్తవిధిం
దలవ్రాత వ్రాయుచును నా, తలవ్రాతకు నేడ్పు చుందు ♦ దనుజవిరోధీ. ౪౫

వ. ఇంద్రుం డిట్లనియె. ౪౬

శా. నీకారుణ్యరసాప్తి మాకుఁ గలిగెన్ ♦ నిస్తుల్యసౌభాగ్యభా
గ్యాకుంఠీభవదీడ్యదివ్యరమణీ♦యాకల్పముల్ సర్వముం
జేకట్లన్ దయసేయవైతివి గదా ♦ శ్రీనాథ! పౌలస్త్యు లీ
చేకట్లం దయచేసి రివ్వి యగు నా♦చిన్నెల్ సుమీ కేశవా. ౪౭

వ. యముఁ డిట్లనియె. ౪౮

కం. దండమె శరణంబుగఁ గొని, భండనమున గెలిచినాఁడఁ ♦ బ్రాక్కాలమునన్
దండమె శరణంబుగఁ గని, భండనమున మనినవాఁడఁ ♦ బ్రకృతమునందున్. ౪౯

కం. దండము హస్తాలంబన, దండం బై యమరె నాకు ♦ దండనపదమున్
దండుగుపదమై యొప్పెను, దండము! సురవైరి నెటులు♦ దండించెదవో. ౫౦

వ. కుబేరుం డిట్లనియె. ౫౧

కం. నవతం గాంచిన నిధు లిఁక, నవతం గనె దానవాళి ♦ నవనవధాటిన్
జవమునఁ గొల్లలు వెట్టఁగ; నవ రయ్యెను నాదిభిక్షు♦సఖ్యము నాకున్. ౫౨

కం. దానవకులనాశన! నే, యానవిహీనతను దిరుగు♦లాడఁగ వలసెన్
యానసమార్జనకష్టము, మానవభుక్కులకు విందు ♦ మాడ్కిం దనరెన్. ౫౩

వ. సమీరుం డిట్లనియె. ౫౪

తే. విను ప్రభంజనుఁడవు మేము♦విప్రభంజ, నులము నీవును నొకమహా♦బలుఁడవటర
మమ్ముఁ దాఁకంగరిఘ్నించు♦మాఱుకొన్న, నాశుగత్వంబుచరితార్థ♦మయ్యెనాకు.

వ. వైశ్వానరుం డిట్లనియె. ౫౬

ఉ. కొమ్ములు మూఁటిపై సతులు ♦ కుండలనుంచి చతుర్థశృంగ మం
దిమ్ముగఁ గట్టఁ జేయఁగను ♦ శృంగముఁ గాల్పక దీర్తు వంట; రే
ద్రిమ్మరు లొంటికట్టియన ♦ తీర్చితిఁ గాల్పకయైన దాని నం
చెమ్మెలు వల్కుచుండుదుర ♦ దేమిటి కిచ్చితి వయ్య శృంగముల్. ౫౭

వ. నవగ్రహము లిట్లనిరి. ౫౮

కం. అహరహము సుతులు పుట్టెడి, మహమునఁ దజ్జన్మలగ్న♦మందలిశుభని
గ్రహచారము గలగ్రహముల, గ్రహచారము చాలదయ్యె ♦ రాక్షసవైరీ. ౫౯

వ. మును లిట్లనిరి. ౬౦

కం. ప్రాచీనాచారంబున, మేచకరుచిరాంగ! మునులు ♦ మేకొనుచును య
జ్ఞాచరణులు గాఁ దనయులు, ప్రాచీనావీతి యనుచుఁ♦బలుకఁగ వలసెన్. ౬౧

వ. అచ్చర లిట్లనిరి. ౬౨

కం. జీవమణీమయగృహములు, పావనశంపాలతాభ♦వపువులు మాకే
జీవవిరోధులు నాయె న,యో వసతులఁ జెట్లనీడ ♦ నొదిగినచోటన్. ౬౩

తే. అమృత మొకవేళ విషమగా న♦టన్నపగిది, నమృతి మేమాకు విషమయ్యె♦నబ్జనాథ!
ప్రాణములు వోక మానంబు♦దానవులకు, ధారవోయంగఁ గలుగుట♦దానవారి!

ఉ. ఏడువ హాహా యటంచు నిది♦యెంతటికష్టమనిపాట యంచు, మో
మోడక తిట్ట నవ్వకొనుఁ♦జొయ్యనఁ బట్టఁగ దూఁకులాడి య
ల్లాడఁగ నాట యంచు, నధ♦రామృతమున్ చుమియంగ మోముపై
నాడుచు నిట్లు బందిగృహ♦మందున సిగ్గులుదీసి రచ్యుతా. ౬౫

ఉ. మాసినకోకఁ గట్టి, తల♦మాసిన నూనె మెఱుంగు లేక, మైఁ
బూసి దుమారమున్, నిశను ♦ భూసతి బొమ్మల నొత్తి నిద్రవో
వ్రాసినధాత దూఱుచును ♦ బ్రాఁచిపనుల్ నెఱవేర్పుపొంట నే
బ్రానులరీతి నిల్చి ముని♦పల్లెల వెట్టికి నైతి మీశ్వరా! ౬౬

కం. పురుషాకృతిఁ గొని మేనక, తిరుగఁగ నసురుం డొకడుం ♦ దిగిచె రణేచ్ఛన్
ఖురళికి నయ్యది సుమశర,ఖురళిక్రియఁ బరిణమించెఁ ♦ గుయ్యిడ సతియున్. ౬౭

వ. దేవత లిట్లనిరి. ౬౮

ఉ. రాదు భుజింప జన్నములఁ ♦ ద్రావుట న య్యమృతంబు ప్రాణమా
వోదు, కృశింప దివ్వియలు♦వోయినగూఁడులపోలికం గనుల్
పేదతనంబు గాంచె నిటు ♦ వెన్నెముకం గని చెల్మిఁ జేసి యే
కోదరవృత్తి నున్న త్రిద♦శోదరముల్ గను మంబుజోదరా! ౬౯

కం. ఇక్కట్లు నేమి చెప్పఁగ, నిక్కట్లు లభించె బంది♦గృహసీమను నీ
మొక్కట్లు చూడ వయ్యా, దిక్కట్లో నీవు దక్క ♦ దీనశరణ్యా! ౭౦

సీ. కౌశికావాస మై♦క్రాలునాకం బిప్డు, కౌశికావాస మై ♦ క్రాలె నయ్య
కాంచనాకలిత మై♦క్రమమగా గృహములు, కాంచనాకలిత మై♦క్రాలె నయ్య
భోగినీభోగిసం♦భోగార్హ్మకృతకాద్రి, భోగినీభోగిసం♦భోగ్య మయ్యె
రంభావధూమంది♦రప్రదేశములు కా,రంభావధూమందిరంబు లయ్యె

తే. నేమిచెప్పుదు మయ్య! దై♦త్యేశధాటి,కార సాధ్వసయుక్తులై ♦ యమరలోక
వాసు లెల్లరు నిరతప్ర♦వాసు లగుటఁ, బాడుదోఁచెను నాకంబు ♦ పద్మనాథ! ౭౧

కం. తామరసోదరముఖ్యులు, తామరసోదరుని నిటులు ♦ తద్దయు వేఁడన్
సామరసారసఫణితిన్, సామరసాదరణయుక్తి ♦ స్వామియుఁ బలికెన్. ౭౨

✻ హరి తాను రాముఁడై రావణుం జంపెదనని చెప్పుట. ✻

ఉ. కాలము వచ్చునంతకును ♦ గా దన కెట్టివిరోధినేనిఁ దా
నాలముసేయు టొప్పు నటు ♦ లోటను సైఁచితి నింతకాల మే
నాలములోన వాని మను♦జాకృతిఁ దాల్చి వధింతుఁ బొందు; దు
శ్శీలుఁర కున్నతుల్ పిదపఁ ♦ జేటునకే చుఁడి హేతు వయ్యెడిన్. ౭౩

—⇉ శ్రీరామావతారమహత్త్వము ⇇—

ఉ. ఏ డగు తేపఁ బుట్టి బుధు♦లెల్ల గణింపఁగ రెంటిసౌఖ్యముల్
గూడఁగఁ జేసి పంక్తిరథుఁ ♦ గూర్చియుఁ బంచతేఁ బంక్తికంధరున్
పీడక మోక్షదాయిపుట♦భేదనముల్ ధర నేడు చేసి కొం
డాడఁగ రామనామమును సార్థకతం గనఁ జేసెదం జుఁడీ. ౭౪

మ. జడసాంగత్యముఁ జెందితిం, బిదపఁ గాం♦చంగంటిఁ దా బేలనన్
నుడి, దుష్కీర్తికిఁ గాంక్ష చేసితిని, మ♦న్యుస్ఫారచిత్తుండనై
జడలం దాల్చితి, దోసి లొగ్గితిని, గా♦జవ్యూహనాశంబునం
దిడితిం జిత్త, మొనర్తు రాముఁడనఁ నే ♦ నీలోపముల్ లోపమున్. ౭౫

సీ. జడసంగతిని మాని ♦ జడము నన్ సోఁకినఁ, జేతనంబై యుండఁ ♦ జేయుచుందు
భారవాహక మైన ♦ వర్తనంబును మాని, కష్టజీవుల నెల్లఁ ♦ గరుణఁ జూతు
శాస్త్రనిషిద్ధంపు ♦ సాంగత్యమును మాని, యేకపత్నీవ్రత ♦ మెలమిఁ దాల్తు
శరణన్నమాత్రన ♦ జాగింతసేయక, తటుకున నభయప్ర♦దాత నౌదు

తే. దాత నౌదును రాజసం♦త్రాత నౌదు, మాయలనుడాయకయమేయ♦గేయచరిత
ములను జరియించిపోతుమి♦మ్ములనునిజము, పొందునిర్జరులార! మీ♦రుండుకడకు.

ఉ రాజకులంబునందు సుర♦రాజకుతూహలమున్ ఘటింపఁగా
నాజికిఁ బుట్టి, యాపిదప ♦ యాజకకార్యము నిర్వహించి, యు
ర్వీజకరంబుఁ బట్టి, పృథి♦వీజకుఁ గా దితిజాళిఁ గొట్టి ని
ర్వ్యాజకృపాపరుండ నయి ♦ పాలనసేసెద లోకమంతయున్. ౭౭

కం. సంశయము వలదు మీమీ, యంశంబులఁ గాంచుఁ డిల మ♦హాబలయుతతీ
వ్రాంశుసమానుల వానర, వంశంబుల నాకుఁ దోడు♦పడఁగా వలయున్. ౭౮

వ. అసహాయకార్యధురీణుల రగు మీ కిది యేల యంటిరేని. ౭౯

కం. వేషమున కగుసలక్షణ,భాషలు భాషలకు నయిన♦భంగిని గ్రియలున్
భూషింతురు ప్రాజ్ఞులు నే, దోషంబును లేదు మీరు ♦ దోడ్పడ నాకున్. ౮౦

వ. అట్లుగావున మనుష్యావతారంబున జన్మించునాకు శాస్త్రీయంబును లోకోచితంబును నైన కేవలమనుష్యచర్య మాననీయం బగుఁగాని యొండుగా నేరదు. నరవానరులు వారికి నికారణకారణులు కావున మీరలు వివిధవానరరూపంబుల జన్మించియుండుఁ డని మృదుమధురంబుగాఁ బలికిన. ౮౧

తే. గ్రీష్మకాలంబునందును ♦ జలదరవము, వినినహాలికజాతంబు♦పగిది దోఁప
నిర్భరానందమగ్నులై ♦నివ్వటిలిరి, యమరు లత్యంతమును మోద ♦ మంకురింప.

ఉ. వాడినలేఁత పైరులకు ♦ వానవలెన్, క్షుధగొన్న వానికి
న్గూడినకూడురీతి, మద♦నుం డలయింపఁగఁ జొక్కు చున్నయా
చేడెకుఁ జెల్వుదర్శనము♦చెల్వున శ్రీహరివాక్పరంపరల్
గాఁడిన వీనులన్ ముఖవి♦కాసము భాసుర మయ్యె వారికిన్. ౮౩

కం. జేజేపెద్దయు మొద లగు, జేజే లపు డమితభక్తి♦ జేజే యనుచుం
బూజించిరి హరి; దయగల,రాజును బూజించు సుభట♦రాజియుఁబోలెన్. ౮౪

కం. చనుఁ డని హరి సెల విచ్చినఁ, జనఁ బదములు రావు పాయ♦జల జేక్షణుఁ బే
రనురాగము గలప్రభువున్, జనపదములజనులు విడిచి ♦ చననివిధమునన్. ౮౫

వ. అంత శ్రీమన్నారాయణుండు తిరోహితుండైన. ౮౬

కం. జననీజనకులఁ బాయుచుఁ, జన నేరని శిశులకట్ల ♦ చనఁబూనినచోఁ
జన నొల్లవు పదములు; హరి,యనురాగము పెంపుసొంపు ♦ నది యెట్టిదొకో. ౮౭

వ. ఇట్లు విబుధలోకంబు లోకేశునింగూడి మరలి చనుదెంచునవసరంబున నింద్రుఁడు.

ఉ. ఎన్నఁడు చక్రి పుట్టు ధర? ♦ నెన్నఁడు రావణుఁ గొట్టు? మా విప
త్తెన్నఁడు నేలమట్టుగను ♦ నేడ్తెఱమైఁ దుదముట్టు? నెట్టిచో
నెన్నఁ డదెట్టిపుణ్యునకు ♦ నెవ్వతె యందు జనించుఁ? దెల్పవే
యెన్నుచునైనఘస్రముల♦ నేఁ గ్రమియించెద నో పితామహా! ౮౯

కం. అనియాడిన నింద్రుని విధి, యనూనముగ ననునయించి♦యనియెను వత్సా!
వినుమా తద్వృత్తాంతం, బనుమానము మాని నిక్క♦మంతయుఁ దెలియన్. ౯౦

**కౌసల్యాదశరథుల వివాహముహూర్తమును బ్రహ్మనిర్ణయించుట.**

ఉ. ఫాల్గునశుద్ధపక్షమున ♦ భార్గవవాసరయుక్తమౌచుఁ దా
వెల్గుచు నున్నయాదశమి♦వేళ వృషాహ్వయలగ్నమందుఁ దా
ర ల్గడుభవ్యమై చెలఁగ ♦ రాజితమైన ముహూర్తమందు నా
కు ల్గొనియాడ నాజి తమిఁ ♦ గోసలకన్యకఁ బెండ్లియాడెడిన్. ౯౧

కం॥ దశరథసుతువిక్రమమున, దశకంఠుం డీల్గుఁ జెండు♦ దారుణ మగుదు
ర్దశలెల్లఁ బాయు సుఖతఁ ద్రి,దశు లలరుట గల్గు గోప్య♦దశ నిడుఁ డిదియున్.

కం॥ అనుచు విరించను డాడిన, విని నిర్జరవర్గము పని♦విని యె ననుజ్ఞం
గొనుచు; నట యున్న వేలుపు, ముని యావచనములు వినిన♦ మొద లంతంతన్.

చం॥ నవలవలీదళం బెనయు ♦ నాణెపుబొజ్జటు ముళ్లమానికిన్
స్వవశముగాక యుబ్బి వట♦పత్రమునై మఱి రేఁగుపండునై
జవమున నిమ్మనై రుచక♦సంపదఁ దాలిచి దోసపండునై
యువియునొ నాఁగ గుమ్మడిక్రి♦యన్ మఱి మించెఁ గుతూవిధంబునన్. ౯౫

ఉ॥ సంకట మద్దిరా యనుచు ♦ సైఁపక యేగుచు నారదుండు ని
శ్శంకతఁ గాంచె నిర్జరవి♦శంకటధైర్యశిలాసుటంక మా
లంక రణాంకసంకులక♦లంకఁ గరంకరసాత్తపంకిలా
లంకరణాంకఁ గల్మషక♦లంకను ద్వాస్థినితాతఘోరలంకఁ దాన్. ౯౬

కం॥ మును గని లంకాపట్టన, మును గని పో రిడ నుపాయ♦మును నేభీతిన్
మునుఁగనియసురున కీవిధ, మును గనికర మమరఁ జెప్పఁ ♦ బోలు నటంచున్.

వ॥ చని నగరంబు ప్రవేశించి. ౯౭

*** నారదుఁడు రావణునకు దేవరహస్యముం జెప్పుట. ***

ఉ॥ రావణుఁ గాంచెఁ గట్టెదుట ♦ రాజిలు మోదముతోడ లోకవి
ద్రావణు, దారుణాతతవి♦రావసురారివధూకగర్భవి
స్రావణు, దృష్టిభీకరవి♦షాణపరిష్కృతవత్సధిక్కృతై
రావణు, శ్రావణాధికద♦రప్రతిపాదకకంఠరావణున్. ౯౮

చం॥ కదియఁగఁ బోవునంత దశ♦కంఠుఁడు దిగ్గన లేచి మ్రొక్కి స
మ్మద మెద నిండఁ బల్కె సుర♦మౌని! విశేషము లేమి? లేరుగా
మదయుతయక్షకింపురుష♦మానవదానవకిన్నరావళీ
త్రిదశముఖారు లేరు సమి♦తిక్షితి మార్కొన మమ్ము టం చొగిన్. ౯౯

కం॥ నారదమేదురతరగ, ర్జారవముం బోలెఁ బలుక ♦ రావణున కనెన్
నారదుఁడు తనుజితశర, న్నారదుఁడు ప్రియానులాప ♦ నవ్యసుఫణితిన్. ౧౦౦

కం॥ ఇప్పటివఱకును నీకిల, ముప్పొదవెడి మార్గ మేది ♦ మొనయదు సుమ్మా
యెప్పుడు పుట్టునొ గిట్టుట, యప్పుడె సయిదోడుగాఁగ ♦ నమరు నటన్నన్. ౧౦౧

శా॥ ఏమీ! మాటనుమాటగా ననితి మౌ♦నీ! చాకపో శక్యమే
భూమిన్ దేహులకంచు నా యెదుట నీ♦వు న్నాదుప్రస్తావనన్

నీమాటల్ గడువింత లయ్యె వినఁగా ♦ నిద్రావశోన్మాదమో
యేమీ! యే మనితయ్యె! వింశతిభుజా♦హీనోద్ధతిం జూడవో. ౧౦౨

కం. హరిశమనతపనదహనే, శ్వరజంభవినాశకప్ర♦భంజనులకు నే
హరిశమనతపనదహనే, శ్వరజంభవినాశకప్ర♦భంజనుఁడఁ గదా. ౧౦౩

ఉ. ఎవ్వరు నన్ను నింకఁ బోలి♦యింపఁ గలారొకో లావరుల్ బళా
చివ్వను నాదుబారిఁబడి ♦ చిక్కక స్రుక్కక పోనివారు లే
రెవ్వరు బమ్మతక్క, నతఁ ♦ డేమిటి లెక్కయొ లేఖకుండు న
న్నవ్వకు నీడ్చుపోటరిత♦నం బొకయింతయు లేదు వానికిన్. ౧౦౪

కం. మృత్యువు మృత్యువుఁగూర్చితి, సత్యంబుగ న న్నెవండు ♦ చంపునొ? నీ వా
చిత్యంబెఱుఁగక యాడితి, సత్యవచననామరచన ♦ సార్థక మగునే? ౧౦౫

మ. అనిరన్ దేవరహస్య మొండు గల దో♦ యన్నా యెఱింగించెదన్
వినిరన్, నీకు హితంబె కోరుదుఁగదా,♦విచ్ఛేసితిం దెల్పఁగన్
జనుమా నిర్జనరక్షకావృత విహీ♦న స్తంభవిస్తీర్ణదీ
ర్ఘనికాయాంతరభాగ మొక్కఁడును జే♦ర న్వేగమే రావణా. ౧౦౬

ఉ. ఇట్టుల యారివేరపుము♦నీశుఁడు పల్కిన రి మ్మటంచు లోఁ
దొట్టినదుర్భరస్మయముఁ ♦ దోఁపఁగఁజేయఁ బదప్రచారమే
యిట్టలమైన హుంకృతుల ♦ నింతయు జంకక వేగ చేరె న
ప్పట్టున సద్విశాలతర♦భాసితసంజవనాంతరంబునన్. ౧౦౭

కం. వెనుకనుచు న్మనకనుచుం, దనప్రక్కఁ గనుచుఁ గనుచు ♦ దశకంఠు మొగం
బనియెను సురముని రావణ! యనకుమ యెవ్వారితోఁ ర♦హస్యము దీనిన్ ౧౦౮

కం. హరియఁట దశరథసుతుఁడై, ధర మానవుఁ డగుచుఁ బుట్టి ♦ దానవకులసం
హరణక్రీడను నిను నీ,పరివారముఁ ద్రుంచునంట ♦ భద్రము సుమ్మా. ౧౦౯

కం. అని యిరుసెవి వినకుండఁగ, నని లేవఁగఁ బంక్తికంఠుఁ ♦ డనెఁ ద్వరయేలా
యనఘా! వివరింపఁగదే, మనసున నీ వెఱఁగియున్న ♦ మాత్రంబైనన్. ౧౧౦

కం. ఎప్పు డదెవ్వని కేయెడ, నెప్పుడఁతికి నేమికతన ♦ నెన్నాళ్లకుఁబై
నెప్పట్టునఁ బుట్టునొ హరి, తప్పక వివరింపవయ్య ♦ దయ దైవాఱన్. ౧౧౧

కం. కొనియాడుచుఁ దను వేఁడుచు, విన నాడినఁ గాంచి కరుణ ♦ విడనాడక యా
ముని పలికె నింపుదొలఁక, న్వినుమా వత్సా! వచింతు ♦ విశదముగాఁగన్ ౧౧౨

ఉ. నీ వొనరించురాయిడికి ♦ నిల్వఁగలేక సురాదులెల్ల దుః
ఖావిలచిత్తులై కమల♦జాసనుఁగూడి హరి న్నుతింపఁ బా

పావహు నిన్నుఁ ద్రుంతు నని ♦ యాఁడెను మానవజన్మమెత్తి యో
రావణ! యయ్యయోధ్యకును ♦ రా జగునాజికిఁ బుట్టి నిన్నిటన్. ౧౧౩

ఉ. ఒప్పగుఫాల్గునాదిని ము♦హూర్తమగు న్దశమిన్ వృషంబునం
దప్పక యామ్యకోసలసు♦త న్వరియించెడినంట యాజి పెం
పొప్పఁగ రాముఁడై జనన ♦ మొందుచు వారిసుతుండుగా ధరన్
ముప్పొనరించు నీకు నఁట ♦ పూని వచించె విధాత నే విన్. ౧౧౪

ఆ. ధాతవ్రాఁత మనకుఁ ♦ దప్పింపఁగా రాదు, ధాతతాతసేత ♦ తప్పిపోదు
కాన నింక నీవు ♦ గానఁ గానఁగఁ బొమ్ము, వైర మేల నీకు ♦ వాసవునకు? ౧౧౫

వ. అనిన. ౧౧౬

కం. వికలతనొందియు మనమునఁ, బ్రకటితమై చెలఁగనీక ♦ వదనంబున లోఁ
దికమిక నణఁచుచు నవ్వుచుఁ, బకపక రావణుఁడు పలికె ♦ భయరహితుబలెన్.

కం. హరియఁట నను ద్రుంచెడి నఁట, నరరూపముఁదాల్చి దీని ♦ నమ్మఁగఁ జను నే
హరి నను గెలువం గలిగిన, దురమున నిన్నాళ్లదేల ♦ ద్రుంపక మానెన్? ౧౧౮

మ. అజసంతానము నన్నుఁ గూల్చునఁట యా♦రా! చూడ సిగ్గయ్యె నా
యజునిం గెల్చినవాని గెల్చితిఁ దృఢా♦హంకార రేఖన్ సురో
ధ్వజినీకాంతనితాంతగర్వహనన ♦ వ్యాపారపారీణభూ
పజనౌఘాజవితాన కేసరిఁ గదా ♦ పాటింప నే నారదా! ౧౧౯

సీ. ముఖభంగదశ నొందె♦మూల్గుచుఁ బోయిరి, సంగ్రామసింహముల్ ♦ క్ష్మాతలమున,
గడు నంత్యదశ నొంది ♦ మడిసిరి యెదిరిన, సకలసింహాసన♦సంస్థితులును
మధ్యస్థతను గాంచి ♦ మనిరి మాంధాత్రాదు, లణఁగుచుఁ గీనాశ♦రణపదముల
సర్వపదాసక్తిఁ ♦ జాలించి రెల్లరు, సత్త్వనిస్తులపుణ్య♦సంపదలను

తే. హరియు గిరియు నదెచ్చోట♦నణఁగియుండె, నట్టి పట్టుల నెల్లఁ దా ♦ దిట్టయేని
గుట్టుమాట లటంచును ♦ వట్టిమాట, లిట్టు చెప్పెదె భయపెట్ట♦రట్టుమీఁటే. ౧౨౦

వ. అయినను నీమాటఁ గొంత విశ్వసించెదఁగాక వారలకు వివాహంబై ౧౨౧

కం. అలుమగండైనఁ గదా, వాలుమగం డొకఁడు పుట్టు ♦ వారికి నన్నుం
జాలుమగంటిమిఁ ద్రుంపఁగఁ; జాలనెయొకయుపమ దానిఁ♦జక్కం బెట్టన్? ౧౨౨

ఉ. మూరుత మంచు నిర్వదియు ♦ మూఁడవడా దశమి న్వచించితో
వారక రమ్ము తెల్పెద ను♦పక్రమ మామఱునాఁడ సర్వమున్
బీరము లాడ నేమిటికిఁ ♦ బెక్కులు మిన్నక మున్న; రిత్తయై
సారససూనువ్రాఁత సన ♦ సైఁ యను మప్పు డటంచుఁ బల్కినన్. ౧౨౩

ఉ. వల్లె యటంచు నేగె ముని♦వల్లభుఁ డంత దశాననుండు రే
యుల్లములోనఁ బన్నుచు దు♦రూహలు గొన్ని మయాత్మసంభవా
త్ఫుల్లవిలోచనానిలయ♦ము న్వడిఁ జొచ్చి శయోపవిష్టుఁడై
పెల్లుగఁ జింతసేయ నిజ♦వీక్షణపంక్తులు త్రిప్ప కంతటన్. ౧౨౪

శా. చింతాక్రాంతవిషణ్ణమానసుల రై♦ చింతింప నాస్వాంతమున్
సంతాపాతిపరీతమై కలఁగెడిం ♦ జాలం జుమీ వల్లభా!
వింతాయెన్ విపరీత మేమి యొదవెన్ ♦ విఘ్నం బది పైనెత్తెనా?
యంతే నెంతకు నీవు చింతిలవుగా ♦ యాత్మేశ్వరా! తెల్పవే. ౧౨౫

- మందోదరి రావణునకు నీతిచెప్పుట. -

మ. అని మందోదరి దీనవాక్యములఁ జే♦య న్విన్నపం బంగనా!
విను మంచు న్వివరించె సర్వమును దా ♦ విన్నంతఁ బ్రత్యూహముం
బొనరింపంగఁ దలంచి ముచ్చిల సతిం ♦ బోవంగఁ దా నెంచుటల్
విని యాతెన్వి విచారమానసమున ♦ న్వీక్షించి దీనాస్యయై. ౧౨౬

ఉ. దేవరహస్య మంచు నిది ♦ దేవమునీశ్వరుఁ డాడె నంటివో
దేవ! రహస్య మీఁగతిని ♦ దెల్పఁగఁబోలునె బాహిరంబుగా
దేవర హాస్యకారణ మ♦దే దిగులొందితి వంచు నంద్రుగా
దే? వరబాహువిక్రమర♦తి న్నినుఁ బోలఁ గలారె యెవ్వరేన్? ౧౨౭

ఉ. కల్లలు వల్కి నూఱయినఁ ♦ గార్యము పెండిలి సంఘటింపఁగాఁ
జెల్లరె! తేరతేర కిటు ♦ చేయఁగఁ బూనుదె పెండ్లివిఘ్నమున్?
జెల్లునె నిర్నిమిత్తముగఁ ♦ జేటొనరించుపనుల్? దలంపఁగా
వల్లభ! దిగ్జయప్రథను ♦ వ్రాలితి వేటికి నీకు భీతిలన్? ౧౨౮

కం. దైవముపూనినకార్యము, నీవా తప్పింపఁగలవు ♦ నిష్ఫల మగుఁ గా
దైవము ప్రతిఘటియించినఁ, గేవల మిలఁ బౌరుషంబు ♦ కీర్తిం గనునే? ౧౨౯

వ. అనుటయు. ౧౩౦

కం. భీరువుగతిఁ బలికెదు కర,భోరూ! నావిక్రమంబు ♦ నూహింపక యుం
భోరుహలోచనహరజం, భారులసంరంభజృంభ ♦ మణఁగదె నాచేన్. ౧౩౧

ఉ. కేవలదైవమే శరణు ♦ కీడిడ మేలిడ నంచు నాడుటల్
కేవలమౌఢ్యమే యని స♦ఖీమణి! మామకనిశ్చయాశయం
బేవిధి నప్రమాదమున ♦ నెల్లపనుల్ ఘటియింప వ్యర్థమై
పోవును? గార్యసిద్ధులకు ♦ బుద్ధియు శక్తి నిదానముల్ చెలీ. ౧౩౨

తే. నిచ్చ దైవంబె ఫలమెల్ల ♦ నిచ్చునేని, పౌరుషం బేలవలయునో ♦ పంకజాక్షి !
వండి తినకున్న నుదరంబు ♦ నిండునటవె, కూరునా నోర దైవంబు ♦ కూడు వెట్టి.

వ. అనిన మందోదరి యి ట్లనియె. ౧౩౪

ఉ. కారహితంబు నాదునుడి ♦ కారముగా రుచికంబె? చేఁదె శం
కారహితంబుగా బ్రతుకఁ? ♦ గాంక్షయొనర్చెదో విష్టపంబు లం
కారహితంబు సేయఁగను ? ♦ గన్నుల వ్రాల్లవో యేమొ నాయలం
కారహితంబు ? లయ్యొ నుడి ♦ కారముగాఁ గొనె దీవు బోధముల్. ౧౩౫

ఉ. దైవ మటంచుఁ బల్కెదవు ♦ దైవ మనం గలఁడే యొకండు వే
ఱావలఁ బ్రాణవల్లభ ! మ ♦ హామహు నెవ్వనికంటె సెప్ప లో
కావళి జన్మకర్మవిల ♦ యంబుల కొను సమర్థ మట్టిఁడా
శ్రీవనితామణీధవుఁడు ♦ శ్రీహరి గాక యటంచు వెండియున్. ౧౩౬

కం. సారసనయనేశుల దో, స్సారమునన్ గెలిచి తంటి ♦ సరి యిపు డేలా
కారానికార్యమునకున్, భీరువుగతిఁ గడఁగ సాటి ♦ వీరులు నగఁగన్. ౧౩౭

వ. కావున నీవు దైవంబు గలఁ డనినను లేఁ డనినను, నీవీకార్యంబునకుం దొడంగు
టకుం గారణంబు లేదు. నాపలు కాలకించి యీసాహసంబు మానుమని వేఁడిన.

ఉ. కొందల మందు డెందమునఁ ♦ గుందకు ముందుకుముందు మందయా
నం దగ నిందుఁ దేర మ ♦ యనందన ! సందు లభించినన్ శతా
నందపురందరేందురవి ♦ నందను లందఱు డింద బ్రందుటన్
గందును గుందు చిందఁగను ♦ గందునుమందల నొంద సుందరీ. ౧౩౯

వ. అని యూఱడించి రహస్యంబుగ గగనగమనచరణంబు లగుహయంబులు పూ
న్చిన తేరెక్కి సత్వరుండై. ౧౪౦

రావణుఁడు కౌసల్యం దొంగిలించి కొనిపోవుట.

చం. అటు చని రావణాసురుఁడు ♦ హాటకకూటచపేటవాటికా
కుటిలకవాటఝాటపటు ♦ కూటమహాట్టాత్కటఘోటకచ్ఛటా
భటపటలీకనద్వికటఁ ♦ బ్రాకటపట్టనరత్నకృక్రియో
ద్భటభటపార్భటుల్ గలిగి ♦ భాసిలుకోసలపూర్మణిం గనెన్. ౧౪౧

చం. తతకుటిలస్వభావుఁడు స ♦ దాప్రమదాచయపశ్యతోహరుం
డితఁడు యథాస్థితిం గనిన ♦ నేమియొనర్చునొ నన్నునంచు మా
నితమ యగోచరత్వ మని ♦ నీలిముసుంగు పొసంగ నుండెనో
క్షితిఁ బురలక్ష్మి నాఁ గటికి ♦ చీఁకటికప్పున నొప్పె నయ్యెడన్. ౧౪౨

తే. ఎప్పు డే తెంచునో యని ♦ యెదనుభీతి,గొనుచు ముసుఁగునఁదొంగిక♦న్గొనుపురీవి
సారలోచన దృగ్చాక♦చక్యమనఁగ, దీపకళికలు నటనిటఁ ♦ దేజరిల్లె. ౧౪౩

వ. అట్టినగరంబు నేకతంబప్రవేశించిరావణుండు కౌసల్యాదేవి పరుండినగరుసొచ్చి.

సీ. పటుతరావిశ్లథ♦భర్మాకలితమూల్య, నవ్యావిదితమూల్య♦భవ్యమాల్య
సర్వసర్వంసహా♦జననుతసౌశీల్య, బుధమనోహరమృదు♦పూతకల్య
సర్వజగజ్జన♦శ్లాఘితసత్కుల్య, సకలసాధ్వాస్యాంబు♦జాతకల్య
సతతపద్మార్చనా♦సాదితసాఫల్య, మృదులగుణోత్కరా♦విదితతుల్య

తే. విపులసత్కార్యవిరచనా♦నుపమకల్య, స్వీయకౌటిల్యహృత్తీవ్ర♦వికటశల్య
మతులసువిశాలతల్పని♦ద్రానుకూల్యఁ, గనియెఁ గౌసల్య మరుశర♦కలితతాల్య.

సీ. అతనుతాపాతిశ♦యంబునఁ బొరలుచో, రాలినపుష్పహా♦రములదాని
బ్రక్కనొక్కిపరుండ ♦ భర్మాంగదఘనము,ద్రాయుతగండద♦ర్పణముదాని
నాజనిరంతర♦ధ్యానబలంబున, వానికౌఁగిటఁ గల ♦ ప్రాలుదానిఁ
గలఁ జెలినర్మభా♦షల నైనకోపాన, భ్రూలతాక్షిప్తిని ♦ బొలుచుదాని

తే. వామనీకృతగళమున ♦ వఱలుదానిఁ, గలితనిద్రావశం బైన♦కనులదాని
సామికుంచిత మైనహ♦స్తంబుదానిఁ, గాంచె నసురుండు త్రైలోక్య♦వంచకుండు.

ఉ. హాసవికాసమోహనత♦రాస్యము భ్రూనటనంబు స్వీయదం
తాసమపీడితాధరము ♦ నాదృతరక్తకపోల ముత్పతి
ద్భాసురభూర్యురోజములు ♦ పార్శ్వచలన్మణిహారవారముల్
దానవవైరి గాంచి కృపఁ ♦ బాసి యుపాసితవంచనామతిన్. ౧౪౭

కం. అనుపమసురూపరేఖా,ఖని నిస్తులసుగుణమణిని ♦ గన్యామణినిం
గనికర మెదలేకసురుఁడు, గని కర మెడ లేక బాల♦గ్రహియించి వెసన్. ౧౪౮

వ. లంకకుం జని యామంచంబుతో నొక్కకనకపేటినుంచి పారావారతీరంబున నిలిచి
సాగరుం బిలిచిన భయకంపితగాత్రుండై సన్నిహితుం డైన నతనికి నమ్మందసం
బుఁ జూపి. ౧౪౯

కం. మానవదానవశాత్రవ, దానవకింపురుషయక్ష♦తతులకు నైనం
గానీ లోచనగోచర, మైన న్నినుఁ ద్రుంతు నిది యథార్థము సుమ్మీ. ౧౫౦

వ. అని రక్షింప నప్పగించిన వల్లె యని యతం డతనిసమక్షంబునఁ దక్షణంబ దానిఁ
దిమింగిలంబనునొకమహామీనంబున కప్పగించె నిట్లు సముద్రుండు. ౧౫౧

కం. బాధితబృందారకదు, ర్మేధాహితకరణుఁ డయ్యె ♦ మేల్సాధులకున్
సాధులు పూజ్యులు తలఁపఁగ,భూధవ! సర్వత్ర ఖలులు ♦ పూజ్యులు గారే.

వ. అని శుకయోగీంద్రుండు పరీక్షిన్నృపేంద్రున కెఱింగించిన తెఱంగు. ౧౫౩

## తరళము.

ర(వి)సుతాధవ ! పాపమోచన ♦ రాజితాంబుజలోచనా
రవిసుతాహితపక్షపాతక ♦ రక్షితామరజాతకా !
రవిసుతావన ! భక్తజీవన ♦ బ్రధ్నసత్కులపావనా !
రవిసుతాసమనీలవిగ్రహ ♦ రాక్షసోత్కరనిగ్రహా ! ౧౫౪

## మాలిని.

ప్ర(ణ)తదివిజవారా ♦ భార్గవీచిత్తచోరా !
రణవితరణవీరా ♦ రమ్యసాధుప్రచారా !
ఫణివరమృదుతల్పా ♦ భక్తసంఘాతకల్పా !
గుణరహితచరిత్రా ♦ కోమలశ్యామగాత్రా ! ౧౫౫.

## గద్యము.

ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిందాయమానమానసత్వమహా
వైభవ వావిలికొలను రామచంద్రరాయతనూభవ సుజనవిధేయ
సుబ్బరాయనామధేయ ప్రణీతంబైన శ్రీకౌసల్యాపరిణ
యంబునఁ జతుర్థాశ్వాసము.

శ్రీరామచంద్రార్పణమస్తు.



శ్రీరామచంద్రాయనమః.

# శ్రీ కౌ స ల్యా ప రి ణ య ము.

## ప ం చ మా శ్వా స ము.



మోక్షఫలద ! సీతా
వామాక్షీవిమలహృదయ♦పంజరకీరా !
క్షేమంకర ! నతకింకర !
రామా ! భవభయవిరామ ♦ రాజలలామా ! ౧

తే. అవధరింపుము దేవ ! మ♦హానుభావ !, భావనాతీతవైభవ ♦ పరమయోగ
భావపుంభావకరుణాస్వ♦భావుఁ డైన, బాదరాయణి యిట్లను♦సాదరముగ. ౨

కం. ఆమందయాన దృఢని, ద్రాముద్రితభద్రనేత్ర♦రాజీవయుగం
బామునొాన జాగరూకత, యామందసమందు నల్ల♦నల్లన విచ్చెన్. ౩

ఉ. కన్నులు విచ్చి నల్దెసలఁ ♦ గాంచి దురంతమహాంధకార మా
యన్నులమిన్న దీప మిటు ♦ లాఱిచె నేల వయస్య యంచు లో
నెన్నుచు నోవయస్య! సఖి ♦ యిందుముఖీ! యనఁ గిమ్మటంచుఁ దా
విన్నదిగాక యేమి యిది ♦ వింత య టంచును బ్రక్కఁబొర్లఁగన్. ౪

తే. ప్రక్కను బొర్లఁ బెట్టి నిరు♦ప్రక్కల రక్కనితాఁకఁ జేతు ల
మ్మక్క యటంచు లేవఁగ ర♦యమ్మున మూర్ధము దాఁక నంతయు
న్మిక్కిలియక్కఱం దడవి ♦ నివ్వెఱపాటును బొంది యేమి యీ
ట క్కని చింతసేయఁగఁ ద♦టాలునఁ బైఁట యొకింతజాఱినన్. ౫

ఉ. ఆరమణీమతల్లి ఘన♦హారమణీద్యుతిఁ గాంచి యాత్మదు
ర్వారభయాతిసంభ్రమదు♦రత్యయశోకవివర్ధనంబుగా
మారణకారణం బయిన♦మందసయే తనయునికి పట్టుగా
ఘోరత దాపురం బగుటఁ ♦ గోమలి యేమన లేక చింతచేన్. ౬

కం. తడుపుచుఁ బెదవుల నెడవడి, దడదడ నెడఁదవిసిపడఁగఁ ♦ దడఁబడఁ బదముల్
తొడిఁబడ గడితపుగొడవలు, గుడువఁగ నొడఁబడితి ననుచు ♦ గోడుంగొనుచున్.

వ. అయ్యాది జననీజనకపరిజనకృతం బైన వంచనగా నెంచుచు. ౮

## మందసయందుఁ గౌసల్య విలపించుట.

సీ. ఆమందసమదాశ♦యాకలితం బైన, యీమందసము కేళి♦గృహమె నాకు
జడమతి నగుచు నేఁ ♦ బడిదొర్లఁగాఁ బేటి,చలనముల్ దూఁగుటు♦య్యేలలెనాకు
హాటక ఘటితమై ♦ యనువొందుపక్షంబు, నరయంగ మేల్దోమ♦తెరయె నాకు
నాదిగర్భేశ్వరి ♦ నైజనించుటఁ బెట్టె, చలమంచమా నాకు♦జలజనయన !
తే. తల్లి! నీగర్భమునఁ దొల్లి ♦ తాల్చి కాంచి, పెంచి యిట్టులు చేసితి♦వంచనంబు
కనకమణిపేటి నను గర్భ♦మున ధరించె,ముందు నే నేమికీడుల♦నొందఁ గలనొ.
సీ. తల్లిగో! నీ కేల ♦ దాయాద నైతినే, వనములపా ల్సేయ ♦ వనజనేత్ర ?
కన్నతండ్రీ! నీకుఁ ♦ గరుణ లేదాయెనా, గుట్టుగా నను మట్టు♦పెట్టఁ దలఁప?
సకియలారా! మీకు ♦ శత్రువనైతినా, వంచనచే నన్నుఁ ♦ బొంచి చంప?
భటులార! నామన్కి♦కటువాయెనా మీకు,నొంటిగా విడిపించి ♦ కంటగింపఁ
తే. జేఁదుమేపితినే మీకుఁ ♦ జిలుకలార! వంకలను దోలితినె గోరు♦వంకలార
వంచనముఁ జేయ నేలయో♦యంచలార! పెంపుసొంపారనను హెచ్చ♦రింపరాదె.
సీ. రుషఁ గాన నిడ నీక♦రుణ మెల్లఁ దీఱెనా, ఋణమెల్లఁ దీఱెనా ♦ యిటువధింపఁ
గరుణలేదాయె ని♦కారప్రకారంబు, కారప్రకారంబు ♦ గారవింప
నయినదానికిని మి♦మ్మన నేమిఫల మింక, మన నేమి ఫలమింక♦మహిని నాకుఁ
గన్నయ్య! బలుదురా♦గ్రహారతిఁ జిక్కితే, గ్రహారతిఁ జిక్కితిఁ ♦ గానలోనఁ
తే. గటకటా! యిట్టికష్టంబు♦గాంతుననుచుఁ, బలుకరొక్కరయో యేమి♦వంచనంబొ
నేర మేమియొనర్చితి ♦ నే నెఱుంగఁ, దల్లిదండ్రులు నాపయి♦దయఁదొలంగ. ౧౧
వ. అని నిష్కారణంబు జనకుం డేల నన్ను నిగ్రహించుననియు నెవ్వండేనియు వంచన చేసియుండఁబోలు నని తలంచి. ౧౨
సీ. కరులార! రాజకిం♦కరులార! కరుణచే, నాలకింపఁగ రారె ♦ యాఁడుకుయులు
ఝరులార! వన్యని♦ర్ఝరులార! కరుణచే, నాలకింపఁగ రారె ♦ యాఁడుకుయులు
నరులార! కానన♦చరులార! కరుణచే, నాలకింపఁగ రారె ♦ యాఁడుకుయులు
హితలార! కానచెం♦చితలార! కరుణచే, నాలకింపఁగ రారె♦యాఁడుకుయులు
తే. కారణములేక యిట్టు ని♦కారమునను, నన్ను నెవ్వరో కొనిపోవు♦చున్నవార
లమ్మలార! దయారస♦స్వమ్ములార,! యక్కలార! మనుపరె పె♦న్మక్కువార.
ఉ. పుట్టితి శ్రీవరంబునను ♦ భూవలయేశునిముద్దుఁబట్టినై
పెట్టితి బీదసాదులకుఁ ♦ బిల్చి యభీష్టములెల్లభక్తిమైఁ

బట్టితి మానిరాత్పురణ♦పద్మము లెన్నియొ ప్రాణనాథుఁ జే
పట్టఁ గడంగఁ బుట్టె నిటు♦వంటిప్రమాద మిఁక కేమి చేయుదున్. ౧౪

ఉ: దిక్కులనేలునట్టిజగ♦తీధవుపుత్రిక నై జనించి పె
న్మక్కువఁ బెంపఁగాఁ బెరిఁగి ♦ మాన్యతఁగాంచియు దిక్కుమాలి నే
నక్కట! తావకీనజఠ♦రాంతరవాసముఁ గంటిఁ బెట్టియూ!
యిక్కడనుండివెల్వడుట ♦ యిం కొకజన్మముఁ గాంచుటే కదా. ౧౫

తే. నన్ను గర్భంబునను దాల్చి♦కొన్నకతన,నిన్నుఁ దల్లిఁగ భావించు♦కొన్ననన్నుఁ
బలుకుటా మాడ్కిఁబలికె దే♦బదులు పలికి,మందమతియాటచేతనా♦మందసంబ!

సీ. తమ్ములారా! కపో♦తమ్ములారా!దయ, నాగతిఁ జెప్పరే♦నాయనకును
అన్నలారా! లేడి♦కన్నెలారా! దయ,నాగతిఁ జెప్పరే ♦ నాయనకును
అమ్మలారా! మయూ♦రమ్మలారా! దయ, నాగతిఁ జెప్పరే ♦ నాయనకును
అయ్యలారా! కాన♦నెయ్యురారా! దయ, నాగతిఁ జెప్పరే♦నాయనకును

ఆ. గోసలేశుపట్టిఁ ♦గోపాన నిటుపట్టి, నంచకుం డెవండొ ♦ పొంచి యిటులు
చేసె నయ్యలార! ♦ చెప్పఁగా ఘనులార, పోవరయ్య నన్నుఁ ♦ బ్రోవరయ్య. ౧౭

- విభూతి వృత్తము. -

దిట్టతేనిపట్టినై, పుట్టియున్ విభూతి పోఁ
గొట్టి పెట్టె పట్టుగన్, నెట్టితేల దైవమా. ౧౮

న. అని హాహారవంబునఁ బలవించుచుఁ గిమ్మనుశబ్దంబు గానక తనయునికియుఁ దెలి
యక చలనంబుకతంబున నరణ్యంబున నెవరో తానున్న మందసంబుఁ గొనిపోవు
చున్నారనితలంచి చేయునదిలేక మహాభయకంపితగాత్రయుఁ బ్రస్వేదక్లిన్నోత్తరీ
యయు నై యిట్టియాపత్సమయంబున దైవంబె శరణం బని నిరంతరనిజమనోని
వాసిని యగురమావిలాసినిం దలంచి. ౧౯

కౌసల్య లక్ష్మీ దేవిం బ్రార్థించుట.

ఉ. అమ్మ! పసిండితమ్మి నల♦రారెడుముద్దులగుమ్మ! బమ్మఁగ
న్నమ్మ! తరమ్ము లేనియల♦రమ్ములఁ బొంధులదిమ్ముఁ జిమ్మసా
రమ్మునుగల్గువాని నల♦రన్ రహిమీఱఁగఁ గన్నయమ్మ! మా
యమ్మ సుఖమ్ము లిమ్మ నత♦హర్షవిధాయకి! లోకనాయకీ! ౨౦

- పద్మనాభవృత్తము. -

బాలా! కనచ్ఛ్వేతచేలా! నవాబ్జారి♦ఫాలా! జగద్ధేతు రత్నావిలోలా!
హేలావతీరత్నజాలావృతా! దివ్య♦హేలా! పయోరాశిబాలా! సలీలా!

కీలాలభుక్ఛ్వారమాలాబహోన్మూల♦ఖేలా! సుశీలా! యలక్ష్మీవిఫాలా!
కీలాలజాతాలయా! పాతకాంగార♦కీలాలజాతా! దయాపూత! మాతా! ౨౧

## శ్రీలక్ష్మీదండకము.

శ్రీమద్రమామానినీ! యిందిరా! యిందురా! కంధిరాణ్మందిరా! సారమందార కుందారవిందంబుల న్పుష్పబృందంబులం బెక్కుచందంబులన్ నీదుపాదారవిందంబులంగొల్తుఁ; దల్లీ! పురంధ్రీమతల్లీ! నతేంద్రాగవల్లీ! బళీ! తొల్లి బృందారకుల్ పూర్వబృందారకుల్ మందరాగంబు నిర్మందరాగంబునన్ రజ్జునాగంబుగాఁ బాల వెల్లిన్మథింపంగ రంగారుబంగారు పొంగారుసింగార మంగంబునం జెంగలింపంగ బృందారకీబృందమందారకల్పేందు చింతామణీ సోదరీఖ్యాతిఁ గైకొంచుజన్మించి మించున్ జిగిన్మించుమైసంచుతో నంచయానంబుతో భృంగగానంబుతో ముద్దుఁగెమ్మోవితోఁ దమ్మిపూఁదావితో నవ్వునెమ్మోము శోనంబుజాతమ్ములతో వచ్చి నీలాంబుదశ్యాముఁ డార్తావనోద్దామువక్షంబునం నిర్జరాళీసమక్షంబునం జేరవే; యన్నకోసంబుగా గుజ్జువేసంబుగా రక్కసున్ వేఁడఁ బోవంగఁ దద్బ్రహ్మసూత్రంబునం జేరవే? క్రోడమై క్రీడమైనాడనాకొమ్మునన్ సొమ్మునుంబోలె భూకాంతవై దక్కవే మక్కువం? బాహుఁడై క్రూరుఁడై రాజులన్ భూరిఘోరాజులం బట్టి గిట్టింపఁగా నేలవై యేలవే? చాలు వేయేల? యాయాదినారాయణానన్యంబులౌ సర్వలోకాళిలో కేశుఁ, డాద్యంశుగా నీదురూపంబెకా దేవి! నిన్నొంది యేముందుగోవిందుఁ డీలోక బృందంబుఁ గల్పింపఁ జాలెంగదా! కూర్మినిన్నొంది రక్షించు; నట్లవుట నిన్నే ప్రధానంబుగా నెంతు; నిన్నొందకున్నంతఁ దన్నామరూపంబు లెవ్వాఁ డెఱుంగున్ ధరంజూడ జంభారిజృంభాపహారంభసంభార మాశుంభదోస్తంభసంరంభముం గుంభినీయాన! యాలంభముం జేయవే భార్గవీ! యాశ్రితస్వర్గవీ! దేవి! ప్రాణేశ్వరద్రోహులౌవారికిం బుత్రివై యుంట మర్యాదగాదంచునో నాథుఁదానిల్లటం బుంచుకొన్నట్టి వారాశికిం బుట్టి దేవేంద్రుదారిద్ర్యముం గొట్టవా? నీదువైముఖ్యమే లేమి, వైముఖ్యమే లేమి భాగ్యంబెకా, కాన నీసత్కృపాపాంగముల్ నాపయిం బంచి రక్షింపుమా మాత! పూతానుకంపాసమేతా! నమస్తే నమస్తే నమః. ౨౨

## భార్గవీ నవరత్నములు.

శా. అంభోజాతవిశాలనేత్రములతో ♦ నాస్మేరవక్త్రంబుతో
గంభీరం బగువాక్కుతో విపులసత్ ♦ క్షౌమంబుతోఁ దమ్మితోఁ
గుంభీంద్రద్వయహస్తసంభృతమణీ♦కుంభాభిషేకంబుతో
దంభం బొప్పెడినిన్నుఁ జూచుటెటో భ♦క్తిస్వర్గవీ! భార్గవీ! ౨౩

శా. నీతోఁడర్ జనియించి కాదె వెలసెన్ ♦ నిస్తుల్య మౌక్తికరీతి
న్ధాత్రీజంబును రాయి పెయ్యయు వదా♦న్యత్వంబున న్నీ మహో
దాత్తత్వంబు నుతింప నాతరమె చిం♦తాసింధునిర్మగ్ను నా
ఖ్యాతి న్మానము ప్రాణము న్నిలుపు భ♦క్తస్వర్గవీ! భార్గవీ! ౨౪

శా. పంకేజాసన పంకజాతభవ! శ♦ర్వాణీశసంసేవితా!
పంకేజాసన పంకజాతభయని♦ర్వాపక్రియాశాలినీ!
పంకేజాలయ! పంకజాస్త్రజననీ ♦ భాగీరథీ నందినీ!
శంకాతంకములేల ప్రోవ నతవాం♦ఛాస్వర్గవీ! భార్గవీ! ౨౫

మ. కరముల్ నిస్తులపాపనాశకరముల్ ♦ కంజాతిసాకారముల్
వరముల్ పల్లవసౌకుమార్యధురముల్ ♦ భక్తావళీపూర్ణశం
కరముల్ దుర్జనచిత్తభీతికరముల్ ♦ గారుత్మతో న్ముద్రికా
కరముల్ నాకుఁ బ్రసన్నమౌ టెపుడొ భ ♦ క్తస్వర్గవీ! భార్గవీ! ౨౬

మ. పదముల్ దుఃఖితమఃఖరాంశుపదముల్ ♦ భక్తావళీజీవకా
ముదముల్ స్వాశ్రితలోకభోజనదముల్ ♦ మోక్షైకసంపాదనా
స్పదముల్ ధిక్కృతనవ్యకోకనదముల్ ♦ భద్రాఢ్యసచ్చింతనా
సదముల్ నాకనులారఁ గాంచుటెటు వాం♦ఛాస్వర్గవీ! భార్గవీ! ౨౭

మ. తళుకుంజెక్కులతోడ లేనగవుతో ♦ ధాళధ్ళవేణితో
బెళుకున్మొక్కలతో ఝుళంఝుళరవా♦వేల్లత్తులాకోటితో
ఘలుఘల్లంచును మ్రోయుకింకిణులతోఁ ♦ గారుణ్యచిత్తంబుతోఁ
గలశాంభోధితనూజ! నిల్వు మిట భ♦క్తస్వర్గవీ! భార్గవీ! ౨౮

శా. చిందుల్ ద్రొక్కఁగఁ జీరచుంగులు లస♦చ్ఛ్రీయుక్తి హృద్యంబుగా
నందెల్ మ్రోయఁగఁ బైటకొంగు మెఱయన్ ♦ హారావళీశింజితం
బందంబొప్పఁగఁ గంకణాళి మొరయన్ ♦ హాసాననోపేతవై
కందుంగూడియు రాఁగఁ గందునొకొ భ♦క్తస్వర్గవీ! భార్గవీ! ౨౯

మ. భవదీయాద్భుతదివ్యనవ్యమహిమల్ ♦ భావింప శక్రాంబుజో
ద్భవశర్వాంగనలైనఁ జాల రఁట నే ♦ బాలన్ నినున్ శక్తనే
స్తవము సేయఁగ నీకృపారసము నా♦త్మం జిల్కి పల్కించి మో
దవిధిం దేలుచు నన్నుఁ బ్రోవఁగదె భ ♦ క్తస్వర్గవీ! భార్గవీ! ౩౦

శా. నీకంటెన్ ఘను లేరు లేరు జనతా♦నిర్నిద్రరక్షావిధిన్
నాకంటెం బరు లేరు లేరు దురితో♦న్మాయాత్మికల్ చూడఁగా

నాకుఁ దిక్కెవరమ్మ నిన్విడిచినన్ ♦ నాతల్లి ! నీపాదముల్
నాకుం దిక్కగుఁగాత మెప్పు డిల దీ ♦ నస్వర్గవీ ! భార్గవీ ! ౩౧

కం. కమలాలయ నిజమానస, కమలాలయఁజేసి యిట్లు ♦ కల్మషమతిచేఁ
గమలేక్షణ కరుణంబుగ, విమలోక్తుల వేఁడుచుండ ♦ విశ్రుతఫణితిన్. ౩౨

## కౌసల్యకు శ్రీలక్ష్మీదేవి ప్రత్యక్షం బగుట.

సీ. గమగమ లాడుచో ♦ క్కపుఁదమ్మిమిహి కమ్మ, సౌరభంబులు వెద ♦ చల్లుచుండ
సౌదామనీదామ ♦ శాశ్వతరుచిధామ, మగుమేనినిగ్గుసో ♦ యగముతోడ
ధవళాంశురుచిఁ గేరు ♦ ధవళాంశుకము సౌరు, కడుఁబండు వెన్నెల ♦ ల్గురియుచుండఁ
గరుణారసాధిక ♦ పరిణాహనయనఖం, జనపాళి విడివడి ♦ సంచరింప

తే. రవణములు మేలి జిలిబిలి ♦ రవళి గులుక, శ్రవణముల కోలి సారర ♦ సాయనముగ
మందహాసంబు మోమున ♦ నందగింపఁ, గంకణంబులు ఘులుఘుల్లు ♦ ఘల్లు రనఁగ.

సీ. ఘనఘనాఘనకాంతి ♦ ననువుపఱిచినకీల్, కబరీభరంబు నీఁ ♦ కటులుముంపఁ
బ్రాలేయబింబరు ♦ గ్జాలంబు నగుకటీ, క్షౌమంబు వెన్నెల ♦ గాయుచుండ
నరుణారుణప్రభా ♦ హరణధురీణ మౌ, మెయికాంతి యారెండ ♦ మెప్పుఁజూపఁ
గ్రొంబసిండిహారంగుఁ ♦ గొదవపఱుచు మోము, పసిమి మేల్మిసిమిపెం ♦ పెసకమెసఁగఁ

తే. దారసముదారపారిత ♦ థ్యయు రహింప, జీవరక్షాపరత్వంబు ♦ చెలువు మిగుల
వదనపద్మంబు చెలువార ♦ నెదురఁ దోఁచెఁ, జిత్రకారుణ్యరసపేటి ♦ శ్రీవధూటి.

వ. ఇట్లు భక్తజనభాగధేయం బగుక్షీరసాగరకన్యాలలామంబు కృపాలవాలం బగు మానసంబునఁ బ్రత్యక్షం బగుటయుఁ గౌసల్యముకుళితహస్తపద్మంబునసుమార్చనంబును గావించి కృతప్రణామయై సమ్మదాశ్రులఁ బాద్యం బొసంగి వినయవినమితశిరస్కయై సంభ్రమాతిరేకంబున విశేషంబు భాషింపనేరక యిట్లను. ౩౪

కం. సనయే జలనిధితనయే ! కనకనళినమృదులపాద ♦ కమలే ! విమలే
విమలతసుశీలే ! బాలే ! మునివరసురవరనరవర ♦ పూజితచరణే ! ౩౫

ఉ. వందన మిందిరారమణి ♦ వందన మంబుధినందినీ ! శతా
నందపురందరేందుధర ♦ నందసునందననందనందనా
నందితకుందసుందరి ! క ♦ నం దగు డెందముకుందు డింద నా
నందము కందళింప భృగు ♦ నందన ! నన్ దయ మంద లొందఁగన్. ౩౬

కం. ఇటు నిటలతటఘటితకర, పుటయై భయభక్తియుక్తిఁ ♦ బొరిఁ బొగడంగా
నటమట చిటిలఁగఁ గనుఁగొని, స్ఫుటవర్ణస్ఫూర్తి నిందు ♦ సోదరి పలికెన్. ౩౭

ఉ. దోషములేదు నీవలనఁ ♦ దోయరుహాయతనేత్ర ! నీగురుల్
దోషులుగారు ని న్నిటులు ♦ త్రోయరు వారు భవద్గుణోన్నతిన్
దోషములేమిఁ గాంచి పరి♦తోషము నొందుచు నుందు రెప్డు సం
తోషితచిత్తఁ జేసి నను ♦ నోముల నిస్గనిరమ్ము నాదయన్. ౩౯

ఉ. నావరమంది కాంచుటను ♦ నవ్యగుణాన్విత వాట సత్కృపా
భావమె కాని నీయెడల ♦ వార లెఱుంగ రొకొండుఁ బుత్రికా
భావనికేతనంబుఁ గని ♦ వారలు గుందుట నుందలింపఁగా
నావశమౌనె యోతరుణి ♦ న్యాయము గాదమ వారి దూఱఁగన్. ౪౦

ఉ. ఆజి బలారివైరికిని ♦ నాజిమహీపతి ని న్వరించి మేల్
రాజిలఁ బెండ్లిగాఁ దనయ♦లాభముగల్గు నటంచుఁ జెప్ప ని
ర్వ్యాజపరాపకారి తన♦యాయువె తీఱెడునట్లు నిన్ను నీ
యోజ హరించెఁ జోరుక్రియ ♦ నూఱడు మాత్మ శుభంబు చేకుఱున్. ౪౧

ఉ. భ్రాజితదివ్యతేజుఁ డప♦రాజితుఁ డాత్మభవుండు నీకుఁ బు
త్రీ ! జనియించి యీాపగను ♦ దీర్చు వగంబడ నేల నీవు సం
యోజితకీర్తి యుత్తగ స♦మున్నతరోషవశంబునన్ రిపూ
ద్వేజనసంగరంబున వ♦ధింపఁగ నేన నిదాన మయ్యెదన్. ౪౨

ఉ. నీతముగా భవజ్జనక♦నిశ్చితలగ్నము భగ్నమొంద దు
ర్నీతిపరుండుగావుటను ♦ నిన్నిటు లప్పనచేసెఁ గంధికిన్
భీతిలనేల యాజి నినుఁ ♦ బెండిలియై సుఖవృత్తి నుందు సం
ప్రీతిని బొందు మోరమణి ♦ వేదన నొందకు మాత్మలోపలన్. ౪౩

కం. నీధవునిమిత్రుఁ డయ్యు ధు,నీధవుఁడు గణింపలేక ♦ నిష్కారణమే
బాధాచరణుం డయ్యెను, బాధంబడుఁగాక వీఁడు ♦ వానికిమున్నే. ౪౪

లక్ష్మీదేవి కౌసల్యకు వరంబు లొసంగుట.

వ. సుందరీ ! నీ వీబందిమందిరం బగుమందసంబున వందునుపర్యంతంబు నాఁకలిదప్పు
లు వొందకుండ వరం బిచ్చితి. ౪౫

కం. రక్తికి నాయందలియా,సక్తికిఁ బతిభక్తికి హిత♦సరసోక్తికి నీ
శక్తికి మెచ్చితిఁ గోరుము, యుక్తం బగు నట్టివరము ♦ లొసఁగెదఁ బుత్రీ. ౪౬

వ. అనిన. ౪౭

కం. నిరతము నీపదభక్తియు, వరగుణుఁ డగుదశరథుండు ♦ పతియై చెలఁగన్
స్థిరతరపతివ్రతాత్వముఁ, గరుణింపవె లోకమాత ♦ ఘనవిఖ్యాతా. ౪౮

## ప్రమితాక్షరవృత్తము!

ప్రమితాక్షరం బమరు♦వాక్యములన్, నమితాంగయష్టి లల♦నామణియుం
గమలాసతిన్ విబుధ♦కాండనుతం, గ్రమమొప్ప వేడ హరి♦కాంత యనెన్. ౪౯

కం. నీమీఁదికరుణ పెంపున, నీమది నర్థించినట్టి♦నిరుపమవరముల్
భామిని! యొసఁగితి వినుమా, నీమహితయశంబు వెలయు ♦ నిత్యం బగుచున్.

సీ. వావిలికొలనుస♦ద్వంశంబునందును, ధర భరద్వాజగో♦త్రంబునందు
రామచంద్రాఖ్యుఁడు ♦ రహిమీఱజనియించి, ప్రథితమంత్రిప్రెగడ♦వంశ్యుఁడైన
నరసింగరాయని♦వరపుత్త్రిఁ గనకమ్మ, వరియించి వెలయును ♦ వారలకును
బుత్త్రులుముప్వురు♦పొల్తురువారిలో, మధ్యముఁ డార్యస♦న్మార్గరతుఁడు

తే. సుబ్బరాయఁడు మృదుహిత♦సూక్తు లొలయఁ, దావకీనవివాహక♦థాప్రపంచ
మాంధ్రభాషను విరచింప నలరు నీదు, నవ్యసత్కీర్తివల్లిక♦న్యాయ తల్లి! ౫౧

వ. అని యంతర్హితయయ్యె నక్కౌసల్యయుఁ దద్వరప్రభావంబున నాఁకలిదప్పులెఱుం
గక తలపూవాడక యుండెనంత ౫౨

## దశరథుఁడు పెండ్లికై బయలుదేఱిపోవుట.

కం. అక్కడ దశరథభూపతి, మక్కువతోఁ బరిణయోద్య♦మపరుఁ డౌచున్
మిక్కిలి సంబరమున నలు, దిక్కులఁ జాటింపఁ బంచెఁ ♦ దెలియ జనులకున్. ౫౩

ఉ. పౌరులు వారివారిపరి♦వారముతోఁ జనుదేర వాహినీ
వారము గొల్వ నాడుచును ♦ బాడుచు రా మును నాగవాసముల్
వీరవరుండు చాపకర♦వీరభృదాదికసైన్యయుక్తిరం
భోరువుఁ బెండ్లియాడ నిర♦యోధ్యుఁడునైకడువైభవంబునన్. ౫౪

కం. చని సరయూతీరంబున, జననాథుఁడు విడియఁ బనిచి ♦ సరగున స్రోత
స్విని దరియింపఁగ ననువగు, ఘనతరినికరంబుఁ బూన్పఁ♦గా నటు పనిచెన్. ౫౫

ఉ. కొందఱు దాఁటి రీఁదుచును ♦ గొందఱు తెప్పలమీఁదఁ బోవుచుం
గొందఱు కోల లూఁతగొని ♦ కొందఱు కుండలపైఁ బరుండియుం
గొందఱు యానపాత్రములఁ ♦ గొందఱు కోలములం దరించి రా
యందఱు వారివారి కను♦వైన తెఱంగులఁ బెక్కురేవులన్. ౫౬

కం. అందఱుఁ గొందలమందక, ముందుగఁ దరియింపఁ జూచి ♦ భూపతి యమితా
నందమున దాఁటుచుండెడి, సందున నాకసమునందు ♦ సన్నిమబ్బుల్. ౫౭

## ఝంఝామారుత వర్ణనము.

సీ. చేరెడఁ తేసివి ♦ చేరి దోసెడు లాయె, దోసెడు మూఁకుడం♦తేసి యాయె
మూఁకుడంతేసివి♦మూఁగిచేటెఁడులాయెఁ, జేటెఁడై యెటుచూడఁ♦జేతెఁడాయెఁ
జేతెఁడంతేసివి ♦ చెలఁగి దుప్పటు లాయె, దుప్పటులంతవి ♦ గొప్పవాయె
నింతాయె నంతాయె ♦ నంతకు నంతాయె, నంతపై మఱిమఱి ♦ యంతలాయె
తే. గొప్పవగుచును విప్పులై ♦ కుప్ప లగుచుఁ, గుప్పలెల్లను బెదపెద♦తిప్ప లగుచుఁ
దెలుపుచామనిచాయయు ♦ నలుపునగుచు, నింగిమబ్బులగమినిండె♦నిముసమునను.

ఉ. రాలెను దుంపరై మఱి ప♦రంపరయై యటుమీఁదఁ జిన్కులై
క్రాలుచు గొప్పబిందుతతి♦గా నెడ గన్గొననీక సందులే
కోలిని బుష్పవర్షమయి ♦ యొప్పెడు క్రమ్మఁతయుఁ గూడి ఱువ్వఁగన్
గాలియు వానయున్ బెరసెఁ ♦ గాఱియఁబొంద జనంబు లజ్జడిన్. ౭౯

కం. తొలిపలుచనిచినుకులకు, న్వలపుల వెదచల్లె మృత్స్న ♦ బహుహృద్యంబై
నిలిపెను బంకనిమగ్నం, బిలయయి దెబ్బాటు మిగుల♦నెసఁగిన వేళన్. ౮౦

సీ. ఏకతాలంబున ♦ నెసఁగుచు వంగుళ్లు, మూఁడుకాలంబుల ♦ మొగి నటించెఁ
జిటుకుపట క్కను♦పొటుకులు గడఁగని, తెంపులధారలై ♦ యింపుమీఱెఁ
దెంపులెల్లను గూడి ♦ దీపించె బీన్నైక, ధారయై చూఱులఁ ♦ దోరముగను
జెలిమలై చాలులై ♦ చింకలై వంకలై, జాలువాఱుచుఁ బెద్ద♦కాలువలయి
తే. వీథివీథిని నదులయి ♦ విస్తరిల్లె, బయలనడచెడిపాంథులు ♦ భయపడంగఁ
బంక మడఁగుటఁదాఁకురాల్♦బయలువడుట, వీథులెల్లఁ గరాళించె♦వికటముగను.

చం. కొమరుగ వామనీకృతముఁ ♦ గుంచిత మైనగళంబు లోననే
యిమిడిచి యొంటికెక్కునెగ♦యించుచు నీఁకల విచ్చి త్రోటి వం
చి మెయిఁబడన్ విదిర్చి జల♦శీకర, మెత్తినతెక్కు గొడ్డుగా
నమరఁగఁ బల్లటీల్ దడిసె ♦ నత్తఱిఁ జిన్కులఁ జింక నాడుచున్. ౮౨

శా. ఝంఝావేగమహోద్ధతస్ఫుటితవృ♦క్షవ్యాహానిఘోషయు
గ్ఝంఝాసారవివృద్ధి హేతుజనహం♦సస్తోమసంత్రాసకృ
జ్ఝంఝామారుత మూష్మకాత్యయమహా♦శక్త్యంఘ్రిమంజీరఝం
ఝంఝాళ్యంబొకొనాఁగ ఘోర మయి క్రొ♦లం జొచ్చె నిర్విఘ్నమై ౮౩

## మ హా స్ర గ్ధ ర.

ఫెళఫెళ్ ఫెళ్ ఫెళ్లటంచున్ ♦ విఱిగి తరుతతుల్ ♦వ్రీల, వ్రయ్యంగ దిగ్భి
త్తులు ఫట్ ఫట్ ఫట్టటంచుం ♦ దొడిఁబడి కుయిచే♦దొమ్మిడీకొట్టఁగా నా

వలు లటక్లటక్ల ట్టటంచుం ♦ బ్రజలకు భరమై బ్రద్దలై దిగ్గనన్ గుం
డెలు ఖుప్ఖుప్ఖు వ్వటంచు ♦ న్వడివడి విసరెన్ నింగియు న్నేల నిండన్. ౬౪

చం. అరయఁ దమోవిహారినిచ♦యాళికిఁ గాఁ డితఁ డేటఁజిక్కె నేఁ
డిరవుగఁ బుట్టి మున్న ఘటి♦యించెద నంచుఁ దలంచి యిర్లు భీ
కరముగ ముంచెనో యనఁగఁ ♦ గాటుకకుండయుఁ బోలెఁ గ్రమ్మె న
ప్పురుసునఁ జిమ్మచీఁకటులు ♦ పాణితలంబును గానకుండఁగన్. ౬౫

కం. క్షణదద్దినము సరిద్ధవ,దనంత యంధజ్జనంబు ♦ యవసత్కుజమై
ఘనవృష్టి కురిసె మబ్బులు, వినువీదిని నిండ గాలి ♦ విసరె బెడిదమై. ౬౬

ఉ. దారుణకాలవారిదవి♦తానము గాఁగ శతఘ్నికల్ సవి
స్తారతటుత్తులే చెలఁగ ♦ జానకి త్రాడులపోల్కి లోరవల్
నీరముబిందుబృంద మయి ♦ నివ్వటిలం దటిబోయ యంచలం
గ్రూరత నారటంబొదువ ♦ గోడుకొనన్ ఘటియించెఁ దీవ్రతన్. ౬౭

ఉ. వారిధరంబు మందరము ♦ వాసుకి కాలుమెఱుంగుఁదీవెగా
దారుణదైత్యదైవతవి♦తానము ఘోరమహాశుగంబుగా
నీరధి యంతరాళముగ ♦ నిర్మథనం బొనరించి కాలమ
న్వ్యాజనేత్రుఁ డిచ్చె ఖగ♦పాళికి నయ్యమృతప్రపూరమున్. ౬౮

నదీప్రఘోషవృత్తము

దూఁకుచు శృంగముల్ ♦ తుంగమై భంగమై, శిలీలునాఁ గూలము ఖం♦డితంబుగాఁ
బకీలన్నభోవీథి♦పాతంబుపొందన్, ధీకంప మొందించె న♦దీప్రఘోషముల్. ౬౯

ఉ. నీడలు పెల్లుగ్రమ్ముధర♦ణీరుహముల్ మఱి నీలికొట్టముల్
వాడనిపాడువీడులును ♦ స్వల్పపుదైవతమందిరంబులున్
గూడలుఁ దాటిమట్టలును ♦ గోడలపంచ లదాటునందుఁ గా
పాడఁగఁ బెల్లుజల్లునను ♦ బాంధులకున్ శరణంబులై తగున్. ౭౦

దశరథుఁడు నదిలోఁబడి కొట్టుకొనిపోవుట.

కం. ఘనవాత్యావళిఁ జీఁకటిఁ, గననేరక తరణికులుఁడు ♦ గళవళపడుచున్
మునుఁగఁగఁ జింతఁ బుట్టుక్కన, మునిఁగెఁ దరణితోడ నతఁడు♦మునిఁగెన్నిటన్.

చం. మునుఁగుచు లేచి భానుకుల♦ముఖ్యుఁడు పట్టుకొనంగ నెద్దియుం
గనక నదిం దరింపఁగ న♦గాధజలంబులఁ బైపయిం గర
ళ్లను బడి సుళ్లలోఁ దవిలి ♦ గ్లానిభుజించుచు ధీరుఁ డాటఁ దా
మునుఁగక వీచికాసరణిఁ ♦ బోవుచునుండెఁ గరంబుఁజీఁకటిన్. ౭౧

## విద్యున్మాలావృత్తము.

సోఁగ్గై బాగ్గై తీఁగ్గై ప్రోఁగ్గై, వ్రేఁగ్గై చూడం దేజోన్వీతం
బైఁ గారింపన్ విద్యున్మాలల్, మాగాధ్యానం బోలిం జేసె . ౨౩

ఉ. సారవసారఘోరతర♦సత్వరభూరితరంగమాలికా
ధోరణి ధారణీశుఁ డవి♦ధూతమనోధృతిఁ జేరె నయ్యెడన్
స్ఫారభయంకరారవవి♦భాసితపుష్కరచుంబివీచికా
వారపరంపరానిహత♦పార మపారము నైననీరధిన్. ౨౪

వ. ఇట్లు ప్రవాహవేగంబునఁ జనిచని సాగరంబునఁ బడి తరణోపాయంబుగానక చీఁక
టి నెద్దియుం గననేరక గురూపదిష్టంబు మనంబునం దోఁచుటయు ౨౫

## దశరథుఁడు భగవంతుని ధ్యానించుట.

చం. ఎఱుఁగుదు జీవి పౌరుషము ♦ నెల్లను వీడి భవత్పదాబ్జముల్
మఱవక సన్నుతింప నను♦మానము మాని దయార్ద్రచిత్తతన్
మఱుకువఁ బాపు దీ వనుచు ♦ మాధవ! యట్టిఁడ నైన నన్ను నీ
వఱమర చేయఁబోకుము ద♦యామతి నిమ్ము కరావలంబమున్. ౨౬

ఉ. ఘోరతరప్రవాహమునఁ ♦ గూలి యభంగతరంగ సంఘముల్
వారక మచ్చిరోనిహతి ♦ భగ్నములై తలయేరుఁ దెచ్చె శా
రీరబలం బడంగెను హా♦రి! తనుకంపము హెచ్చె నింక న
న్నీరముఁ జేర్పవయ్య కరు♦ణింపుము రామ! కరావలంబమున్, ౨౭

ఉ. ఆఁకటఁ గుంది వంచుకుచు ♦ నాత్మజవంబు బలంబు డింద నే
నీకటు వైనచీఁకటిని ♦ నీఁదగఁ జాల, స్రవంతిఁ బ్రాణముల్
పోకడ కొప్పినాఁడ దయఁ ♦ బ్రోవక యుండిన నీవు; దేవ! పెం
జీఁకటిఁ గన్ను గాన దయ♦సేయర రామ! కరావలంబమున్. ౨౮

ఉ. సారసలోచనా! యభవ ♦ సారససంభవశంభుసన్నుతా!
క్రూరమదారివారణ! వి♦కుంఠసుతా! పరమేశ! మేశ! సం
సారమహాబ్ధిమగ్నజన♦జాలతరీ! నృహరీ! హరీ! నను
న్నీరముఁ జేర్పవయ్య కరు♦ణింపుమ రామ! కరావలంబమున్. ౨౯

ఉ. భ్రాతృకళత్రపుత్ర చయ ♦ బాంధవభీకరనక్రయుక్తతృ
ష్ణాతతజీవనాశయదు♦రత్యయసంసరణాంబురాశిస
త్పోతమ! ప్రాకృతాంబునిధి♦భుగ్నుని నం దరియింపఁ జేయుమా
జాతమహానుకంపను నొ♦సంగవె నాకుఁ గరావలంబమున్. ౩౦

ఉ. నిస్తులితాపదంబునిధి ♦ నిస్తరణంబు గనంగలేక సం
త్రస్తుఁడ నైతిఁ దావక సు♦నామము సంస్మరణంబుసేయుచున్
నిస్తులఘోరసంసరణ♦నిస్సరణక్రియ జ్యేష్ఠసూతికిన్
నిస్తుగ నీదుపేరిడుచుఁ ♦ జీరుచునుండెద రామ! ప్రోవుమా. ౮౧

ఆ. నీదు పేరుఁ దలఁప ♦ నీరధి మునిఁగెడి, జీవి వేగ వేలఁ ♦ జేరు ననఁగ
నిన్ను నిచ్చఁ దలఁచు ♦ చున్ననన్నిట్టుల, చేయివిడువ నీకుఁ ♦ జెల్లు నయ్యా. ౮౨

వ. అని యిట్లు గురూపదేశంబు మఱవక సంస్మరించుచుం బోవంబోవ. ౮౩

**ప్రభాతవర్ణనము.**

ఉ. అంతటఁ గొంతసేపున ని♦శాంతము డాయఁగ విచ్చెఁ జీఁకటుల్
శాంతతనొందె వాయువులు ♦ చక్కని తెల్వి వహించె దిక్కులే
కాంతముఁ జింతనొందెడు ని♦జాన్వయదీపకుఁ డంచుఁ బద్మినీ
కాంతుఁడు ప్రాగ్దిశాగ్రమునఁ ♦ గన్గొన నిల్చె జగంబు మ్రొక్కఁగన్. ౮౪

**భాస్కరవిలసితవృత్తము.**

విచ్చఁగఁ గమలిని వేడుకమీఱన్ ♦ విచ్చలవిడి నళితతి వెలిజాఱన్
హెచ్చుగ మది నరులున్ ముదమారన్ ♦ నెచ్చెలికవుఁగిటఁ గడుఁజెలువారన్
విచ్చఁగఁ బలపలచీఁకటితీరన్ ♦ వేడుకఁ దిరిగెడువిటు లిలుసేరన్
వ్రచ్చఁగ వ్యసనము జీవముదాఱన్ ♦ భాస్కరవిలసితరుచు లరుదేరన్. ౮౫

చం. నిడుదకరల్లెదుర్కొనఁగ ♦ నిక్కుచు నిక్కుచు దాఁటిపోవుచుం
గడిఁదిశ్రమం బటంచనక ♦ కన్గొని దూరమునందు ద్వీప మ
య్యెడ కరుగంగ నెంచి యతఁ ♦ డీఁదుచు నాదరిఁజేరి యేకవ
స్త్రుఁడు నసహాయుఁడై దెసలు ♦ చూచుచు నెవ్వరు లేమి నివ్వెఱన్. ౮౬

ఉ. కట్టినవస్త్ర మయ్యెడను ♦ గాలికి నెండకు నాఱ నుప్పులై
నట్టిజలంబుల న్మునుఁగు♦లాడుటఁ జీఁదఱదోఁప మేను న
ప్పట్టున రోసి రోసి యొక ♦ వాపిని స్నానముచేసి యయ్యెడం
జెట్టులఁ గాయయుం గసురుఁ ♦ జిక్కిన మెక్కుచు నాత్మలోపలన్. ౮౭

ఉ. ఎక్కడి యాయయోధ్య యది ♦ యెక్కడికోసల యేటిపెండ్లి నే
నెక్కడ సంద్ర మెక్కడ యి♦దెక్కడి ద్వీపము దైవమా ననున్
దిక్కునుదోఁపకుండ నిటు♦తెచ్చి మహాంబుధిలోన ముంచితే
యెక్కొఱగానికార్యముల ♦ నేఁ దొలిబాములఁ జేసినాఁడనో. ౮౮

సీ. వార్ధిపరీతభూ♦వలయ మీద్వీపమే? భృత్యానుభృత్యులు ♦ మృగకులములె?
సింహాసనంబొకో ♦ చెలఁగి యీభూధరం? బాతపత్రంబు లీ♦యగచయములె?
తూఁగుటుయ్యాలలు ♦ తీఁగెలప్రోవులే? పరివారములు నాకుఁ ♦ బక్షికులమె?
పఱువనిపఱుపులు ♦ పచ్చికపట్టులే? నుపధానతతులు గం♦డోపలములె?
తే. ఆఁకలియ యైనచో నిప్పు ♦ డారగింప, నాకలి వెగాయలా మదా♦హారమయ్యెఁ
జూడ ననపేక్షితం బన♦సూయకంబు, పరుల కిటువంటిపద మబ్బె♦బళిర నాకు.

ఉ. అక్కట పెండ్లికోసమయి ♦ హర్షసమున్నతిఁ బోవుచేడ! హా!
యెక్కడిగాలివాన! యది ♦ యెక్కడిచీఁకటి! యేమిచిత్రమో
దిక్కు నెఱుంగరాదు కడ♦తేఱఁగఁ దేరకుఁ ద్రోసి వెల్లిలో
నిక్కడికీడ్చి తెచ్చితివె ♦ యీశ్వర! పాడఱినట్టిగుట్టఱున్. ౯౦

కం. ఊరెక్కడ నేనెక్కడ, ధీరతవాటించి చనఁగఁ ♦ దెరు వెక్కడ వి
స్తారాంబుధి దాఁటించెడి, వా రెక్కడ నెవరి వేఁడు♦వాఁడనో యిచటన్. ౯౧

ఉ. నిక్కపుఁబ్రేమ నేను రమ♦ణీమణిఁ బెండిలియాడు కోరికన్
లెక్కకుమిక్కుటంపుఁబ్రజ ♦ లీలమెయిం గొనివచ్చితిన్ వెతల్
నెక్కొన మంత్రు లేమయిరొ ♦ నీటన గూలిరొ పౌరులెల్ల హా
స్రుక్కుటగల్గెఁగాక నను ♦ జూచుట దైవము చిన్నచూపులన్. ౯౨

ఉ. భూవలయంబు సర్వమును ♦ బూని జయించితి బంతితేరులం
బోవఁగఁ దోలితిన్ దెసలఁ ♦ బోర నయోధ్య నయోధ్య నేలితిన్
దేవనిభున్ వసిష్ఠుమతిఁ ♦ దీరితి నిన్నియుఁగల్గి కుందెదన్
దైవము దుర్బలం బయినఁ ♦ దథ్యము పౌరుషమెల్ల వ్యర్థమా ౯౩

వ. అని యేకతంబ తనలోఁదాను మాటలాడుకొనుచు. ౯౪

కం వేలాప్రాంతమునందు మ, హేలామహీళాధవుండు ♦ హెచ్చినచింతన్
డోలాందోళితమనమున, వాలాయముఁ దిరిగితిరిగి ♦ పదములునొవ్వన్. ౯౫

కం. ఈనగశిఖరంబున నా, సీనుఁడనై కనెదఁగాక ♦ చేయలఁతి మహా
కాననజంతుపయోధిచ, రానీకము నెల్లఁ గాల♦యాపనకొఱకై. ౯౬

కం. అలలకొనల రవిరశ్ములు, దలకొన నిశితాసిధార ♦ దగ జళిపింపం
దళతళ లాడెడు విధముం, దలపించెనుఁ జిత్రతరము ♦ ధరణిం గలదే. ౯౭

కం. వామనువిధమునఁ బెరుఁగుచు, లో మేచకకాంతి భీతి ♦ లోకుల కొసఁగన్
భూమిని మ్రింగెడునో యనఁ, గా మును పడునట్టితరఁగ♦గములం గంటే. ౯౮

కం. ఘనఫణమెత్తినపా మనఁ, జనుదెంచి తటస్థమైన♦శైలము డీకొ
ట్టినఁ దరఁగలతుంపరలం, గనుఁగొననింద్రాయుధముల♦కాండము లమరెన్. ౯౯

కం. వరుణపురంబున బోలురు, కరవాలము లభ్యసింపఁ ♦ గైకొని విసరం
బోరిని దళుక్కని యెగిసిన, కరణిని మత్స్యములు మిట్టి♦కడఁకం బడెడున్. ౧౦౦

చం. ఇది యొకపర్వతాగ్ర మిది ♦ యిందలిపేటు పయోధిలోఁతునా
నది తలఁపంగరా దిట మ♦హోర్మిపటంబులు మిట్టిపాటునం
బొదలి తటంబునం బడుచుఁ ♦ బోర్లి చివాలున దూఁకు నీటిలో
నిది యెటుసాగు నేల గల♦దేని యథాక్రమ మెప్పు రేవుగన్. ౧౦౧

చం. అతులఘులీకుళీరనిచ♦యంబులు భీకరమాకరంబు ను
న్నతి దరినిన్ విలాసముగ ♦ మానక క్రుమ్మరుచుండఁగా వనీ
క్షితిచరసూకరోగ్రఘన♦సింధురరాజిపదస్వనంబు భీ
హాతములఁ జేయ నీటను ర♦యంబున దూఁకు గుభాల్ గుభాలనన్. ౧౦౨

వ. ఇట్లు తనలోఁ దాను విమర్శించుకొనుచుండె నంత. ౧౦౩

ఉ. మానసగోచరంపుఁబరి♦మాణము గల్గిచరించు నమ్మహా
మీన మదమ్యోడం గుడుపు ♦ మ్రింగఁగ వావెడలించి పెట్టెయం
బూని ధరించుచో మరల ♦ నోరను దాఁకె మఱొంకుభూరిపా
ఠీనము మాంసబుద్ధినిఁ గ♦డింది మగంటిమి దానిఁ గైకొనన్. ౧౦౪

కం. తుములంబుగ భీషణవి,క్రమముల్ వెలయంగఁ దొడరి ♦ కడుఘోరముగా
సమరక్రీడఁ జరించెను, దిమింగిలయుగంబు నిండు♦ధీరత దోఁపన్. ౧౦౫

వ. ఇటులు పోరునెడఁ దొలితిమింగిలంబు తుములం బగుసమరంబున మందసం బప
హృతం బగునో యని శంకించి దైవవశంబున నాద్వీపనికటంబున నమ్మహామం
జూష నిడి క్రమ్మఱఁ జని ఘోరంబుగాఁ బోరుచుండె నట్టియెడ. ౧౦౬

ఉ. రంగు తెఱం గెఱుంగని ధ♦రం గలవస్తువులైన జాళువా
రంగు బెడంగు నొందఁగ హా♦రంగునఁ బొంగుచు నార్ద్రిమైనయా
బంగరుమందసంబున న♦భంగపతంగకరాళి వేగు వే
శం గలయంగఁ బర్వనఁ జె♦లంగినభంగు లనంగ శక్యమే? ౧౦౭

చం. మినమినలాడుచు న్మెఱసి ♦ మేల్మిఱుమిట్లు ఘటింప ముందటన్
గొన బగుపైఁడిమందసముఁ ♦ గూర్మిరహింపఁగఁ గాంచి చేరఁగాఁ
జని యొకవింత యంచు నలు♦చాయలు శోధనచేసి యద్దిరా!
కన నిది యెట్టు లీకడలి♦గట్టును జేరె సహాయహీనతన్. ౧౦౮

కం. భారం బతివేలం బా,కారము దీర్ఘంబు కడలి♦కడ లెన్నన్ వి
స్తారము దూరం బెట్టులు, తీరముఁ జేరంగ వచ్చెఁ ♦ దేలుచు నీటన్. ౧౦౯

కం. నావలు శకలీకృత మగు, త్రోవలు గనరావు చూడ ♦ రూఢియ యేలా
రా వటులైనను సుపరి,ప్లావోడుపఫలకతతులు ♦ లాఘవము మెయిన్. ౧౧౦

కం. వాసియు వన్నెయుఁ గలిగి వి, భాసిలి నే గాసి గనఁ బ్ర♦వాసమునం దా
హా సాక్షాత్కారముగను, గౌసల్యారమణి దోఁచు ♦ కైవడినయ్యెన్. ౧౧౧

వ. అని దానిఁ బరిశీలించుచుండ దక్షిణనయనభుజంబు లదరుటయు.

కం. మొలబంటి దుఃఖ మందును, నలవడు మోఁకాటిబంటి♦హర్షం బనఁగన్
వెలయుచు నీశకునంబులు, కలిగించెడు మదికి నేని ♦ క్షణమోదంబుల్.

ఆ. నాకు నాదుస్థితికి ♦ నాయుట్టిదురదృష్ట,వంతునకు శుభంబు ♦ వచ్చునొక్కొ
దైవకృతమాలిపుడు ♦ భావింప విషమయ్యె, మీఁద నామతమున♦ మేల యిచ్చు

కం. అని యంతరంగసీమను, దనయంత ననేకగతులఁ ♦ దలపోయుచు సోఁ
కినఁ గరమునం దటాలునఁ, దనయంతన మూఁత యెగసె♦దైవకృతమునన్.

ఉ. మూఁత తటాలున న్నెగయ ♦ మొల్లపుపీవలిపీవ బాలకం
జాతసఖాంశుజాలముల♦చా లోకవింత బెడంగు నింపఁగ
న్ధూతక వాటపంజరవి♦నూతనబద్ధశుకాంగనాక్రియ
న్గౌతుకసంభ్రమంబులు పెనంగొనఁ గోసలకన్య దిగ్గనన్.

చం. కడువడి లేచి చూచెఁ గర♦కంకణనిక్వణనంబు మీఱఁ బె
న్జడియయి సమ్మదాశ్రువులు ♦ జాలుగ జాఱఁగ మౌనముద్ర పెం
పడర నచంచలత్వ మొల♦యంగను సంశయ మంకురింపఁగాఁ
దడఁబడఁ బల్కు పుల్కలు ని♦దాఘము మేనఁ జివుర్ప నెంతయున్.

ఉ. ప్రాకటనిర్నిమేషములు ♦ భావసుగర్భము లద్భుతైకశం
కాకలితంబు రాగసర♦సాంచితముల్ వ్యసనాపహంబు స్నే
హాకరముల్ మనోభవశి♦తాశుగముల్ వెలయం బరస్పరా
లోకనముల్ నిగిడ్చి త్రుటి♦లోపల నొప్పి రనేకరీతులన్.

ఉ. నమ్మరు కొంతసేపు మది ♦ నమ్మరు కొండొకసేపు కన్నులన్
నమ్మరు తమ్ముఁదా మెదురు ♦ నమ్మరు దీర్ఘవిచారు లౌచు వా
రిమ్మెయినుండి కొంతవడి♦హెచ్చినరాగరసంబు పేర్మి స్తం
భమ్ములువోలె నుండ జన♦పాలుఁడు బాలికఁ జూచి యి ట్లనున్.

ఉ. ఎవ్వతె వీవు? నీదుకుల ♦ మెయ్యది? నీతలిదండ్రు లెవ్వరో
జవ్వని! యెవ్వరీకరణి ♦ సంద్రమునం బడవైచిరో నినున్
నెవ్వగ దోఁచె నిన్గనఁగ ♦ నెచ్చెలి! ముచ్చటమీఱఁ దెల్పవే
యివ్విధి సంభవింపఁ గత ♦ మెయ్యది? భీతకురంగలోచనా!

కం. వింతయుఁ జింతయు వంతయుఁ, గాంతా నిన్గనఁగ మదిని♦గాఢియ నిడె నా
ద్యంతము వృత్తాంతము నా, వంతయుఁ బోనీక యెఱుఁగ ♦ నాడవె నాతోన్.

తే. భానుమంతునివరసుత♦పగిదిఁ దోఁచెఁ, గమలలోచన! నీదుమో♦కృట్లు చూడ
నిట్టియుత్కృష్టు ప్రాపింప♦నెట్లుగలిగె, వెలఁది! విశదీకరింపవే♦ప్రేమ వెలయ. ౧౨౨

*మంజుభాషిణీవృత్తము*

తరుణీ! వినంగదవె ♦ ధాత్రినాథుఁడం, దరణీద్యవంశజుఁడ ♦ ధర్మశీలుఁడన్
ఉరగేంద్రవేణిరో! య♦యోధ్యనుండుదున్, స్మరణంబురాదె నను♦మంజుభాషిణీ!

ఆ. నేను దశరథుండ ♦ మానుగా సాకేత, పురము నేలునట్టి♦భూమిపతిని
ప్రత్యభిజ్ఞ కొఱకుఁ ♦ బలికెదఁ గలికిరో! వనవిహారసరణిఁ ♦ గనవె నన్ను? ౧౨౪

వ. అని శుకం బొసంగినముద్దుటుంగరముం జూపుటయు. ౧౨౫

*లయగ్రాహి*

పంకజహితాన్వయశ♦శాంకుఁడకలంకమతిఁ♦బంకజదళాక్షి నిటు♦పొంకముగఁబల్కం
గొంకునుదొలంగఁదల♦జంకుచునుప్రాల్చియొక♦వంకనిసుమంతిని ను♦లంకలిరహింపన్
బింకమునసిబ్బితిదొ♦లంకఁగనిపాదమును♦బొంకముగమందసము♦తెంకికొన నిల్పం
బంకజసుగంధిఁగొని ♦ చంకకును వేలను మృ♦గాంకముఖ నిల్పెన♦శంకితమనీషన్.

వ. ఇట్లు తీరంబున నిల్పి లజ్జావనతముఖిం గని. ౧౨౭

*సుందరీవృత్తము.*

పేరుకొనంగదె భామ!♦ప్రేమరహింపఁగా, నూరికి నీతలిదండ్రు ♦ లూహదొలంగఁగా
నీరనిధిన్ నినుఁజాల♦నిర్దయులౌచుహా! పారచిచావఁగఁద్రోయఁ♦బుచ్చిరెసుందరీ!

వ. అనిన. ౧౨౯

*తరువోజ*

చరితంబు సర్వంబు ♦ జలజాక్షురాణి ♦ సరసతఁ బల్కిన♦చందంబుదోఁప
వరుసగా వివరింప ♦ వనజాక్షి నయము ♦ పరమాదరంబును ♦ భక్తియుఁ దెలుప
ధరణీశచంద్రుఁ డం♦తయు విని యార ♦ ధరఁ బురాకృత మిది♦తరుణి! చింతింపఁ
బొరి నచ్చుకట్టక♦మున్నె పిచ్చుకల♦పొరిఁబొరి రావిడి♦పుట్టిన ట్టయ్యె. ౧౩౦

ఉ. చింతయొకింత లేదు సర♦సీరుహలోచన! నాకుఁగా; వ్యథా
వంతుఁడ నయ్యెదన్ నిజము ♦ భామరో! నీదునిమిత్త; మిట్టిదా
వంతము గల్గె నీ కకట♦ప్రాణము నీ విటు నిల్ప నాపయి
న్వింత భవచ్ఛరీరమున ♦ నిల్పుట ప్రాణము లింతకాలమున్. ౧౩౧

కం. ఆశరయూనది దాటఁగ, నాశరయూథోగ్రమాయ ♦ యానో వడి నే
నీశరనిధిఁ జేరితి భ,గ్నాశను నక్కటట నోడ ♦ హాత మాట సతీ! ౧౩౨

వ. అని తమతమవృత్తాంతంబు లెఱింగించి యనురాగవిశేషంబున నిజదుఃఖంబుల మఱచి ప్రియాయాసంబులఁ దలఁచి దుఃఖించి మరల ధైర్యం బవలంబించి పరస్పరాశ్వాసంబుఁ బొనర్చు చున్నంత. ౧౩౩

తే. ఐదుపదిచేయుఁదూపుల ♦ హారిసుతుండు,సతియుఁబతియును వెరవేఁకిఁ♦గుతిలపడఁగ
నైదుపదిసేసెనప్పుడు♦హారిసుతుండు,వార లిరువురు నొక్కటై♦వాలుకతన. ౧౩౪

ఉ. రావణుపోక లెల్ల సుర♦రాజును భారతిరా జెఱుంగుటం
గేవలదైవతంత్రమున ♦ నీరధినడ్మను ద్వీపవాసులై
యావరదంపతుల్ వెలయ ♦ హర్షసమున్నతిఁ జూచి లగ్నముల్
భావనచేసి యా ననుచుఁ ♦ బట్టుఁడు పట్టుఁ డటంచు నందఱుల్. ౧౩౫

కం. తెంపునఁ బాణోక్కృతిఁ గా,వింపఁగఁ దగు ననుచుఁ దలఁచి ♦ వేగంబున నై
లింపములు వెంటనంటఁగ, నింపాదిగ వచ్చి యచట ♦ నిలిచిరి దక్షమై. ౧౩౬

వ. అప్పుడు ౧౩౭

ఉ. చంచదనూనరాగరస♦సంపద కన్నులఁగప్పఁగాఁ గరా
భ్యంచితమాల యొప్ప నుద♦యార్కు దిసంతులుగొట్టఁగాఁ దనూ
కాంచనశోభ లేనగవు♦కిల్కిగఁగుల్కెడుపల్కుఁ జేడెతో
నంచవజీరువచ్చెఁ దన♦యంచున మానులు గొల్చుచుండఁగన్. ౧౩౮

సీ. పూర్ణేందురుచిఁ జిందు♦ముఖమందు దరహాస,చంద్రికారోచులు♦సంవడింప
వెలిగట్టురుచిమట్టు♦పెట్టువక్షోరుహా,ములహారములు గంగ♦మురువు చూప
నాకాశనీకాశ♦వీకాశమధ్యంబు,నను గాంచి పరిధినా ♦ నలువుమీఱ
హాతతామరసదా మ♦మృదుకోమలాంఘ్రుల, హంసకనాదప్ర♦శంస మొనర

తే. ధవళధవళాంశుకాంచల♦మవనపరతఁ, జిందుద్రొక్కంగ మీఁగాళ్ల♦నందముగను
గంకణంబులు ఘులుఘులు♦ఘుల్లు రనఁగ, వచ్చె విధిరాణి యంబుజ♦పాణివాణి.

ఉ. రంభయు లోనుగాఁగల సుర♦ప్రమదల్ ప్రమదాతిరేకసం
స్తంభితగాత్రవల్లులయి ♦ చయ్యనరాఁ గడువేడ్కఁ బూర్వ ది
క్కుంభి శచీద్వితీయుఁడయి ♦ కూరిమి నెక్కి సురల్ భజింపఁగా
జంభవిరోధి వచ్చె నరు♦సంబున స్వర్గవి వెంటనంటఁగన్. ౧౪౦

## కౌసల్యా దశరథుల వివాహము.

ఉ. ఆదిమలగ్న మియ్యదియ ♦ యాలము గూడదు సుండు సొంపునిం
పాదిగ నీవధూవరులఁ ♦ బొటనసేయుఁ డటన్న ధాత రం

భాదిసురాంగనల్ చని న♦యంబు రయంబు రహింపఁ గూర్మి నా
మోదముతోడ నిల్పి నృప♦ముఖ్యు సతీమణిఁ బెండ్లిపీఁటలన్. ౧౪౧
చం. తమకము మీఱ వారలకుఁ ♦ దైధిమితోంధిమి తోం ధితోం ధితోం
ధిమికిట ధిమ్మి తక్కతయి♦ధిం తయిధిం తయిధిమ్మటంచు సం
భ్రమమునఁ దాలమానముల ♦ మానితచంపక తైలమంటి రా
కమలవిలోచనామణులు ♦ క్రమఫుఁ గంకణరావ మొప్పఁగాన్. ౧౪౨
కం. అంబుజపాణులు పన్నీ,రంబుల సాకేతపతిని ♦ రామామణిఁ దా
రింబుగ నవగాహము మో,దంబునఁ జేయించి కురుల♦తడి యార్ప వెసన్. ౧౪౩
కం. ఇంద్రుఁడు వస్త్రాభరణ ము,పేంద్రతులితతేజుఁ డామ♦హీపతి కియ్యన్
సాంద్రముదంబునఁ గొనుచు న,తంద్రత ధరియించి వెలసె ♦ దశరథుఁ డంతన్
చం. పసిమిపసిండిదువ్వలువ ♦ భారతి గట్టునెడం బులోమజా
కిసలయపాణి దివ్యమణి♦కీర్తితభూష లలంకరింపఁగా
నసమున మేనకాదులు త♦దంఘ్రుల సొమ్ములు గూర్ప భాసిలెన్
ససిని గడానిమేనిదొర♦సానికి సాటియనంగఁ గాంతయున్. ౧౪౪

## మదనదర్పణము.

హారిమదనకామినీక♦రాబ్జ మూనునద్దమో
శారదవరయామినీల♦సత్సుధాంశుబింబమో
సారమదనదర్పణంబొ ♦ సచ్ఛవిన్ రహించి పెం
పారె వదనదర్పణంబు ♦ పావనాంబుజద్యుతిన్. ౧౪౫
ఉ. హాళి సరోవరాళి లలి♦తాంబుజసౌరభలక్ష్మిఁ గొంచు సూ
నాళిపరాగమోహరజ ♦ మధ్వగవారముపై విదిర్చి మా
దాలసులైన దొంగిలి మ♦నోర్థముఁ గొమ్మల మెల్ల డాయుచున్
లీలఁ జరించెఁ దెమ్మెర మ♦లిమ్లుచనామము సార్థకంబుగన్. ౧౪౬

## పణవవృత్తము.

ప్రక్కల్ గా దివి ♦ పణవానకముల్, ఢక్కాదుందుభి♦డమరూద్ధకముల్
పెక్కుల్ మ్రోఁగెను♦విడు పొందక న, ల్దిక్కుల్ నిండఁగ ♦ దివిజేరితమై. ౧౪౭
కం. మధ్యమజగతీపతి కను,మధ్యను దతమధ్యమాన♦మానసదివిజా
రాధ్యను వాణీవేదీ,మధ్యాపతి ధారవోసె ♦ మన ముప్పొంగన్. ౧౪౮
కం. మంగళరవములు బోరుకొ,నంగను శుభమంగళం బ♦నంగను సురులున్
మంగళసూత్రముఁ బతి ప్రే,మం గళమునఁ గట్టె నంత ♦ మంగళవతికిన్. ౧౫౦

శా. నాకాంభోరుహలోచనామణులు వీణాచారురావామృతా
స్తోకాసారపరంపరల్ గురియ కీతుల్ దప్పకుండంగ వి
ద్యాకౌశల్యము దోఁప శ్రోతలను బ్రహ్మానందమున్ ముంప ల
క్ష్మీకల్యాణముఁ బాడి రింపునను సుశ్రీరాగసంపత్తితోన్. ౧౫౧

**ఉత్సాహావృత్తము.**

మంగళాని సంతు తే రమాపతుల్యభూపతే !
సంగరాంగణారివారశమన ! మిహిరకులపతే !
భృంగచికుర ! హితగతే! గృహీతసుగుణగణరతే
నంగనవ్యభవ్యరూప హారిశుభతనుద్యుతే ! ౧౫౨

వ. అని మంగళారాత్రికలు ముత్తైదువలు పాడుచుండ రంభాదులు నర్తనంబులు సలుపుటయు. ౧౫౩

చం. అదొ యిదొ మేలు మేలె యదియానిదియా సదికాదు గాదుహాఁ
యిదియిది కాదు కాదదియె యివ్వది మేలని నిర్ణయింపఁగా
మదిని నొకింత నేరక యమందముదంబున జెప్ప వెట్ట కా
సుదతి సవిస్మయంబుగను జూచుచునుండె సురుల్ నటింపఁగన్. ౧౫౪

వ. తదనంతరంబు. ౧౫౫

చం. కడపపిషాణబియ్యమునఁ గమ్మనియన్నము పప్పు దప్పళా
ల్వడియము లప్పళంబులును బజ్జులు లడ్డు జిలేబి యాజ్యమున్
వడలును నావపచ్చళులు స్వాదుఫలంబులు లోనుగాఁగ మిన్
దొడుకు ఘటింప నొక్కత్రుటిఁ దోఁపముగా భుజియించి రయ్యెడన్. ౧౫౬

వ. ఇట్లు లందఱుసురనైచికీకల్పితవివిధాహారంబుల సంతుష్టాంతరంగులైరి పదంపడి.

కం. లగ్నం బిటు కడఁగాంచెను, భగ్నముగాకుండఁ బంక్తివదనుఁడు కడును
ద్విగ్నుఁడుగ నని ముదబ్ధిన్, మగ్నం బగుమానసములమఱి దంపతులన్. ౧౫౭

వ. ఆశీర్వచనపూర్వకంబుగ బహూకరించి మీర లిరువురు మందసంబుననుండుఁడు మీ కేవిపత్తును సంభవింపనేరదుమీరుషష్టిసహస్రవర్షంబులు సుఖసాంగత్యంబు నన్ జీవించెద రని వచించి వారలమందసంబున నుంచి బీగంబులుబిగించిశతానం దపురందరాదులు మహానందంబున స్వర్గమార్గం బనుసరించి రంత. ౧౫౯

ఆ. వైరిఁ బాఱఁదోలి పరువునఁ దా వచ్చి, మందసంబు మ్రింగిమరల మీన
మిచ్చవచ్చినట్టులేగి హెచ్చరికను, సంచరించుచుండెసంద్రమునను. ౧౬౦

వ. తరువాత మఱునాఁటివఱువాత ధాత్రవాఁత గోతపఱుచు చేత దినంబులులెక్కిం చుచున్నరావణుండు వేలాసమీపంబున రత్నస్తంభంబుమధ్యంబునుండి మంత్రులం

బిలిపించి మదీయాజ్ఞానుసారంబుగ జలధిరక్షించుమందసంబు వాని తోడం గొని రండని పనుచుటయు వారలు చని రంతలోన నారదుం డయ్యెడ కరుదెంచి నిర్దిష్టాసనాసీనుండైన నతనిం జూచి రావణుండు. ౧౬౧

కం. మీ రిడినగడువు దీఱెనె? నారద! యినవంశ్యుం డెచటనయ! కౌసల్యా
సారసలోచన యెక్కడ? మూరుతమముం జరిపినట్టిముని మీరలో కో? ౧౬౨

కం. పోయితిరా మీ రచటికి? నా యెం గదా పెండ్లి విఘ్నహాతి లేకయె మీ
రా యెడనుండియొకో యిట్లీయెడ కరు దెంచుటలు మునీశ్వర! హిహిహీ. ౧౬౩

చం. అని నగ నంతలోన దనుజావళి హాటకపేటి మ్రోల ని
ల్పినఁ గని తాన చేరఁజని బీగములూ గడియల్ వదల్చి మూఁ
తను దెఱవంగ వెల్వడిరి దంపతు లక్కట యేమి చెప్పుదుం
గనుఁగొన వారి వానిమదిఁ గాతరతం బటుకోపవేగముల్. ౧౬౪

*రావణుండు మందసంబున దంపతులఁ జూచి కోపించుట.*

కం. కంకణరా జితకరరద, టంకితరమ్యాధరస్ఫుటనఖాంకనిశా
సంకులితాంశుకులను గన, సంకటమది యింతి యనఁగ శక్యం బగునే. ౧౬౫

ఆ. చటులకుటిలనిటలతటమున భ్రూకుటి
పటుగతిని నటింప స్ఫుటముగాఁగఁ
బటపటార్భటరదరటనంబు వెలయంగఁ
గటము లదర దెసలతటము లగల. ౧౬౬

*రావణుండు సముద్రుం జంపఁబూనుట.*

ఉ. చూపఱులెల్ల దిగ్భ్రమను జొక్కఁగ రోషకషాయితాక్షుల
ద్దీపమునుండి పుండిపడు స్నేహముబిందువు లట్ల యస్రుసులు
ద్దీపితమై ధరం దొరఁగ ధిక్కృతిపూర్వముగాఁగ సాగరుం
గోపపరీతచిత్తుం డయి క్రూరవచోహతి రావణుం డనున్. ౧౬౭

శా. ఓరీ మూఢ! జడాశయా! తెలివి లేదో? విస్మృతిం జెందితో
క్రూరం బైనమదీయశాసనముఁ? జక్కుల్ గానవా గర్వివై?
యౌరా! మోసముచేయఁ బూనితివి నన్నా? నిల్తువా యింక మ
త్క్రూరాస్త్ర ప్రతతిప్రహారములఁ ద్రుంతుం జూడరా సాగరా! ౧౬౮

శా. కాండోద్దండతరప్రచండసుమహాకాండప్రకాండంబులన్
ఖండీభూతునిఁ జేయు ని న్నిపుడు దిక్కా నీకు దిక్పాలకుల్?

దండోల్లంఘనగండమండితుఁడవై♦ దండార్హుఁ డీనీతలన్
జెండాడన్ గమకింతు దిక్కుగలదే♦నిం జూపరా యాఁపఁగన్. ౧౬౯

వ. అని కోపంబు పెంపునఁ దెంపున జల్లజంపై చంపఁ బైకిలంఘించుటయు. ౧౭౦

తే. నిలువునీరుగ మేనెల్లఁ♦గలఁతపడుచు, దాపుచేరనవారిపా♦దములఁ బడుచుఁ
బొంగుగ్రుంగఁగఁ దనలోన♦భంగపడుచు, వనధియిట్టులు పలికె రా♦వణునితోడ.

చం. శరణు సురారినాథ! రిపు♦శాసనశీల! భవన్మహోజ్జ్వల
స్ఫురువముచేసి దాఁట నొక♦నాఁడొకయింతయుఁ దప్పులేదు ని
ష్కరుణతఁ జంప నేల నను♦సాధ్వసయుక్తి మహోర్మిపాస్యగ
హ్వారమున దీని దాఁచితి సు♦రాసురులైనఁ గనంగనేర్తురే. ౧౭౨

తే. ఏమియుంచితో దీనిలో♦నెఱుఁగనేను, దక్కవారలెఱుంగుట♦టక్కుగాదె
వంచనయొకింతలేదు నా♦వలన నిక్క, మవల నీచిత్తమే భాగ్య♦మధిపనాకు.

వ. అనుచుండ నారదుం డడ్డంబు వచ్చి. ౧౭౪

కం. సైరింపుము సైరింపు, మకారణమ నికారణంబు♦కార్యం బగునే?
యోరక్షోధీశ! యకూపారవ్యాహారములను♦వలదా వినఁగన్. ౧౭౫

కం. నీ కపకారం బనునా, నీరప! కారణము లేక♦నిర్భీకుండై
చేకొనునె చేయ? నీతఁడు, వాకొనుమనవులను నీవు ♦ వలదా వినఁగన్. ౧౭౬

ఉ. ఈతఁడు పెద్దకాలముగ♦నీనగరీపరిఖాయితాకృతిన్
వీతదరుండునై మనియెఁ ♦ బేర్కొనఁ గాఁ డపరాధి నీకుదు
ర్నీతి పరుండు గాఁడు మది ♦ నీయెడ వంచన యింత లే దప
ఖ్యాతి గదా వధింపఁగ ని♦రాగసునిన్ శరణన్నదీనునిన్. ౧౭౭

కం. శకలీకృతనికృతియొ మతి, వికలీభూతుఁడవు గాక ♦ పిలువుము; దానిన్
శకలీభూతముఁ జేసిన, నకలంకముగాఁగ సర్వ ♦ మాకలిత మగున్. ౧౭౮

వ. అనుటయు నమ్మానంబు రావించిన నయ్యది కయ్యంబునకుఁగా నొక్కముహూ
ర్తమాత్రంబు మందసంబు విడిచియుండితింగాని తక్కంగలకాలంబునఁ బాసియుం
డనని శపథంబుచేసిన నేమియుఁ జేయునది లేక. ౧౭౯

కం. కడచినదానికి వగచుట, కడునవివేకంబు దానఁ ♦ గార్యం బేమీ?
కడచిననీరముఁ గట్టిన, నెడఁ గని నను నగుదురు గద ♦ విడిచితి వీనిన్. ౧౮౦

వ. అని కౌసల్యదిక్కు మొగంబై. ౧౮౧

*** రావణుఁడు కౌసల్యం జంపఁ బూనుట. ***

ఉ. ఈతరుణీమతల్లి కుద♦యించెడు వెన్నుఁ డటంచు వింటి నీ
కాతరలోచనం దునుమఁ♦గాఁ దగుఁ గార్యము దీరు నంతటన్

ఖ్యాతిగ ధాత్రవ్రాత కడ♦గాంచు నటంచును జంద్రహాసమున్
జేత ధరించి కాంతదెసఁ ♦ జేరఁగఁ బోవుచునుండ నడ్డమై. ౧౮౨

తే. దోషవర్జితమృదుహిత♦భాషుఁ డర్థి,తోషణుం డధర్మక్రియా♦ద్వేషణుండు
సుగుణగణభూషణుండు ని♦స్తుల్యరిపువి,భీషణుం డయి వెలయువి♦భీషణుండు. ౧౮౩

## రావణునకు విభీషణుం డడ్డపడుట.

ఉ. అన్న! సహింపు మన్న! మగ♦నాలిని జంపుట దోష మన్న! యీ
యన్నుల మిన్నఁ గన్న నొక♦యన్నువయేనియుఁ బాప మెంచ రా
దన్న! మనంబు నీ రగుఁ గ♦దన్న సతీచరితంబు గన్న నో
యన్న! శమింపు మన్న! వల♦దన్న! వధింపకు మన్న! మ్రొక్కెదన్ ౧౮౪

ఉ. కేల శితాసిపూని కనుఁ♦గ్రేవల నిప్పులు రాల నమ్మహో
కాలునిలీలఁ గ్రాలునినుఁ ♦ గాంచి ప్రవాతవిధూతరంభ నాఁ
జాల వణంకెడిం గనుమి ♦ జాలుగ రాలఁగ బాష్పవారి యీ
గోల సలీలఁ గాలగతిఁ ♦ గూర్పఁగ నేల వచింపుమన్నయా? ౧౮౫

ఉ. ఇంద్రుఁడొ చంద్రుఁడో మఱియు♦పేంద్రుఁడొ రుద్రమదంబు గల్గురా
జేంద్రుఁడొ పన్నగేంద్రుఁడొ మృ♦గేంద్రుఁడొ గాక నగేంద్రుఁడో విహం
గేంద్రుఁడొ కిన్నరేంద్రుఁడొ క♦పీంద్రుఁడొ యెవ్వరిమీఁద నైనని
స్తంద్రమదావిలారిబల♦దారణదారుణ మౌక్కృపాణమున్? ౧౮౬

ఉ. నీమొగ మెన్నఁడుం గనదు ♦ నీ కొక యెగ్గుఁ దలంప దాత్మలో
నేమివిరోధ మెన్ని యిటు ♦ హింస యొనర్చెదు? తోఁప దా యెనా
భామ లవధ్య లన్ననుడి ♦ పాండితి రిత్తప్రయాసమాత్రమా?
తామరసాక్షిఁ జంపు టతి♦దారుణకర్మము శూరధర్మమే? ౧౮౭

ఉ. దానవలోకనాథ! మును ♦ తామరసోద్భవుఁగూర్చి వేఁడుచో
మానవవానరాళి నభి♦మానము పేర్మి గణింప వీ యెడన్
మానవి దీనికిన్ వెఱచి ♦ మారణకర్మ మొనర్ప నచ్చరల్
మానినికిన్ భయంపడిరె ♦ మానవభోజి యటంచు నవ్వరే. ౧౮౮

కం. నగరాజవైరిపైఁ బెనుఁ,పగ రాఁజఁగ వైవఁబడిన♦పటుశస్త్రమునన్
నగరాజగమనఁ ద్రుంచిన, నగరా ంశాళినగ గేలి ♦ నగరాజకుచల్. ౧౮౯

## రాగవల్లరీవృత్తము.

ఏల నీకీ కోప ♦ మింతిం జూచినన్?
బాల గాదా దైత్య♦పాలా! కూల్పఁగా

మేలు కల్దా? పూర్ణ♦మేధం జూడుమా
చాలు నన్నా! చిత్త♦శాంతిం బొందుమా. ౧౯౦

వ. అదియునుం గాక యొక్క విశేషంబు సావధానుండవై చిత్తగింపుము. ౧౯౧

కం. లగ్నము విఘ్నం బైచన; భగ్నముఁ గావింతు ననుచుఁ ♦ బనిపూనితి వా
లగ్నము తప్పద హృది ను,ద్విగ్నుఁడుగాఁ గొదవయేల ♦ విఘ్నం బగునో? ౧౯౨

కం. వెన్నుం డుదయం బగు నీ,యన్నులమిన్నకును దప్పదనిలోఁ జెడి నో
యన్నా! యిన్నాతిని దల, గొన్నఁ దలకొనఁగఁ జేటు♦గూడెడు నిపుడే. ౧౯౩

కం. ఎట్టన నరహరిపోలికఁ, బుట్టెడి సతి విడువ నెపుడు♦పుట్టునో మీఁదం
జెట్టెప్పటికో పడు నని, కొట్టి యిపుడ మీఁదఁ ద్రోసి♦కొందురె ప్రాజ్ఞుల్?

వ. అనరణ్యునిశాపంబును, సనత్కుమారుబోధనంబును, గిరిగుహాంతరవర్తికపిలమూ
ర్తివచనంబులను, సంస్మరించుకొని శాంతుండవు గమ్ము, కాఁగలది కాఁగల దని
యుఁగానేరనిది కానేరదనియు నెఱింగి మనీషావంతులు సుఖదుఃఖంబులకై వగవ
రని వచించిన రోషవశోన్మాదంబునదండతాడితభుజంగంబుపగిది రోఁజుచువారల
వెడలనడువుఁ డనినియమించి పురంబున కరిగె నంత. ౧౯౫

శా. ఆదారప్రియు లంత నీరనిధివే♦లాంతస్థలిక్ నిస్తులా
హ్లాదం బొప్పఁ జరించుచోఁ బతి తరి♦ష్యావః కథం కిరవా
ణీదృగ్భీతికర మ్మహాజలనిధి ♦ న్నేహాస్థితి స్సాంప్రతం
ఖేదం నో ప్రతిపాదయన్తి దనుజాః♦ కేనా న్యుపాయేన తే. ౧౯౬

తే. అనుచు గూఢోక్తి భాషించు♦నవసరమునఁ, జుక్కజాతినగతిదోఁప♦సూర్యకులుని
మ్రోల నిలుచుండె నారద♦మునివరుండు, వారుసంతోషభక్తిసం♦భరితు లగుచు.

వ. మ్రొక్కి నిలుచుండి రంత దశరథుండు భగవంతుడ వైననీదుకృపావిశేషంబున
మనుగడ గనితిమి. మిముబోఁటి మహాత్ములసందర్శనంబను పుణ్యంబు లభించినపు
డుచితంబగు నర్ఘ్యపాద్యాదిక్రియాచరణంబులు నాకు దుష్కరం బయ్యె. వేలా
వలయిత భూమండలేశ్వరుండ నయ్యు మహాత్ముల కుచితసత్కార విధులేనియుఁ
జల్పంగనేరని దుస్థితినున్నవాఁడ. నాయొసంగమిచే మీకేమియుఁ గొఱంతలే
కుంటయు నెఱుంగుదు. ఐయినను గర్తవ్యలోపంబు దోషంబుగదా? కావున నా
తప్పులోఁ గొనుఁడు. రాత్రుసకృత్యం బిట్టిదురవస్థలపాల్సేసె. భవద్దర్శనంబున
దుర్వారసంసారకూపారతరణంబెసుకరం బన నీనీరధిం దాఁటుట మాకసాధ్యంబె?
కరుణాపరులరై యావలితీరంబుఁ జేరునుపాయంబు వచింపుఁ డని వేఁడుటయు వా
రలనూఱడించి జటాయువుఁ దలంచిన నతండు సన్నిహితుం డగుటయు నతనిం
దశరథునకుంజూపి నారదుం డిట్లనియె. ౧౯౭

చం. వినుము నరేంద్రచంద్ర! పృథి♦వీస్థలిఁ గల్గినపక్షిజాతులం
దనఘుఁ డధీశ్వరుండును మ♦హాబలశాలి మరుద్విహంగరా
జనిభజవప్రచారుఁడు య♦శస్వి యనూరుతనూభవుండు; మీ
రనయము సౌహృదంబును బ్రి♦యంబుఁ జెలంగఁగ నుండుఁడీ యిఁకన్. ౧౯౯

వ. సూర్యకులుండ వగునీకు సూర్యసారథితనూజుతోడి స్నేహం బుచితంబు సవయస్కులరు కావున నీతండు మిమ్ము నీపురంబుఁ జేర్చు నని చనియె నంత. ౨౦౦

జటాయువు కౌసల్యాదశరథుల నయోధ్యకుం గొనిపోవుట.

కం. ఖగరాజు వాహనంబుగఁ, దగ వాహ్యాళిని జరించు♦దంపతులక్రియన్
ఖగరాజు వాహనంబుగఁ, దగ వాహ్యాళియునుబోలె ♦ దంపతు లంతన్. ౨౦౧

వ. చని యయోధ్య చేరునప్పటికిఁ దురీయయామంబు గావచ్చిన నిట్టిపాట నొంటి పొచ్చుట మేలుగా దని నగరప్రాంతారామంబున డిగి యనూరుసుతకల్పితపత్రాస్తరణంబుననుండి రందు దశరథుండు సుమంత్రుం దోడ్కొని రమ్మని యతనిం బంచె నని శుకయోగీంద్రుండు పరీక్షిన్మండలేంద్రున కెఱింగించిన తెఱంగు. ౨౦౨

కం. ద్యో(వా)హినీశబంధన! నీవారాహారపాల ♦ నిస్తులశీలా!
భావాతీతగుణాన్విత! కైవల్యపదప్రదాన ♦ కగుణాఘనా! ౨౦౩

స్రగ్విణి.

రా(మ)! రాజీవనే♦త్రా! రమావల్లభా!
భూమిజాలోచనాం♦భోజపద్మప్రియా!
హైమశైలాత్మజా♦ధ్యానమార్గస్థితా!
హైమచేలా! వినీ♦లాంబుదశ్యామలా! ౨౦౪

గద్యము.

ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిందాయమానమానసత్వమహో
వైభవ వావిలికొలను రామచంద్రరాయతనూభవ సుజనవిధేయ
సుబ్బరాయనామధేయప్రణీతం బైనశ్రీకౌసల్యాపరిణ
యంబునం బంచమాశ్వాసము.

శ్రీరామచంద్రార్పణమస్తు.

శ్రీరామచంద్రాయనమః.

# శ్రీకౌసల్యాపరిణయము.



## షష్ఠాశ్వాసము.

స్తుత! సర్వసుపర్వసు
శస్తగుణాకల్ప! సత్య♦సంకల్ప! హరో
పాస్త! సమస్తకళంకా
పాస్తవినతభవనిరాస♦యగవరవాసా! ౧

తే. అవధరింపుము దేవ! మ♦హానుభావ! భావనాతీతచేతనా♦భావవిమల
భావపుంభావకరుణాస్వ♦భావుఁ డైన, బాదరాయణి యిట్లను♦సాదరముగ. ౨

వ. అట్లు దశరథుండు వెల్లింబడి పోవుచున్న సమయంబున. ౩

### మంత్రులు దశరథుపోకడ దెలియక దుఃఖించుట.

కం. వానలు నిలిచెను; సితరుచి,తో నలుదెసలు న్వెలింగెఁ♦దోయధరచయం
బానలుపెల్లను విచ్చెడు, నానలు నిడినట్లు రూప♦మణి చనఁగ నట్టి. ౪

చం. తిమిరములెల్లఁ బాయ శుచి♦దీధితి దిక్కులు వెల్గ నందఱు౯
గుములయి యొక్కచోఁ గలసి♦కూరిమిమీఱఁగ వారివారలం
గ్రమమునఁ జూడఁబూనఁ బతి♦కన్బడకుండిన మంత్రులెల్ల మో
సము చనుదెంచె నెట్లనుచు♦సాధ్వసశోకపరీతచిత్తులై. ౫

కం. ఉడుపము రాజన్యుని నా,యుడుపమున నదిం దరింప♦నోదవిన వానల్
విడువక యుడుపనిదోసం, బుడుపహితకులీను ముంచె♦నొయ్యన వెల్లి౯. ౬

చం. అనుచును మంత్రులందఱు భ♦యాతురులై యొకచోటఁ జేరియా
ననముల దీనభావము ఘ♦నంబుగఁ దోఁపఁగ నెద్ది దిక్కుఁ కే
యనువున రాజుఁ గాన నగు♦నంచు విచారవశీకృతాత్ములై
కనఁబడకుంట నావయును♦గార్యము రోయ స్రవంతినం చొగి౯. ౭

ఉ. సాదులఁ బిల్వఁ బంచిన హ♦సాదని వారలు రాఁగ వేగ మీ
రేదియు నేరితో ననక ♦ యేటిప్రవాహముజాడఁ బోయి నిం
పాది జవంబునం బడవ♦భంగియు మానవపాలురీతి నా
మోదము మీఱఁ గాంచి యొక♦మూరుతమంతటిలోన రం డనన్. ౮

ఉ. వారలు పోవ నావికుల♦వారము నట్టుల పంప వారు దు
ర్వారరయంబుమీఱఁగ ధ♦రావరమార్గణతత్పరాత్ములై
దూరము నేగి యొక్కయెడఁ ♦ దోయములం దఱ మున్గి కంపలం
దీరమునం దవుల్వడుట ♦ నిల్చి నిషద్వర బాధితంబునై. ౯

కం. రూపు చెడియున్న యుడుపము, నేపున వెడలించి తెచ్చి ♦ నెవ్వడి వారల్
దాపున నిల్చిన మంత్రులు, బాపురె యని దానిఁ జూచి ♦ పటుశోకమునన్. ౧౦

వ. నరనాథుండు భీకరమకరసరసంబునంబడిమృతుండయ్యెనో కో యని వగచి పౌరుల
నెల్లఁ బురంబునకు మరల్చి యావృత్తాంతంబు గోప్యంబుగా నిడ నియమించి య
ప్రమత్తులై రక్షించుచు వివిధంబుల నాలోచించుచు వసిష్ఠున కిట్లనిరి. ౧౧

కం. హితుఁడవు రవికులులపురో, హితుఁడవు నిస్తులితధీస♦హితుఁడవు నవ్యా
హతమేధాకలితుండవు, హిత మెయ్యది చెప్పవయ్య ♦ యీసమయమునన్? ౧౨

కం. వేఁకరము సర్వజనదుః, ఖాకరము స్వరాష్ట్రజనభ♦యాకరమును జిం
తాకరము నయ్యె నిపుడీ, వేకర మనురాగమునను♦హిత మొనగూర్పన్. ౧౩

కం. ఎయ్యది పంచిన నొనగుతు, మయ్యా యని మంత్రు లనఁగ ♦ ననియె వసిష్ఠుం
డయ్యలు! చూడ నుపశ్రుతి, డయ్యెఁడు దశరథుఁడు వగఁబ♦డకుఁడీ మీరల్.

కం. సైరింపరయ్య మీరలు, వారాష్టక మింతలోనఁ ♦ బంపుఁడు నెమకం
జారుల గూఢవిచారులఁ, గారా దత్తరము లిట్టి♦కార్యముపట్లన్. ౧౪

వ. మీర లెఱుంగనిరాజకీయక్రియలు లేవు గాన మీరల వాని నిర్వర్తించుచు రాజు
లేనిలోపం బెఱుకపడనీక యప్రమత్తులరై పురంబు రక్షించుకొనుచుండుఁడు దినా
ష్టకంబున కతఁడు రాకయుండినఁ బదంపడి విచారింత మనియెఁ దదనంతరంబ.

తే. పౌరులెల్లరుఁ గనిరి యు♦పశ్రుతులును, వేసి రుడుగనిప్రశ్నలఁ ♦ బెద్దపీటి
గొల్లలను జీరి రెఱుకల♦కొమరితెలను, జెప్ప రెవ్వారు నృపునకుఁ ♦ జేటటంచు.

వ. ఇట్టు ప్రజలెల్లఁ దండ్రిలేనిప్రజలం బోలి విచారంబున రాజుసేమంబుగోరి విచారిం
చుచు దైవప్రార్థనాదికంబు లొనరించుచుండ రఘువంశాధీశునకత్యంతాప్తుండును
మంత్రిసత్తముండు నగుసుమంత్రుండు దశరథుండు గనంబడనిది మొదలత్యంతవిచా
రడోలాందోళితమానసుండై చింతార్ణవంబున మునుంగుచు, నాశాంతరీపంబుధరి
గొనుచు, శోకానలదందహ్యమానుండై దశరథు నెమక ననేకుల గూఢప్రచారు

లగుచారులఁ బంచిన వారలు తూర్ణంబ చని నానాదేశపట్టన పక్కణంబులురోసి రోసి మదిరోసి యోసరిలి యతనిండాసి యత్తెఱం గెఱింగింప విషణ్ణుండై మహా దుఃఖదోదూయ మాన మానసుండై నాఁటిరాత్రినిద్దుర పట్టక పెద్దయుం బ్రొద్దు గుందుచుఁ బ్రక్కంబడి పొరలుచు నొక్కింతకనుమూయ నంతలోన. ౧౯

**సుమంత్రుఁడు దశరథునిం దలఁచి శోకించుట.**

కం. వననిధి మునుఁగుచు లేచుచు, వనటంబడి చావుదప్పి ♦ వనరెడియాజిం
గని కలను గుండె ఝల్లనఁ, గనువిచ్చి విషాద మూరఁ ♦ గలఁగినమతితోఁ.

చం. వెలిచనుదెంచి చూచి యుడు♦వీథిని నుచ్చఁ జరించుజ్యేష్ఠనుం
దెలిసి తురీయయామ మని ♦ నిక్కల యిక్కల యంచు నక్కటా!
జలధిపరీతభూవలయ♦శాసనభాసితకీర్తి సూర్యస
త్కులుఁ డతఁడేడ నాపదలఁ ♦ గుందుచు వందురుచుండు నేడనో. ౨౦

కం. దిక్కిదియని తెలిసినచో, నెక్కలు కట్టుకొని యెగసి♦తీవ్రనఁ బోనో
యెక్కడనున్నాఁడో గదె? యెక్కరణిని దెలియవచ్చు♦నృపచరితంబుల్. ౨౧

కం. అని మనము నిలుపఁజాలక, ఘనముగఁ బైపై న పొరలి ♦ కడుదుస్సహమై
చనుదెంచుశోకవారిధి, మునుఁగుచును వితాకుగొనుచు ♦ మూర్ఛమునుఁగుచున్

కం. నిదురంబొందక యట నెయ్యదిగన్నను రాజదత్త♦మైయుండుటచే
మది దుఃఖము వర్ధిలుచుం, బొదలఁగ నచ్చోటు వాసి♦పోయె నొకండున్. ౨౩

మ. చని యారామమునందు నొక్కయెడ వృ♦క్షచ్ఛాయ నిర్వాతసీ
మను గూర్చుండి సుమంత్రుఁ డొక్కఁడ మహా♦మాత్రాష్టకంబందు న
న్ననురాగంబునఁ బ్రోచుభూధవుఁడు దుః♦ఖాంభోధినిర్మగ్నుఁడై
వనటంగూరుచునుండ నేను సుఖినై ♦ వర్తించుచున్నాఁడ ఛీ! ౨౪

మ. రథినై యాతఁడు దిక్కులన్ గెలువ సా♦రథ్యైకసామర్థ్యముం
బృథుకీర్తిన్ వెలయింప, తేఁ డగుచుఁ బా♦కీంద్రాసనాసీనుఁడై
ప్రథమీఅన్ మతికెక్క మంత్రములఁ జె♦ప్పన్, మెచ్చి మన్నించు నన్
వృథగా నెన్నఁడుఁ బల్కఁ డట్టిపతి పా♦పిం దక్కనా నాకునున్. ౨౫

కం. పతినై మన్నించును దా, హితుఁడై బోధించు నాకు ♦ నేకాంతమునన్
మతిలోనఁ గలరహస్యము, సతతము దాఁపక వచించు ♦ సంతోషమునన్. ౨౬

ఉ. నాదగుజీవితంబు మఱి ♦ నా కిలఁ గల్గినభోగభాగ్యముల్
నాదగువాసివన్నెయును ♦ నన్నుఁ బురీజనులెల్లఁ జూచుమ

ర్యాదయు నాధరాధిపుద♦యారసపూరితసత్కటాక్షవీ
క్షాదృతికారణంబునఁ గ♦దా సయిరింతును తద్వియోగమున్. ౨౭

ఉ. అక్కడఁ బెండ్లిహేతువుగ ♦ నాతనిఁగూడి నదిం దరింపఁగా
నెక్కడిగాలి చూడ నది♦యెక్కడివాన యకాలమయ్యెనున్
గ్రక్కున నాజిఁ ద్రుంప నటు♦కాలుఁడు వచ్చె నటంచు నెంతు నా
కక్కట! రాఁ డదేలయిటు ♦ లార్తిని గూర్చుట కేమొ దైవమా! ౨౮

ఆ. సత్యవచనరచన ♦ సత్యంబు గలదేని, సత్యవచనుసూక్తి ♦ సత్య మేని
రాజభక్తి నాకు♦రాణించె నేనియు, మంద లొందుఁ గాక♦మనుజవిభుఁడు. ౨౯

కం. దినముల నెనిమిదిఁ గనుఁడీ, యని ముని మనుఁ బనిచె నేఁటి♦కదియుం దీఱెన్
ఇనుఁ డుదయించిన నెయ్యవి, విన వ్రాసినవాఁడొ ధాత ♦ వేఁడిపలుకులన్. ౩౦

కం. అరుణోదయపూర్వమ నే, మరణోదయలబ్ధి గనుట ♦ మానిత మగుఁ ద
చ్చరణధ్యానాసక్తిని, నిరయము నా కగునే? వినఁగ♦నేర్తునె చెడుగుల్? ౩౧

వ. అని ప్రాణత్యాగపరాయణుం డైన యతనికి దక్షిణభుజనయనంబులు చలింపనిది యేమియో శుభసూచకం బగుచున్నయది. ఆ ఫలంబున్నపుడ కగుఁగాక. అసువిసర్జనంబు కర్తవ్యంబు గాదు. "జీవన్ భద్రాణి పశ్యతి" యని యుండుట మనినఁ గదా యతనికి నుపయుక్తుండ నగుదు. మరణంబు కరణీయం బైన నతనిఋణంబు నఁజనువాఁడఁ గావున మనికి గలయునికియ లెస్సయనిదురంతచింతాక్రాంతస్వాంతుండై నిబ్బరంబు లేక యూరక వావిడిచి పలవించుచుండ నంత జటాయువును సమీపస్థుఁ డౌట నతనిచరితం బెల్లఁ జూచి యతండు సుమంత్రుండకా శంకించి, డాయం జని తనకులనామంబులు చెప్పి యిట్లనియె. ౩౨

## జటాయుస్సుమంత్రుల సంభాషణము.

ఉ. ఎవ్వఁడవయ్య నీవు? మది ♦ నేటికిఁ గుందెద విట్లు బిట్టుగా?
నెవ్వగ నొందఁగారణము ♦ నే నెఱుఁగం దగునేని చెప్పుమా!
జవ్వని యేదియేని యభి♦సారిక వచ్చెద నంచుఁ దప్పెనా?
నవ్వడి నీవె తప్పితొ వి♦చారము నొందఁగనేల దీనతన్? ౩౩

చం. కులటకు నీతియుం గలదె♦కోర్కి రమింపఁ దలంచి యొందఱన్
వలచునొ యెట్టిభంగి నను♦వారఁ జరించునొ మోసపుచ్చునో
పిలుచన నెందఱన్, వగపు♦పెల్లునఁ దోఁపదుగాక యిట్టిపె
న్వలఁతియు నిట్లు గుందఁ దగ♦వా మగవాఁడవుగావె యిస్సిరో. ౩౪

వ. అట్లు కాదేని యిట్టినిశీథిని నొంటిగనీవృక్షంబునీడశోకింపఁగారణం బేమి యన. ౩౫

కం. విని కటకటఁబడి మనమున, ఘనముగఁ గుత్సించి నీవు ♦ గర్వ మెఱుఁగ కే
ననుఁ నేల దూఱనాడెద, వనఘా! నాచరిత వినుమ ♦ యాద్యంతంబుల్. ౩౭

చం. మనుజవరేణ్యుఁ డాజికిని ♦ మంత్రి సుమంత్రుఁడ, ఱేఁడు పెందయల్
మనుచును లోకమెల్ల నను♦మాత్రముఁ జెప్పఁగనేల; యట్టివాఁ
డనువునఁ బెండ్లికార్యమున♦కై చనుచోఁ దరియింపఁగా నదిన్
ఘనమగుగాలి వాన గడుఁ♦గాఱియ పెట్ట మునింగె నావయున్. ౩౮

కం. ఆతనిపోకడ నెఱుఁగక, యాతతదుఃఖాబ్ధి మునిఁగి ♦ యడలెద నే ను
శ్వేతాలనాథునిఁగూరిచి, పీతముదంబునను బక్షి♦వీరా! యనినన్.

చం. పకపకనవ్వి యిట్టులనెఁ ♦ బ్రాజ్ఞుఁడ వీవయి యింతమాత్రికే
తికమిక నొంది కుందెదవు ♦ దీనత? నిక్కము పల్కవయ్య ధా
త్రికి విభు లెందఱేగిరో? వ♦సిష్ఠులు గారొకొ ప్రాగ్ధరాధిపుల్?
సుకలులు గారొ? శాత్రవని♦షూదనదక్షులు గారొ? నిల్చిరే. ౩౯

కం. ధర నాయది యనువానిని, ధర నవ్వు ననంగవినమె♦దశరథుఁ డీల్గన్
ధరణి యరాజక మగునా? ధరణీశుఁడు దొరకఁడో టు♦త్రదక్షుకుఁడై. ౪౦

కం. ఏమిటి కేడ్చెద వన విని, ధీమహితుఁడు గానఁ గోప ♦ ధీరహితుండై
సామమునఁ బల్కె వినుమా, నామతముఁ బతంగరాజ ♦ న్యాయ్యపథంబుల్. ౪౧

ఆ. రాచకఱవు రాదు♦రాష్ట్రంబరాజకం, బెపుడుఁ గాదు నిక్క♦మింత యైనఁ
దమకుఁ గూర్చునట్టి♦ధరణీశుఁ డబ్బుట, యవనిజనులభాగ్య ♦ మని తలంతు.

వ. జగతిఁ బ్రతినృపతియు సుమతియని మతినెంచకుము. వారియట్ల ప్రాడ్వివాకులును.

### దుష్ప్రభుత్వవర్ణనము.

ఉ. లంచముఁ గొంచుఁ గొందఱును ♦ లంజెల కాస వహించి కొందఱున్
వంచనచేతఁ గొందఱు స్వ♦భావదురూహలచేతఁ గొందఱున్
గొంచక దుష్టకార్యములఁ ♦ గూర్చి మనంబు జనంబు గుందఁగాఁ
గొంచెమయేని జంకక యె ♦ కూళులు న్యాయముఁ దీర్తు రక్కటా. ౪౪

ఉ. న్యాయపథంబునుం దొలఁగ ♦ మంచు వచించుచు నీతు లాడుచుం
గాయలుఁగూరలుం గొనరు ♦ కానుకపండు గ్రహింప రిట్టిపె
న్మాయలు పన్ని కార్యముల ♦ మానక మిత్రులవంక నేనియున్
జాయల వంక నేనియు ధ♦నంబులుఁ గొందురు మోసతీర్పరుల్. ౪౫

చం. చెనఁటియొకండు దాఁ జెవిని ♦ జెప్పినమాటలు నమ్మి సాధులౌ
జనులకుఁ గీడుసేయుదురు ♦ చాల రొకింత మెఱుంగ న్యాయమున్

వినుదురు దేనిఁ జెప్పినను ♦ విశ్వసనీయుఁ డటంచుసజ్జనుల్
గనుఁగొనలేరు దుష్టవచ♦నంబులు మే లనినమ్మి దుష్ప్రభుల్. ౪౭

కం. అనుజీవికష్టమెఱుఁగఁడు, తనజీవమె దివ్యమనుచుఁ ♦ దలఁచుఁ గుమతి దాఁ
దనుఁజేరవచ్చె నేనియు, ననఘునిఁ గనలేక మిగుల♦నవమానించున్. ౪౮

ఉ. లేనికుయుక్తిఁ బన్ని మితి♦లేనివ్యయంబులు చెప్పి లెక్కకున్
రానివి పన్నులం గొనుచు ♦ రాష్ట్రమునెల్ల మహాదరిద్రతా
ధీనముచేసి భూప్రజలఁ ♦ దీవ్రతరార్తులఁ జేయునట్టిభూ
జానులసేవ నా నరక♦సామ్యముగాదె తలంపనేరికిన్. ౪౯

సీ. దుర్భిక్షమున జనుల్ ♦దోరంగఁ బెల్లుగా, నతిభుక్తిచేత నీ♦వ్యృతి యటంచుఁ
జెలమ నీ రనఁగఁ బ♦న్నులు దీయుకొలఁదిని, పౌరులసంపద♦పరఁగు ననుచు
శాస్త్రసంఘం 'బతి ♦ సర్వత్రవర్జయే,' త్తనుఁ గాన మితము వే♦తనము లిడుచు
'కష్టీఫలీ' యని ♦ కల దటుగావున, విడువక రేవగల్ ♦ నెతల నిడుచు

తే. రాజు రక్షకుఁ డగుటను♦బ్రజలకెల్ల, ధనము నృపకోశమం దుంపఁ♦దగునటంచు
నోడుపుమాటలఁ బ్రజతలల్ ♦దడవునట్టి,రాజుసీమను జనులకు ♦ బ్రదుకుగలదె?

చం. కొలువుడుకాఁడుమాత్ర మనఁ ♦ గూటికి నిచ్చుచు, రేయియుం బగల్
గొలువునఁ ద్రిప్పుచుం, దిరియఁ ♦ గూడదు భూములు విల్వఁగూడ ద
ప్పులు గడియింపరాదనుచుఁ ♦ బూని విధించుచు నాలుబిడ్డలం
దలఁప రదెట్లు ప్రోతు రని ♦ దండ్యు లటందురు లంచగొండులున్ ౫౦

తే. తన్నుఁ బ్రోచినవారి న♦ధఃకరించు,వారిఁ బెఱవారు నమ్మంగ♦వచ్చునెట్లు
బహుజనవిరోధినుడివిను♦ప్రభువు సర్ప,యుక్తచందన మటుచేర♦కుందు రెవరు.

మ. జను లుచ్ఛ్వసితినున్నచో నహింభయా♦సన్నంబు శంకింపఁ డా
త్మను విశ్వాసముఁ జూపుచుం బ్రజలభ♦ద్రం బాత్మభద్రం బటం
చును వర్తించుచు మన్ననం దనుపుచున్ ♦ శుద్ధాత్ముఁడై యుండుఁ గా
వున నాజిం దమతండ్రిగా జనులు కొ♦ల్వుం బాయ రెప్పట్టునన్. ౫౧

ఆ. ప్రజల కేమివలయు ♦ బాధ లేకుండుట, సౌఖ్యవృత్తి గాక ♦ జరగ నివియు
జనులుప్రభులపట్ల♦జలుపరుద్రోహ మం, చెఱిఁగియతఁడుమేల♦యెపుడుఁజేయు.

సీ. తనవారి నైనను ♦ దండింపకుండఁడు, తప్పుగల్గినచోట ♦ ధర్మనిరతి
యోగ్యతయున్నచో ♦నొప్పరికింపఁడు, సేవకు లంచును ♦ జిన్నపుచ్చి
జనసమ్మతములేక ♦ శాసింప నొల్లఁడు, తత్కార్యములను స్వ♦తంత్రతఁ డయ్యు
నందిపొందినవారి♦నైనఁ జేవీడఁడు, తనదుబంధులమాటఁ ♦ దడవ నేల

తే. శ్రమముల నెఱింగి తగినజీ♦తముల నిచ్చి, తప్పుగల్గిన దండించి ♦ మెప్పు మెచ్చు
త్మాపుఁడిటులైన నన్యాధి♦కారులేల, నీచమతిఁ గేలు సాఁతు రు♦త్కోచములకు.

కం. విశ్వాసము విశ్వాస ము, విశ్వాస మవిశ్వసనము ♦ వెలయించు మదిన్
విశ్వంబునఁ గావునఁ గడు, విశ్వాసమె చూపుఁ బ్రజల♦విషయమునందున్. ౫౫

వ. మఱియు నెవ్వనికోపప్రసాదంబులు నిష్కారణంబులు నిరర్థకంబు లెవ్వనిమనం
బుంబోలె వచనం బవిశ్వసనీయంబు చంచల బట్టి మాత్సర్యాసూయాధారాత్మ
లగుపాపాత్ములఁ గొలుచుటకన్న మూఁడువీధుల ముష్టి యెత్తుకొని కాలంబుగ
డుపుట చాలమేలుకాదె యదియునుం గాక. ౫౬

కం. ఇనకులుఁ డనూధుఁ డగుటను, నినవంశము నేఁటితోడ ♦ నిగిరె నటంచున్
మనమున దుఃఖించెద నే, నతయంబుఁ దదవితదేహ♦మై యిది యునికిన్. ౫౭

వ. అని వగచిన విని సుమంత్రా! నీయంతటిమతిమంతుండును, గుణవంతుఁడు నగు
మంతిరి యుండుట నిసుమంతయువంత దశరథధరాకాంతునకు సంభవింప నేరదు
నీమనంబుఁ బరీక్షింపఁ బరిహాసంబుగాఁ బలికితి క్షమింపుము. ౫౮

కం. పురికి ననతిదూరంబున, సరసతిఁ గౌసల్యఁగూడి ♦ జనవిభుఁ డున్నాఁ
డరసి నిను వార్తఁ జెప్పఁగ, ధరణీశుఁడు పంపె నన్నుఁ ♦ దథ్యము సుమిత్రా. ౫౯

వ. నను మీయేలికకు మిత్రునిఁగా నెఱుంగు మని యించుకించుక యతనివృత్తాంతం
బెఱిఁగించి. ౬౦

ఆ. ఏకవస్త్రుఁ డగుచు ♦ నెలనాఁగతోఁగూడి, పురము వెలిని నిలిచె ♦ భూవిభుండు
పురమునందుఁ జాటఁ ♦ బుచ్చుము విభురాకఁ, దడవుసేయవలదు ♦ ధన్యచరిత.

వ. అనిన జెప్పవెట్టక యట్టి యతనిమొగంబుఁ గొంతతడవుచూచిసుమంత్రుండు.

ఉ. నమ్మఁగఁజాల నీపలుకు ♦ నావిభు నాజిని గాంచికాని లే
లెమ్మిదె కాంచనాంబరము ♦ లీలగఁ దెచ్చెద నంచుఁ బాసి తా
నుమ్మలికంబు సంభ్రమము ♦ నొప్పినశంకయు సందడింప నా
కుమ్మడి నింటికేగి వస ♦ నోజ్జ్వలభూషణముల్ గ్రహించుచున్. ౬౩

## సుమంత్రుఁడు దశరథుం జూచుట.

చం. అతనిని గూడి ♦ తా దశరథావనిపాలుసమీపసీమకై
యతులిత వేగయుక్తిఁ జన ♦ నాతనిఁ గాంచి సుమంత్ర! లెస్సయే?
హితులకు మేలె? పౌరజను♦లెల్లసుఖింతురె? యంచు సేమమున్
హితమతిఁ బ్రశ్న సేయ ధర♦ణీశునిపాదయుగంబు పట్టుచున్. ౬౪

వ. అభివాదనంబుఁ గావించి హర్ష పులకితగాత్రుండై నేత్రంబుల నానందాశ్రులుజాలు వాఱ సర్వంబులెస్స యని విన్నవించి తాఁ దెచ్చినదుకూలాభరణంబు లొసంగి మదీయపునరాగమనంబు నిరీక్షింపుఁడు పురంబున సర్వంబు నాయత్తంబుచేసి క్రమ్మతెద నని సెలవుగొని నగరంబున కరిగి యమాత్యుల కెల్లఁ దద్వృత్తాంతంబుం జెప్పి పుత్తెంచి పురంబున సందులు గొందులు రథ్యాపథాదుల నొక్కపెట్ట బోరు గలుగ. ౬౫

కం. చనుదెంచె నాజి కుశలిగ, వనజాయతలోచన న్వివాహంబై పూ
ర్జనము లెదుర్కొన వలయుం, గనరండీ గృహముగృహముఁ గైసేయుండీ ౬౬

వ. అని చాటింపించిన నందఱు సంభ్రమోత్సుకులై పురం బలంకరించి రందు. ౬౭

## పౌరు లయోధ్య నలంకరించుట.

ఉ. చారుమసారహీరనవసారవసారసకైరవోరుక
హ్లారపరంపరాకలితహారిసుగంధిలమోదకారిస
త్తోరణరాజి రాజిలఁగఁ దోరముగా ఘటియించి రందఱు
దారులఁ బౌరు లాత్మల ముదంబు ముదంబువుగ్రాలఁ గన్నులన్. ౬౮

తే. అంగుమీఱిననయానిమెఱుంగుమణులఁ, బొంగ నంగంబు వీథుల ముంగిళులను
రంగురంగుగఁ దీర్చిరి రంగుమీఱ, రంగవల్లుల భీతకురంగదృశలు. ౬౯

సీ. వీట నెయ్యెడఁ గన్నఁ బాటీరఘనసార.సారసకరవీరసౌరభములె
వసతు లెయ్యెడఁ గన్నఁ గాయనవ్యకధూప,మంగళధూపధూమఘుమఘుమలె
జనుల నెవ్వరిఁ గన్న సవిలాససువికాస,భాసమానాస్యప్రభాలసితులె
సతుల నెచ్చటఁ గన్న నతులితాలంకార, కౌశేయవర్ణక క్రమతనులె ౭౦

తే. తెంకులం దెల్లగీతవాదిత్రరవమె, వీథులం దెల్ల మంగళవిపులనదమె
వెలయఁ బర్వంబునందలి జలధికరణి,జనము లుబ్బునఁబొదలి రాసమయమునను.

తే. సచివవర్గంబు పురజనసహిత మగుచు, రాజవర్యు నెదుర్కొన నోజఁ జనియె
బర్వశర్వరి శర్వరీపతికి నెదురు, సరవిఁ బఱతెంచుమున్నీటితరఁగ లనఁగ. ౭౧

వ. ఇట్లపరిమితసన్నాహంబున నృపవర్యుని డాయంబోయి నమస్కారాదివిధుల బహూకరించిన నతండును వారల నుచితసత్కారంబుల గౌరవించి జరగినవృత్తాంతం బంతయుఁ దెలిపిన వారు భయభ్రాంతసహర్ష చేతస్కులైరి. పిదప నచ్చటన నృపుండువారితో మజ్జన భోజనాదిక్రియల నిర్వర్తించి సుఖగోష్ఠినుండి సాయంసమయమగుటయు మహాడంబరంబున నగరంబుఁ బ్రవేశింపసమకట్టి కౌసల్యాదేవింగూడి రథారోహణంబుఁ గావించి మహావైభవంబుతో రాజమార్గంబున రాఁ బౌరులు బారులుదీరి చూడఁ దొడంగి రప్పుడు. ౭౨

## కౌసల్యాదశరథు లయోధ్యం జొచ్చుట.

చం. ఇరుగడలందు హర్మ్యముల ♦ నింపును సొంపు రహింప మీఱుస్త్రీ
పురుషకరోజ్ఝితప్రసవ♦పుంజము దోఁచె మరుండు చిమ్మెనో
స్ఫురదభిరూపమారరతి♦మూర్తుల దంపతులన్ శరాళి మ
చ్ఛరమున, నాకవాసులె వె♦సం గుసుమాళుల నించిరో యనన్. ౭౩

ఉ. పల్లవపాణి యోర్తు కర♦పద్మపుటంబున దోయిలించి సం
ఫుల్లసుమోత్కరంబుఁ దమి ♦ భూపకుమారకుఁ జూచి చూచి యా
హ్లాదమగ్నయై ప్రిదులు♦హస్త మెఱుంగక రిత్తదోయిటం
జల్లిన దానిఁ జూచి యెక♦సక్కెము లాడిరి తోడిచేడియల్. ౭౪

కం. కోరిక దశరథు మారా, కారునిఁ గనుఁగొనినపౌర♦కంజాతాక్షుల్
సారెకు నావలఁ బతులం, గూరిమి రతిఁగూడి రినునిఁ ♦ గూడినభంగిన్. ౭౫

చం. వలచి కడాని పైఁడిహరి♦వాణమునం గపురంపుటారతిం
గలికిమిటారి యోర్తుగొని ♦ కాయజరూపు మొగంబుఁ జూచుచు
న్నెలువుగఁ ద్రిప్పుచుండెఁ గన♦నేరక కప్పురమాఱుటల్ ననుం
దెలియుము మన్మథుం డిటుల ♦ త్రిప్పెడుఁ జిత్త మటంచుఁ జాటెనా. ౭౬

వ. ఇట్లు పౌరులు నిర్భరానందమగ్నులై తమ్ముం జూడ వధూవరులువీథులు గడచి సౌధంబు ప్రవేశించి జటాయువునకుఁ బసదనంబులతోడ సెల వొసంగి యథేచ్ఛావర్తనలం బ్రవర్తించుచు భానుమంతునకుఁ దదుదంతంబు సర్వంబుఁ దెలిపించినఁ దనయ పునర్జీవిత యయ్యె నని హర్షంబున భార్యాసమేతుండై యతండు చనుదెంచి పెండ్లికూఁతుఁ గూఁతుఁ బెండ్లికొడుకుఁ బెండ్లికొడుకుం గాంచి యభినందించి కొన్నిదినంబులుండి యరిగె నంత. ౭౭

ఉ. వాసరనాథవంశనృప♦వాసవుఁడున్ శుకపైకగీతికో
ద్భాసితమాసరప్రసవ♦వాసితకోమలపుష్పవాటికా
ధ్యాసితవృత్తి నిందుముఖి ♦ దాను వసంతమువేళ మీఱె న
భ్యాసితమారశాస్త్రముల ♦ వాసి వహించి రహించి యెంతయున్. ౭౮

ఉ. రంగదభంగురాంగభవ♦రంగసుసంగతభంగిఁ బొంగి యా
యంగన సంగడంబు వెల♦యంగను దుంగతరంగపంక్తిజ
క్రాంగవిహంగదంపతుల♦యంగున నంగముపొంగ మంచువే
సంగిఁ దరంగిణీతటి నె♦సంగెఁ బతంగకులప్రదీపుఁడున్ ౭౯

వ. ఇట్లానరవరుం డనవరతనవరతవరతర కేళీలోలుండై చరించుచు. ౮౦

కం. మిత్రకులాభరణంబు పవిత్ర సుధీనుతచరిత్ర ♦ విజ్ఞానకళా
పాత్రను వరించెఁ బిదప సుమిత్రను సౌందర్యజనస♦మీడితగాత్రన్. ౭౧

ఉ. నీదుసమక్షబోధమున ♦ నే నిఖిలావనిసీమఁ బట్టముల్
నీదుసుతాతనూజునకు ♦ నిక్కముగా ఘటియింతు నంచు మ
ర్యాద వచించిమానవకు♦లాధిపుఁ డర్మిలిఁ బెండ్లియాడె నా
హ్లాదము మీఱఁ గేకయధ♦రాధిపనందనఁ గైక యన్సతిన్. ౭౨

కం. శనిరోహిణీశకటభేదన మాఁపుచు ద్వాదశాబ్ద♦తతదుర్భిక్షం
బనువుపడకుండ నొనరిచె, ననఘుఁడు దోర్దండఘనశ♦రాసనశక్తిన్ ౭౩

**కాలనిర్ణయ రామాయణము.**

మ. సవ మీఱంగను ఋశ్యశృంగయుతుఁడై ♦ చల్వంగఁ దా యాగముల్
సవనాగ్నిం బ్రభవించి దివ్యుఁ డొసఁగెన్ ♦ సంప్రీతిమైఁ బాయసం
బవనీపాలున కంతఁ దత్సతులు న్యా♦యంబొప్పఁ గౌసల్య రెం
డవుభాగాలు సుమిత్ర పాదమును బా♦దార్ధంబు నక్కైకయున్. ౭౪

సీ. ఉపయోగ మొనరింప ♦ నొప్పుగఁ బంచమ, త్రేత విలంబిని ♦ చైత్రమాస
సితపక్షనవమిని ♦ సితకరసుతవార, మధ్యాహ్నవేళను ♦ మఱి పునర్వ
సూడువు నందుఁ జె♦ల్వొందు కర్కాటకం, బందును గురువిధు ♦ లందగింప
రెంట రాహువును నా♦ల్గింటను శౌరియు, మకరకుంభంబుల ♦ మహిజ కేతు

తే. వులును మీనంబునను శుక్ర♦బుధులు మేష
మునను సూర్యుండు చెలువార♦మునులు విబుధు
లలరఁ గౌసల్యగర్భమం ♦ దెలమిఁ బుట్టె
రామచంద్రుండు సుగుణాభి♦రాముఁ డగుచు. ౭౫

సీ. జగముల నన్నిటి ♦ జఠరాన ధరియించు, దైవంబు జఠరానఁ ♦ దాల్చె నెవతె
పాలవారిధిలోనఁ ♦ బండు పాపనికిని, బాలియ్యఁ జాలె నే♦పద్మవదన
నెఱిమఱ్ఱియాకుపైఁ♦గొఱనిద్రగొను వేల్పుఁ, గుఱువున జోకొట్టెఁ ♦ గొమ్మ యెవతె
దివిజులు మ్రొక్కంగఁ♦దెలియరానిఘనుండు, ప్రత్యహంబును మ్రొక్క♦వఱలె నెవతె

తే. నిమిష మొకచోట నిల్కడ♦నిలువనట్టి, కొమ్మ యెవతెకు నొనరించెఁ♦గోటఱికముఁ
దల్లి యననొక్కకౌసల్య ♦ దల్లిగాక, తక్కువారలు దల్లులే ♦ ధరణియందు. ౭౬

చం. కనియెను ఋష్యమిన్ భరతుఁ ♦ గైక, సుమిత్రయుఁ గాంచె సార్పభం
బున శుభలక్షణుం డయిన♦పుణ్యుని లక్ష్మణు వానితమ్మునిన్
జనపతి యష్టమాబ్దమునఁ♦జైత్రసితంబునఁ బంచమీతిథిం
దనయుల బ్రహ్మచారుల నొ♦నర్చెను; గాధితనూజు వెంబడిన్. ౭౭

ఉ. కానకకానకేకనిన♦కందుని నొక్కని క్షీరకంఠునిన్
మానుగఁగాకపక్షధరు ♦ మాతృమృదూరులఁగాని నిద్దురం
గాననివాని వల్లభుఁడుఁ ♦ గానల కంపఁగఁ గన్నతల్లి దా
లో నెటులోర్చెఁ బట్టి వని♦లోఁ గసురుల్ దిని తాలఁ బండఁగన్. ౮౮

చం. తనయుల ద్వాదశాబ్దగుల ♦ దైత్యవధార్థము మౌని వెంబడిం
బనిచెను; రామచంద్రుఁ డట♦వారక తాటకఁ ద్రుంచి జన్నముం
బనివడి కాచి గండశిల ♦ భామ నొనర్చి విదేహుశంభువిల్
దునుముచు వీర్యశుల్క యగు♦తోయజనేత్రఁ బవిత్ర జానకిన్. ౮౯

చం. వెలయ నగర్భజాతఁ బృథి♦వీజ వివాహసుయోగ్యశైశవా
కలితసురూపఁ బెండ్లియయి ♦ క్రన్నన భార్గవు గెల్చి యౌవరా
జ్యలలితలక్ష్మిఁ బూనుసమ♦యంబున నిర్వది యేనవేఁటఁ గా
నల జనకుండు నిల్వ మన ♦ నాతియుఁ దమ్ముఁడుఁ దోడురాఁ జనెన్. ౯౦

సీ. మొలకప్రాయమువాని ♦ ముద్దులీనెడువానిఁ, జిఱునవ్వు మొగమునఁ♦జెలఁగువాని
సుకుమారుఁ డగువాని♦సోయగంబులవానిఁ, గొమరుఁ బ్రాయపుటాలు♦గులుకువాని
సత్యవాక్కులవాని ♦ జననుతుం డగువాని, సర్వసమ్మతగతి ♦ జరగువాని
నిర్దోషుఁ డగువాని ♦ నిర్మలుం డగువాని, యౌవరాజ్యంబున ♦ కలరువానిఁ
తే. గామవశుఁడయి సవతి కై ♦ కకునుజిక్కి, కానకనుబోరయనిసుతుఁ♦గాంతుఁ డాడ
జనని యెవ్వ తెయోర్చుఁగౌ♦సల్య దక్కఁ, గాంతకును బతిభక్తిదా♦నెంతఘనమొ.

చం. వనటను జైత్రశుద్ధమునఁ ♦ బంచమినాఁ డిలువీడి దుందుభిం
జనుచును షష్ఠఘస్రమున ♦ సంతసమొప్పఁగఁ జిత్రకూటముం
గనుట సుమంత్రుఁడుం దెలుపఁ♦గా నడిరేయిని రామరామ యం
చును మృతినొందె నాజి యతి♦శోకము పెంపున; వార్త చేరినన్. ౯౨

చం. భరతుఁడు వచ్చి తీర్చికొని ♦ పైతృకకర్మము రాము వేఁడినం
దిరముగ మూఁడునాళ్లు మది♦ద్రిప్పక పాదుక లిచ్చి పంపి వ
త్సరదశకం బరణ్యమున ♦ సంయమిసంగతి నేండ్లు రెండు ని
ర్భరకుతుకంబు మీఱఁగను ♦ బంచవటిన్ వసియించుచుం దగన్.

చం. మునుకొని చుప్పనాతిచెవి♦ముక్కులు గోసి, ఖరత్రిశీర్షుల
న్దనుజులఁ ద్రుంచి మాయహరి♦ణంబును జంపి ధరాత్మజాతఁ గొం
చును బదునాల్గవేఁటి దగు♦శుక్రమునందగు శుక్లపక్షమం
దనువగుఘస్రమధ్యమున♦యందున, విందను బక్షతిన్ వడిన్. ౯౪

ఉ. దొంగిలిపోవు రావణునిఁ ♦ దోరపుశక్తి జటాయు వాఁగినన్
భంగముఁ నొందఁ జేసి చన ♦ వానిని రోయుచు శౌచమాసమం
దుం గలపున్నమన్ హరిసు♦తు న్వధియించి కపీంద్రు నేలి రా
జ్యాంగమునందు నిల్పి జన♦కాత్మజ రోయఁగ నంపఁ గ్రోఁతులన్. ౯౫

ఉ. వారలలోన నాహనుమ ♦ ఫాల్గునశుద్ధమునం ద్రయోదశిన్
వారధిదాఁటి సీతఁగని ♦ వాలి చతుర్దశి లంకఁ గాల్చి పెం
పారఁగఁ జెప్పఁ బున్నమ జ♦యావహ మౌవిజయాన నేగి తాఁ
జేరెను వేల భూపతి వి♦శిష్టకపీశ్వరకోటి గొల్వఁగన్. ౯౬
సీ. ఆరాత్రి జలధివే♦లావని వసియించి, యావలను విభీష♦ణాభయప్ర
దుం డయి ప్రార్థించి ♦ తోయధి దినముల, మూఁటఁ గుశాసన♦మునఁ బరుండి
ప్రార్థన వినకున్న ♦ భంగించి సేతువు, చవితియాదిగ నేను♦దివసములను
బంధించి దాఁటి త♦ద్వాసరంబున సంజ, నెక్కె సువేల దా ♦ నేపు మీఱ
తే. బహుళపక్షంబునవమిని♦ద్వంద్వమైన, రణమునకుఁ బూని యానాఁటి♦రాత్రినాగ
పాశబంధనమోక్షముల్ ♦ప్రాపె రామ, చంద్రుఁడునటించెలక్ష్మణ♦సహితుఁడగుచు
మ. అని ధూమ్రాక్షుఁడు వజ్రదంష్ట్రుఁడును దు♦ష్టాకంపనామాత్యకు
ల్దిన మొక్కొంటను మిత్రభృత్యతనయా♦ళిం గూడుచుం బోరినన్
హననం బొప్పఁగఁజేయ వానరులు దై♦త్యాధీశుఁ డేతేర వా
నిని బాణప్రవిభిన్నగాత్రునిఁగ నెం♦తేకోపియై తోలినన్. ౯౭
ఉ. రామశరార్తిఁ గుంది యవు♦రా యని తమ్మునిఁ గుంభకర్ణుని
న్నాము జయింపఁ బంపఁగ ర♦ణంబునఁ దాదశమిన్ వధించినన్
హామికఁ బంక్తికంఠుఁడు న♦రాంతకకుంభనికుంభముఖ్యులన్
దీమసమొప్పఁ బంపఁ గడ♦తేర్చెను వారల వానరావళుల్. ౯౮
సీ. పదునాల్గువర్షముల్ ♦ పనిఁబూని నిద్రయు, నాహార మెఱుఁగని ♦ యధికుచేత
మరణంబు నొందంగ ♦ వరముగాంచినమేఘ, వాహారి లక్ష్మణ♦స్వామి తోడ
నేకాదశియుమొద ♦ లేకంబుగా మూఁడు, దినములుపోరఁ దృ♦తీయదినము
నందును జాంద్రమా♦నానుసారంబుగ, వ్రతమైన పావన♦పద్ధతులను
తే. మున్నె పదునాల్గువర్షముల్ ♦ చన్నకతనఁ, ద్రుంచెసౌమిత్రిలోకంబు ♦ లెంచనవల
మూలబలమెల్లనయ్యెని♦ర్మూలబలము, మఱుసటిదినానదశరథ♦మహిపసుతుఁడు.
చం. అమవసఁ ద్రుంచె రావణు జి♦తాఖిలశాత్రవుఁ డైనరాముఁడున్
విమలమతిన్ ఘటించెను వి♦భీషణు నేలికగాఁగ లంకకున్
విమనను సీత నగ్నిని ప్ర♦వేశముసేయఁ దృతీయఁ బంచి యా
యమఁ గయికొంచు నేగెను ర♦యానఁ జతుర్థిని బుష్పకంబునన్. ౧౦౦
కం. పంచమిని భరద్వాజు, న్గాంచి మఱుదినంబునందు ♦ నందిగ్రామం
బంచితగతిఁ జేరి జడల్, దించెను దమ్ముండుఁ దాను ♦ దెప్పున నంతన్. ౧౦౧
సీ. వాసిమీఱఁగ ధాతు♦వత్సరచైత్రమా, సమునను శుద్ధస♦ప్తమిని దమిని
సుగ్రీవముఖులెల్ల ♦ సొంపుమీఱ నయోధ్యఁ, బురజనులెల్లరుఁ ♦ బొగడుచుండఁ
జతురంబునిధివర♦జలములు దెప్పింపఁ, బట్టాభిషేకంబు♦పటిమ మెఱయ
నరులువానరు లార్య♦వరులును సురలును, సంతోషయుక్తులై ♦ సంభ్రమింప

తే. ముగురుదమ్ములుఁ జామర♦ములను బూన, వందిమాగధులెల్ల మి♦న్నందిపొగడ
రాముఁ డలరారెఁ బట్టాభి♦రాముఁ డగుచుఁ, వీఁక వెలయంగఁబట్టాభి♦షేక వేళ.

శా. సాక్షాత్కారము గాంచెనో శమ మిలన్♦సత్త్వంబు సాకారమై
లక్షింపందగెనో, దయారసమె యా♦విర్భూతమై మూర్తమై
లక్షింపంబడె నోకొ యంచును మహా♦హ్లాదంబు నిడన్ సహ
స్రాక్షప్రత్యక్షులె సేవచేసి రన నే♦లా యెన్న భూవాసులన్. ౧౦౪

సీ. మనవికై చేరంగ♦మచ్చరంబునఁ దల, వంచియెత్తక యుండు♦వాఁడు గాఁడు
ఎత్తెఁబో వారు నో♦రెత్తకయే మున్న, బద్దుగా గద్దించు♦వాఁడు గాఁడు
గద్దించెఁబో మఱి ♦ సుద్దుల విని పెడ,వాదంబులను ద్రోయు♦వాఁడు గాఁడు
వాదించెఁబో మీఁదఁ ♦ బౌరుషంబున కేని, పక్షపాతము సేయు♦వాఁడు గాఁడు

ఆ. విగతవిస్మయుండు ♦ విస్మయశీలుండు, మృదులపూర్వభాషి ♦ హితచరితుఁడు
సత్యధర్మరతుఁడు♦సాకేతనిలయుండు, మనుజమాత్రుఁడగునె ♦ మానవేంద్ర. ౧౦౫

తే. చక్రవర్తిస్ఫురత్కీర్తి♦శాలులైన, భూమిపాలురు వెలయరే ♦ భూమియందు
వారిప్రభుతకు దేనికే ♦ వచ్చెనొక్కొ, రామరాజ్య మటన్న యా♦నామ మధిప.

చం. చిలుకలఁ గోడెదూడలను ♦ జిన్నికుమారుల వీళ్లనూళ్లలం
బిలుచుచు రామ రామ యని ♦ పేరు లొసంగి యజస్రమున్ జనుల్
దలఁచుచు ముద్దులాడుచును ♦ దన్మయతన్ స్థిరసౌఖ్య మొందఁగాఁ
దెలుపఁగ శక్యమౌనె జగ♦తీవర! రాముదయామహత్త్వమున్. ౧౦౬

కం. పాపలు చన్నుంగుడువఁగ, దాపున రామా యటన్న♦ధ్వని వినఁబడినం
జూపులు నిడిగించుచు నలు, వైపులఁ జూచెద రిఁకేమి♦పలుక మహీశా! ౧౦౭

తే. నాఁటికిని నేఁటికి నిఁ కెన్ని ♦ నాళ్లకైన
భూమి నాపంచమ మదెట్టి ♦ మూఢులైన
"రామవాక్యంబు" మఱి "రామ♦రాజ్య" మనెడు
పలుకె సాక్ష్యంబు తన్మహా♦త్త్వమున కధిప! ౧౦౯

వ. ఇట్లు సాక్షాద్వైకుంఠధాముఁ డైన శ్రీరాముండు రావణమారణకారణంబుగ ధరణీ
స్థలిజనించి సురల సంతోషింపం జేసి నిజపావనకథాపావనిచేత లోకంబుల ధావ
నంబు సేసి రాజ్యంబు సేయుచుండె. ౧౧౦

ఉ. రాముఁడు ఘోరరాక్షసవి♦రాముఁడు భక్తజనావనక్రియో
ద్దాముఁడు కోటిచంద్రరుచి♦ధాముఁడు సేవితదివ్యవానర
స్తోముఁడు సూర్యవంశనృప♦సోముఁడు కారణరూపి యోగిహృ
ద్ధాముఁడు పాపమారకసు♦నాముఁడు నన్నుఁ గృతార్థుఁ జేయుతన్. ౧౧౧

ఉ. వారక కేలుమోడ్తు నని♦వారితవారిధిగర్వహర్తకున్
వారిజవాసినీహృదయ♦భర్తకు భక్తజనోపకర్తకున్

ఘోరగహారమానసవి♦హా ర్తకు లోకకదంబక ర్తకుం
గారణరూపధర్తకు న♦కల్మషవేదవచఃప్రవ క్తకున్. ౧౧౨
సీ. మొలచుట్టు పులివాలు ♦ తలచుట్టు మిన్నేఱు, వెలిచట్టుదానుండ♦వేడ్కపట్టు
డబ్బుడబ్బనుడోలు ♦ గబ్బులీనెడుసాలు, ముమ్మొనల్గలగోల ♦ మొనసికేల
గంగమ్మ తలనెక్కి ♦ గౌరమ్మ నొకచక్కి, గుజ్జుదేవరదంట ♦ కూడి వెంటఁ
బెనుచేదు కవణంబు ♦ విసదారి రవణంబు, ముందలనెలవంక ♦ ముద్దుజింక
తే. వెలయు జంగముదేవర♦వేడ్క మీఱ, మదిని గలకాల మెవ్వని♦స్మరణసేయు
నట్టినాపాలివేల్పు నా♦రాయణుండు, జానకీజాని నన్ను ర♦క్షణముసేయు. ౧౧౩
వ. అని ధ్యానించి నమస్కరించి శుకయోగీంద్రుండు పరిక్షిన్నృపాలున కెఱింగించిన తెఱంగున నీకు విన్నవించితి. ౧౧౪
సీ. సత్యసంకల్ప నా♦జసయిత్రికోరిక, నెఱవేర్పఁ గనుట నీ♦నెనరుగాదె
నాకాఱియలలోన ♦ నీకృతి కొనసాగఁ, గాంచుటలెల్ల నీ♦కరుణగాదె
సుమతులైనట్టినా♦సుహృదులు గని సాధ్వ, భిప్రాయు లగుట నీ♦పేర్మిఁగాదె
చేజాఱిపడుచున్న ♦ జీవజీవనము లు,ద్ధారణమౌట నీ♦దయయకాదె
తే. మత్కృతులనెల్ల నీకిచ్చు ♦ మతిగలుగుట, నీదుప్రేమంబ యిన్నింట ♦ నీదుకృపకు
నర్హుఁడైనాఁడ నన్ధైర్య ♦ మబ్బెనింక, నెవ్వరేమన్ననంద్రు నా♦కేమికొదవ.
తే. యత్కరోషి కురుష్వ మ♦దర్పణమని, యన్ననుడి నమ్మి నీకు స♦మర్పణంబు
చేసితిని నింక నేమైనఁ♦జేయవయ్య, జానకీరామ శ్రీభద్ర♦శైలధామ! ౧౧౫

కల్పితకల్పవల్లీభాస్కరవిలసితవృత్తము.

సారదతను జిత♦సారమసారా !♦సారసనగ ! హరి!♦సరసవిచారా !
హారకలితగళ! ♦ హారివిహారా ! ♦ హారిసురుచియుత♦యదుకులవీరా !
వారణమదహర ♦ పాపనివారా ! ♦ వారిధిగృహ ! సుర♦పరసువిదారా
కారితహరి ! మధు♦కైటభకారా ! ♦ కారణతనుగత♦కమఠశరీరా. ౧౧౬

ముక్తాహారబంధము—మౌక్తికమాలావృత్తము.

సారసనేత్రా ! య♦జ భవనాశా !
నారదకాయా ! మ♦ననపరత్రా !
గ్లౌరవినేత్రా ! య♦ఘభయనాశా!
నారదగేయా ! ఘ♦నసుపవిత్రా ! ౧౧౭

ఆందోళికాబంధము—కనకలతావృత్తము.

అరినికరహనన ! హరిహయ♦హరనుత ! గతసుతలా !
ఖరహర ! దరయుతకర ! కన♦కవసన ! శుభచరితా !
నరహిత!సుఖద!సరసముగ♦నను పసుఖతఁ గనుమా
కరుణచెలఁగ సుముఖతఁ గుము♦ఖతతి నణఁపఁ గనవే. ౧౧౮

కం. సా(హం)కృతిదుర్జనదూ, రా! హంవీరారిపరశు♦రామస్మయవా
రా! హాటకచేల! నతాం, హోహాహాననా! ధవళనీర♦జోపమనయనా!

**శ్రీకంఠభూషణవృత్తము.**

ని(స్తు)లకరుణా♦నిధి! దాశరథీ!
ప్రస్తుతసుగుణా♦వధి! కీశరథీ!
ధ్వస్తవినత! సా♦దరధీ! విరథీ!
స్వస్తి యవిత పా♦వనధీ! వరధీ! ౧౨౧

**గద్యము**

ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిందాయమానమానసత్వమహావైభవ
వావిలికొలను రామచంద్రరాయతనూభవ సుజనవిధేయ సుబ్బరాయ
నామధేయ ప్రణీతంబైన శ్రీకౌసల్యాపరిణయంబునందు
షష్ఠాశ్వాసము సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు.



Solden & Co., Madras, S.E.

# బ్రహ్మశ్రీ వావిలికొలను సుబ్బరావుగారు

## విద్యాన్నదాన కైంకర్యములకుఁగాను శ్రీమదొంటిమిట్ట కోదండరామస్వాములవారికి సర్వస్వాతంత్ర్యములతో సమర్పించిన

# పుస్తకముల పట్టి.

---

వీనినిఁ గొని చదువువారు చదివించువారు తాము తమ బాలుర బాగుపడుటయేగాక భగవద్ధర్మ కార్యమునకు సహాయపడిన పుణ్యమార్జింతురు,

1. శ్రీమదాంధ్రవాల్మీకి రామాయణము. 4-వ కూర్పు లఘుటీకతోడ మొదటి

| | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|
| సంపుటము కాలికో బైండు | ... | 4 | 0 | 0 |
| లఘుటీకతోడ రెండవ సంపుటము | ... | 4 | 0 | 0 |
| మూఁడుసంపుటములు | ... | 10 | 0 | 0 |
| ఏడుసంపుటములు | ... | 13 | 0 | 0 |
| సుందరకాండము | ... | 1 | 0 | 0 |
| 2. శ్రీకృష్ణలీలామృతము (వచనకావ్యము) 1-వ భాగము | ... | 1 | 12 | 0 |
| ,, ,, 2-వ భాగము | ... | 2 | 4 | 0 |
| ,, ,, 3-వ భాగము | ... | 2 | 0 | 0 |
| శ్రీకృష్ణావతారతత్త్వమంతయుఁ బ్రత్యేకపీఠికగాఁగల 4-వ భాగము | ... | 2 | 4 | 0 |
| (ఇది నూతన వచన మహాగ్రంథము. నానా పురాణేతిహాసములఁగల కృష్ణచర్య యిందు సమకూర్పఁబడినది. సమస్తాంధ్ర స్త్రీ పురుషులకు నవశ్య పఠనీయము. ఇందుఁ జిత్రపటములుగలవు. పైనాలుగు భాగముల నొక్కమారుగ కొనువారికి అట్టబైండుతో రూ. 7-8-0 నకే యియ్యఁబడును. కాలికోబైండుతో 2 సంపుటములుగ గిల్టు అక్షరముల పేరుతో గలది. | ... | 8 | 0 | 0 |
| శ్రీకుమారాభ్యుదయము, 2-వ కూర్పు (రంగుకాగితము) | ... | 1 | 0 | 0 |
| 4. సుమనోల్లాసము, పైదానికి టీక (పునర్ముద్రణము కావలెను) | | | | |
| 5. శ్రీకౌసల్యాపరిణయము,2-వ కూర్పు పెద్దయక్షరములు (నిండుకాలికో) | | 1 | 4 | 0 |
| 6. † సుభద్రావిజయము, 3-వ కూర్పు (నిండుకాలికో) | | | | |
| 7. కౌసల్యాపరిణయటీక ప్రథమాశ్వాసము | ... | 0 | 12 | 0 |
| కౌసల్యాపరిణయముతోడఁ దీసికొనిన | ... | 0 | 6 | 0 |
| 8. బమ్మెర పోతన నికేతనచర్చ | ... | 1 | 0 | 0 |
| 9. బమ్మెర పోతరాజ విజయము | ... | 0 | 12 | 0 |
| N. B.—8-9 ఈరెండును గ్రంథాలయములవారికి 0-14-0 కీయఁబడును. | | | | |
| 10. బమ్మెర పోతన గీతములు, రామనుతి, కృష్ణనుతి. | ... | 0 | 1 | 0 |
| 11. ఇవి టీకతోడఁ గలసిన నుతిత్రయము | ... | 0 | 4 | 0 |
| 12. బమ్మెరపోతన రత్నములు, (కాలికో,మూఁడవకూర్పు) | ... | 0 | 14 | 0 |

భాగవతములోని మంచిపద్యములన్నియు నేటి భక్తి, నీతి, స్తుతి, వైరాగ్యాదులు తరగతులుగ విభజించి కూర్పఁబడినవి. 500 కక్కువపద్యములు గలవు. ప్రత్యాంధ్రుఁడును నుదయమునఁబఠింపఁదగినది.

| | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|
| 13. శ్రీ కాళహస్తిమాహాత్మ్యము (ధూర్జటికవి ప్రణీతము) | | | | |
| ,, రెండవకూర్పు (పగముకాలికో) | ... | 1 | 0 | 0 |
| 14. భీమఖండము (శ్రీనాథప్రణీతము) పగము కాలికో) | ... | 1 | 0 | 0 |
| 15. కృష్ణమంజరి | ... | 0 | 1 | 0 |
| 16. † సులభవ్యాకరణము, 5-వ కూర్పు 1-వ భాగము | ... | 0 | 11 | 0 |
| † ,, 3-వ ,, 2-వ ,, | ... | 1 | 12 | 0 |
| † ,, 3-వ ,, 3-వ ,, | ... | 0 | 9 | 0 |

17. ఆర్యకథానిధి 8 భాగములు. 18. ఆర్యచరిత్ర రత్నావళిమాలికా గ్రంథములు. 19. భక్తి ప్రసూనమాలికాగ్రంథములు. 20 హితచర్యమాలికా గ్రంథములు ఈ వన్నియు యీ దిగువ విలాసమునకు దొరుకును.

| | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|
| 21. ముముక్షుహితచర్య 2 భాగములు (కాలికో బైండు) | ... | 2 | 2 | 0 |
| ,, ప్రథమభాగము (రంగుకాగితమునకు) | ... | 0 | 14 | 0 |
| ,, ద్వితీయభాగము | ... | 0 | 14 | 0 |

౧. శ్రీరామజయమందిరము. నెం. ౨౧. రాజా హనుమంతలాలావీధి, తిరువళిక్కేణి, మదరాసు.

౨. శ్రీరామసేవాకుటీరము, ఒంటిమిట్ట, కడపజిల్లా.

౩. ఎం. పి. శర్మ ఆంధ్రగ్రంథాలయము, నెల్లూరు.

వీరిలో నెవరికైనను వ్రాసి తెప్పించుకొనవలయును.

